అపరాధ పరిశోధన అనుబంధం—5

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## రాకాసి మనుషులు!

రచన: సుజనశ్రీ

## తాజా శవం?

రచన: శ్యాంబాబు

## సముద్రపు దొంగలు ?

రచన: మల్లాది వెంకటకృష్ణమూర్తి

## చావుకోసం ఎదురుచూడు!!

రచన: ఏ. పీ. మోహన్రావ్

అపరాధ పరిశోధన సప్లిమెంట్—5
మే, 1974
వెల: రు. 2-50

ఏడాది చందా 33 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
మల్లాది వెంకటకృష్ణమూర్తి
వాసవదత్త
కంచర్ల రమణ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
శ్యాంబాబు
మిస్. మధుబాల

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైద్రాబాదు-29
ఫోన్—36959

ముద్రణ:
క్రాంతి ప్రెస్
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

# మీరే ఎన్నుకోండి?

ఈ "సప్లిమెంట్" లో మొత్తం నాలుగు క్రైమ్ నవలలు ప్రచురించబడ్డాయి. నాలుగు నవలలూ మీ అభిమాన రచయితలు రాసినవే. వీటిలో మీకు అత్యుత్తమంగా తోచిన నవల పేరు ఒకటవ నెంబరు ప్రక్కన వ్రాయండి. తర్వాత వరుసక్రమంలో మీకు నచ్చిన మిగతా మూడు నవలల పేర్లు పూరించండి. పాఠకుల ఎన్నిక ప్రకారం అత్యుత్తమ నవల నిర్ణయించబడుతుంది.

పాఠకులు ఉత్తమ నవలగా ఎన్నుకొన్న ఆ నవలా రచయితకు రు. 116/- లు బహుమతి, నాలుగు నవలల ఎన్నికను సరైన వరుసక్రమంలో చెప్పగలిగిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10/- లు చొప్పున బహుమతి ఇవ్వబడుతుంది.

కూపన్

మే '74 నెల "సప్లిమెంట్"లో మేము మెచ్చిన నవలలు వరుసగా ఇవి:

1 ..............................

2 ..............................

3 ..............................

4 ..............................

పై కూపను కొట్టివేతలు లేకుండా పూర్తి చేసి, యీ పేజీ పూర్తిగా కత్తిరించి, యీ నెల 10 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి. మీ చిరునామా వెనుక ప్రక్కన వ్రాయటం మరచిపోవద్దు. ఫలితాలు వచ్చే నెల "అపరాధ పరిశోధన" మాసపత్రికలో ప్రచురించబడతాయి.

# రాకాసి మనుషులు !

సుజనశ్రీ

ఆకాశంలో పేరుకున్న మంచు ఇంకా విడిపోలేదు. సూర్యోదయం కావటానికి ఇంకా ఆలస్యం ఉంది.

విశాఖపట్నం రేవులోంచి ప్యాసింజెరు షిప్ "M. V. అండమాన్" నలభై ఎనిమిదిమంది ప్రయాణీకులతో అండమాన్ దీవులకు బయలుదేరింది. వాళ్ళలో చాలామంది తెలుగు దేశంలోని కార్మికులు. నలుగురైదుగురు ప్రభుత్వోద్యోగులు కూడా ఉన్నారు.

పోర్ట్ బ్లయర్ చేరటానికి ఆ నౌక అరవైగంటలు ప్రయాణం చేయాల్సి ఉంది. అంటే 704 నాట్ మైళ్ళు (నాట్ అనగా 6080 అడుగులు). సముద్రంమీద దూరాన్ని నాట్ మైళ్ళలో కొలుస్తారు.

మధ్యలో మద్రాసు, కొచ్చిన్, నాగపట్టణం రేవుల్ని కూడ తాకుతుంది "అండమాన్" నౌక.

నౌకలో ఫస్ట్‌క్లాస్ ప్రయాణీకులు ఆరుగురున్నారు. ఒకాయన పోర్ట్ బ్లయర్‌లో పెద్ద ప్రభుత్వోద్యోగి. పేరు రామానుజం. మనిషి ఎర్రగా, పొడుగ్గా, ఎంతో హుందాగా ఉంటాడు. మితభాషి. తనకన్న తక్కువ వారితో మాట్లాడడం పనికిరాదనే ఉద్దేశం కలవాడు.

రెండో వ్యక్తి మైకేల్. రెవరెండ్ ఫాదర్ ఛార్లస్ మైకేల్‌సన్ అతని పూర్తిపేరు. అమెరికాదేశపు మిషనరీ తరఫున ప్రచారానికై వెడుతున్న వ్యక్తి.

మూడో వ్యక్తి భారతీయుడు కాదు. అతడు జర్మనీ దేశసుడు. అతని పేరు ఆల్టెవోట్. మనిషి అజానుబాహువు. తెల్లగా ఉన్నాడు. పిల్లిగడ్డం, కోర మీసం మినహాయిస్తే అతని ముఖం అద్దంలా నున్నగా ఉంది. అతను జంతుశాస్త్రంలో ఎం. ఎస్. సి. ప్యాసై అదేదో వింతరకం జీవి గురించి రీసెర్చి చెయ్యటానికి అండమాన్ దీవులకు బయలు దేరాడు.

అతడు అన్వేషించే జీవి పేరు బిర్‌గస్ లాట్రో. ప్రపంచం అంతటిలోకి ఒక్క అండమాన్ దీవులలో మాత్రమే ఆ జీవి ఇంకా నివసించి ఉన్నదట. అది చూడటానికి రాక్షసి ఎండ్రకాయలా ఉంటుంది. మనుష్యులు నివసించే చోటు అంటే దానికి గిట్టదు. నిర్మానుష్యమైన కొన్నికొన్ని దీవులలో మాత్రమే ఆ రాక్షసి ఎండ్రకాయ లభ్యంకాగలదు.

అసలు అండమాన్ దీవులకు వెళ్ళాలంటే భారత ప్రభుత్వ అనుమతి అవసరం ముందుగా. తనకు తెలిసిన మంత్రిగారి నొకడ్ని పట్టుకుని పర్మిషన్ సంపాయించుకున్నాడు. తన కంపార్ట్‌మెంటులో కూర్చుని తన పుస్తకాలేవో తప్ప బయటి ప్రపంచంతో అతను ఎటువంటి లావాదేవీలూ పెట్టుకో

కుండా కూర్చున్నాడు.

నాలుగో వ్యక్తి బాబూ రాజేంద్ర. రాజన్ బాబు అని కూడ పిలుస్తారు అతడ్ని. బెంగాలీ వాడు. నావీలో ఉద్యోగం.వయసులో చిన్నవాడే. పెళ్ళయి రెండేళ్ళయింది. అత్తగారింటికి రహస్యంగా వెళ్ళి భార్యను కలుసుకుని వస్తున్నాడు. మనిషి చాల దురుసుగ ప్రవర్తిస్తాడు. గ్లాసు వెంట గ్లాసు బీరుని ఖాళీ చేస్తున్నాడు తన కంపార్ట్ మెంటులో కూర్చుని.

మిగతా ఇద్దరు వ్యక్తులు అండమాన్స్‌ని చూడటానికి వెళ్ళే టూరిస్టులు. బాంబేనుంచి వచ్చి విశాఖపట్నం చూసి అక్కడ్నుంచి అండమాన్ పోతున్నారు. చలాకీగా తిరుగుతూ తమ చుట్టూవున్న ఇతర ప్రయాణీకులతో కలుపుగోలుగా మాట్లాడుతూన్నారు.

జర్మన్ దేశస్థుడి పుస్తకాల్లో వింత వింతైన జంతువుల ఫొటోలపైన మరీ ఆసక్తి చూపిస్తున్నారు. ఒకతని పేరు నరేన్. మరోవ్యక్తి పేరు దేశాయ్. తాము ఎమ్. ఎస్. సి. వృక్షశాస్త్రం విద్యార్థులమనీ అండమాన్ దీవులలో పెరిగే వృక్ష సంతతిని చూడాలనే ఉద్దేశ్యంతో అక్కడకు వెళ్తున్నట్టుగా చెప్పుకుంటున్నారు.

* * *

డెక్ మీద కుర్చీలో చేరగిలబడి కూర్చున్నాడు రాజన్ బాబు. కాళ్ళు పారజాపి ఎదురుగావున్న కుర్చీలో పెట్టాడు. ప్రక్కనే టీపాయ్‌మీద ట్రేలో బ్రాందీ సీసాలున్నాయ్.

అతన్ని కనిపెట్టుకునివున్న బోయ్ గ్లాసు ఖాళీ కాంగానే మళ్ళీ నింపుతున్నాడు.

ప్రశాంతంగావున్న సముద్రజలాల్లో పల్లకీలాగ అటు ఇటు ఊగుతూ సాగిపోతూన్న నౌకలో నింపాదిగా 'సిప్' చేస్తూన్న రాజన్ బాబు ఉండివుండి పెద్ద కంఠంతో ఏదో

ప్రేమగీతం ఆలాపిస్తున్నాడు.

అతని పాటకు దూరదూరంగావున్న ఇతర ప్రయాణీకులు వినుక్కుంటున్నారు. కాని ప్రక్కనేవున్న 'బోయ్' మటుకు అతని పాటను ఆనందిస్తున్నవాడిలా నవ్వుతున్నాడు మధ్య మధ్యలో.

'బోయ్' అండమాన్ దీవులకు చెందినవాడే. మనిషి అనాగరికంగా, మోటుగా ఉన్నాడు. తెల్లటి నిక్కరు, తెల్లని బనీను వేసుకుని వున్నాడు. మనిషి నలుపు. పెదాలు నీగ్రోవాడి పెదాల్లా బండల్లాగున్నాయ్.

అతడి తండ్రి ఈ నౌక కెప్టెన్‌కి ఆ కుర్రవాడ్ని అమ్మి వెళ్ళాడు. ఎంతకు? ఒక కట్ట పొగాక్కు బదులుగా. ఆ పొగాకు కట్ట ఇచ్చినందుకుగాను ఆ కుర్రాడు ఏడాదిపాటు ఆ నౌకలో సేవకుడిగా ఉండాలి. తిండీ, బట్ట తప్ప వేరే పైసాగూడ రాదు వాడికి.

అతగాడు రాజన్‌బాబు గిరజాల జుట్టువంక ప్రియురాల్ని ఆశగా చూసే ప్రియుడిలా చూస్తున్నాడు.

గ్లాసుమీద గ్లాసుని ఖాళీచేస్తున్న రాజన్‌బాబు వంక చూసి అమితంగా జాలిపడ్డ వ్యక్తి ఫాదర్ మైకేల్.

తను కూర్చున్న చోటునుంచి లేచి రాజన్ కేసి నడిచాడు. ఒక చేతిలో బైబిల్‌ని పుచ్చుకుని మరో చేత్తో అతన్ని తట్టి పిలిచాడు.

"మిస్టర్! మీరిలా అతిగా త్రాగడం బాగోలేదు. మీ ఆరోగ్యం గురించి మీకు ఏమీ పట్టినట్టులేదు" అన్నాడు.

కాని అతగాడి మాటలు రాజన్ చెవికెక్కించుకోలేదు. ఫాదర్‌వంక అతని మెడలోని శిలువవంక ఎగాదిగా చూశాడు.

"హలో ఫాదర్! యూ ఆర్ టూ ఎర్లీ! నేనింకా డెత్ బెడ్... మరణశయ్యమీదకు పోక ముందే వచ్చారేం? నా పాపాల్ని, మనసుని నింపివేసిన పాపాల్ని చెప్పించి నన్ను

ప్రక్షాళనం చెయ్యాలని వచ్చారా?" అని నవ్వాడు.

"ఇక త్రాగటం ఆపెయ్యి!" అంటూ ఫాదర్ బోయ్‌కి సంజ్ఞ చేశాడు వెళ్ళిపొమ్మన్నట్టు. బోయ్ బ్రాందీ సీసాని చంకలో ఇరికించుకుని వెళ్ళబోయాడు.

"ఒరేయ్! ఎక్కడికిరా నీవు! నేను వెళ్ళమనందే వెళ్ళావా డొక్క చీలుస్తాను" అంటూ అరిచాడు రాజన్.

బోయ్ ఆగిపోయాడు. "ఫాదర్! నా ఆరోగ్యం గురించి నీవేం బెంగెట్టుకోనక్కర్లేదు. నిశ్చింతగా వెళ్ళి బైబిల్ తెరుచుకుని ప్రార్థనలు చేసుకోండి!" అంటూ గ్లాసులో మిగిలివున్న ద్రవాన్ని ఒక్కసారిగా నోట్లోపోసుకున్నాడు.

ఫాదర్ జాలిగా అతన్నే చూస్తూ వెళ్ళిపోయాడు.

రాజన్‌బాబుకు క్రమక్రమంగా మత్తు ఆవరిస్తోంది. ఆ మత్తులో జరిగిపోయిన సంఘటన, తన మనసుపై చెరగని ముద్రవేసిన సంఘటన సినిమాలా కనిపిస్తున్నది.

తనకు వివాహమై సరిగ్గా ఏడాది. తన భార్య సవిత చాలా అందగత్తె. ఆమె లభించినందుకు తను ఎంతో గర్వపడిపోయాడు. కాని ఆ ఆనందం ఎంతోకాలం నిలవలేదు. సవిత మరెవర్నో ప్రేమించిందనీ, పెద్దల బలవంతంమీద తనతో బలవంతంగా వివాహం జరిగిందనీ తెలిసేసరికి అతని హృదయం భగ్గుమంది.

పైగా ఆమె తన ప్రేమికుడితో ఇంకా సంబంధం కలిగి ఉండటం అగ్నిలో ఆజ్యం పోసినట్టయింది. అందుకే ఒక రాత్రి తను రాడనుకుని ఒకరి కౌగిట్లో మరొకరు హాయిగా ఉన్నప్పుడు తను వెళ్ళాడు ఇంటికి. కత్తితో ముందుగా ఆమె ప్రియుడ్ని పొడిచేశాడు. ఆ తర్వాత సవితను కసిదీరా ఆమెకు అందాన్నిచ్చే ప్రతిచోట పొడిచాడు.

ఆ తర్వాత ఎవరూ చూడకుండా ఇంట్లోనుంచి జారుకున్నాడు. తను డ్యూటీలో ఉన్నట్టుగా ఎలిబీవుంది.

## 10

మర్నాడు తన పేరిట నావల్ హెడ్‌క్వార్టర్స్‌కి టెలిగ్రామ్ వచ్చింది భార్య చనిపోయిందని. తనివిదీరా ఆనందించాడు ఆ టెలిగ్రామ్‌ని చూసి. దాన్ని పై ఆఫీసర్లకు చూపి నెలరోజులు సెలవు మంజూరు చేయించుకున్నాడు. ఇంటికి వెళ్ళకుండా ఎక్కడికైనా సరే, తన మనసుకు ప్రశాంతత నిచ్చే చోటుకు, ఆడదాని వాసన తగలని సుదూర ప్రదేశానికి వెళ్ళాలని, బయలుదేరాడు.

అండమాన్ దీవులయితే తన మనసులో ఉద్దేశ్యానికి సరిపోతయ్యని అతడి నిర్ణయం. ఈ నెలరోజులూ అక్కడే గడపాలని అతడి ఆశయం.

మత్తుగా కుర్చీలో వాలిపోయిన యజమానిని భుజాన వేసుకున్నాడు బోయ్. తీసుకువెళ్ళి అతని రూమ్‌లోని బెడ్ మీద పడుకో బెట్టాడు.

తల క్రింద ఎత్తుగా తలగడలు సర్దాడు. షెల్ఫ్‌లోంచి దువ్వెనతీసి గిరజాలు తిరిగిన అతడి జుట్టుని నెమ్మదిగా దువ్వాడు.

బంగారుగని లభిస్తే సంబరపడే నాగరికుడిలా ఆ కేశాల్ని చూసి ఆ అనాగరికుడు సంబరపడిపోతున్నాడు.

## 2

జర్మన్ సైంటిస్టు ఆల్టేవోట్ బీర్‌ని సిప్ చేస్తూ తన ముందున్న పుస్తకాల్ని ఒక్కొక్కదాన్ని తిరిగేస్తున్నాడు. కొంచెంసేపటి తర్వాత మరో లావుపాటి పుస్తకంలోంచి మ్యాప్ నొకదాన్ని తీశాడు. దాన్ని పూర్తిగా తెరిచి బెడ్ మీద పరిచాడు.

అండమాన్ నికోబార్ దీవుల పటం అది. నిర్మానుష్యమైన దీవులతో సహా, చిన్న చిన్న అనేక దీవులున్నాయ్ అందులో. కొన్ని దీవులమీద ఆ మ్యాప్‌లో ఎక్స్ గుర్తులున్నవి.

వాకిలి దగ్గర నిలబడి లోపలికి తొంగిచూస్తున్న దేశాయ్ నరేన్ లిద్దరూ ఏదో సంజ్ఞ చేసుకున్నారు.

సైంటిస్టు వాళ్ళరాకని గమనించకుండా తదేకంగా మ్యాప్ వంకే చూస్తున్నాడు.

“మే వుయ్ కమిన్ సర్?” అని అడిగాడు దేశాయ్ గొంతు సవరించుకుంటూ.

“యస్! యస్! వెల్ కమ్!” అంటూ అల్పేవోట్ వెనక్కు తిరిగి ఆగంతుకు లిద్దర్నీ చూశాడు.

“థాంక్యూ!” అంటూ ఇద్దరూ లోపలకు నడిచి అతని బెడ్ ప్రక్కగా ఉన్న స్టూల్స్ మీద కూర్చున్నారు.

“ఏమిటిసార్ ఈ మ్యాప్!”

అతడు నవ్వాడు. “ఏముంది? ఎవడిపిచ్చి వాడికి ఆనందం. నేను వెళ్ళవలసిన ద్వీపాలు ఇవి” అంటూ ఎక్స్ గుర్తున్న ప్రదేశాలవంక చూపాడు.

“అక్కడ మనుషులుంటారా సార్?”

“ఉండరనే నా అనుమానం. నరసంచారం ఉన్నచోట ఈ రాక్షసి ఎండ్రి సంచరించదు.”

“అంటే ఈ పటంలో ఉన్న దీవుల్లో వేటిలోనూ నరసంచారం ఉండదా సార్?”

“అలా అని చెప్పలేం! కొన్ని దీవుల్లో మటుకు మనుషులు వుండరు. ఇంకా కొన్నింటిలో ఆటవిక జాతులు, నాగరికత వాళ్ళ భూభాగంలోకి రావటం ఇష్టంలేని మోటుమనుష్యులు ఉండచ్చు.”

“సార్! మాదో చిన్న రిక్వెస్ట్! మీరు అనుమతించాలి!”

“ఎస్! టెల్ మి ఫస్ట్!”

“మరేంలేదు. మీరు ఇన్ని వేలమైళ్లు ప్రయాణంచేసి దేన్నైతే చూడాలని– అదే ఆ వింత ప్రాణిని, చూడాలని మాకూ కుతూహలంగా వుంది. అందుకని మీతోబాటు మా

ఇద్దర్నీ రానివ్వాలి.''

''ఓస్! ఇంతేకదా?''

''అంతేసార్! మీ కిటూ మీ లగేజీ, పరికరాలూ అవీ పట్టుకురావటానికి మనుష్యులు కావాలిగదా! ఆ పనికి మమ్మల్ని నియమించుకోండి! అటు మీపని జరిగిపోతుంది. ఇటు మాపనీ జరిగిపోతుంది.''

''అబ్బెబ్బే! అంతమాట అనకండి. మీరు నా ఫ్రెండ్స్. మీ చేత కానిపనులు చేయిస్తానా? ఊరికే నావెంట రండి. సామాన్లంటారా? అక్కడ మనుష్యుల్ని, కూలీలుగా తీసుకెళ్దాం!''

''థాంక్యూ! థాంక్యూ సార్!'' అన్నారు ఇద్దరూ ఆనందంగా.

''అండమాన్ దీవుల గురించి నాకు తెలుసుకోవాలని వుంది. నాకు చిన్నప్పటినుంచి జాగ్రఫీ అంటే ఎంతో అభిమానం. పెద్దయిన తర్వాత మారుమూల దీవుల్లో ఉండే నరమాంస భక్షకుల సంగతి వినాలనే థ్రిల్ ఎక్కువయింది. అన్నట్టు ఆల్టేవోట్ గారూ! మనం వెళ్ళబోయే దీవుల్లో మనుష్యుల్ని పీక్కుతినేవాళ్ళుంటారా?''

దేశాయ్ కుతూహలంగా అడిగాడు.

''ఏమో చెప్పలేం! బహుశా ఎవరూ ఉండరనే నా అభిప్రాయం. కాని అంతకన్న భయంకరమైన తెగలవాళ్ళు వున్నారని విన్నాను. వాళ్ళను మనం ఒకసారి మాత్రమే చూడగలుగుతామట. రెండోసారి చూసేలోపలే వాళ్లు మనల్ని చంపేస్తారు!''

''అయ్యబాబోయ్! మీ మాటలు వింటూంటే మనం సక్రమంగా ఇంటికి తిరిగి రాగలమో, లేదో అనిపిస్తోంది సార్!''

''అలా ఎందుకనుకోవాలి! నిజానికి ఆటవికులమధ్యకన్న,

అడవీ ప్రాంతంలో తిరుగాడే క్రూరమృగాలకన్నా భయంకరమైన మనుష్యులు వున్నారు నిత్యం మనం తిరుగాడే సంఘంలో. మనం అడవిలోకి వెళ్తున్నామనుకోండి. ఏదైనా పులిగాని, చిరుతగాని వస్తుందేమో అని చాల జాగ్రత్తగా వెళ్తాం. మెళకువగా వుంటాం. కాని ఈ సంఘంలో ఏ మానవుడు ఏవేళప్పుడు ఏప్రమాదాన్ని తెచ్చిపెట్టగలడో ఎవరు చెప్పగలరు?'' అంటూ సైంటిస్ట్ నరేన్, దేశాయ్‌ల వంక చూశాడు.

వాళ్ళిద్దరూ గతుక్కుమన్నారు. కొంపదీసి తమ నుద్దేశ్యించి అనటంలేదుగదా అని భయపడ్డారు.

## 3

తలుపు తెరుచుకుని బోయ్ లోపలకు వచ్చాడు.

''ఒరేయ్! ఎక్కడకు చచ్చావురా? ఖాళీసీసా ముందు పారేసిపోయావే?'' అరిచాడు రాజేంద్ర.

''బ్రాందీ అయిపోతే స్టోర్ కళ్ళానండీ తెద్దామని!'' బోయ్ బెరుకుగా అన్నాడు.

''గుడ్ బాయ్! ఏదీ త్వరగా ఓపెన్ చేసి గ్లాసునింపు!''

బోయ్ గ్లాసు నింపితే రాజేంద్ర ఖాళీ చేస్తున్నాడు. ఒక గ్లాసు తర్వాత మరో గ్లాసుని నింపాదిగా సిప్ చేస్తున్నాడు.

''అరేయ్! నీకు పెళ్ళయిందా?''

''లేదుసార్! ఇంకా పెళ్ళీడు రాలేదు నాకు!'' సిగ్గు అభినయిస్తూ అన్నాడు బోయ్.

''పెళ్ళి చేసుకోమాకురా అసలు! ఆడదాన్ని ఛస్తే నమ్మకు! తెలిసిందా?''

బోయ్ నవ్వాడు.

''అసలు మీదే దేశంరా?''

''అండమాన్ దీవుల్లోనే ఒక చిన్నద్వీపం. మానాన్న నన్ను పదేళ్ళ వయసప్పుడే ఒక ఓడ కెప్టెన్‌కి అమ్మేశాడు.

ఎంతకో తెలుసా సార్?"

"ఎంత కేమిటి?"

"వంద కట్టల పొగాకు!"

"వాట్! మనుషుల్ని పొగాకుకన్న చవకబారుగా అమ్మారా?"

"అంతేకాదు సార్! మా తెగలో ఒక ఆచారముంది సార్! నాలాంటివాడికి వివాహం కావాలంటే, ఒక విలువైన వస్తువుని, కష్టపడి సంపాయించుకు రావాలి సార్!"

"ఓస్ ఇంతేకదా! నీకు ఎంత డబ్బు కావాలో చెప్పు నేనిస్తాను...ఆ డబ్బుతో ఆ వస్తువుని కొనుక్కొని వెళ్ళి హాయిగా పెళ్ళిచేసుకుని జీవించు."

"అలా ఊరకే వచ్చిన సొత్తు అందుకు పనికిరాదుసార్!"

"నీకు సుఖపడేయోగం లేదురా! ఏంచేస్తాం. పోయ్ ఇంకో గ్లాసు!"

మరో రెండు గ్లాసులు త్రాగి రాజేంద్ర పడిపోయాడు. అతడ్ని భుజాన వేసుకుని తీసుకువెళ్ళి బెడ్ మీద పడుకో బెట్టాడు బోయ్. స్టాండ్ మీద ఉన్న దువ్వెన తీసి గిరజాలు తిరిగిన అతడి జుట్టుని ప్రేమగా నిమురుతూ దువ్వాడు.

ఎర్రని అతడి ముఖాన్ని, నల్లగా నిగనిగలాడే అతడి కురులవంకా చూస్తూ ఉండిపోయాడు.

ఇంకో గంటలో ఈ ఓడ పోర్టు బ్లయర్ చేరుతుంది. ఆ తర్వాత తన పని నెరవేర్చుకోవాలి అనుకున్నాడు బోయ్.

# 4

తెల్లవారుతూనే ఓడ పోర్ట్ బ్లయర్ చేరుకుంది. రావలసిన సమయానికి ఆరుగంటలు మాత్రమే లేటుగావచ్చి ఇండియన్ రైల్వేస్ కేమీ తీసిపోదని నిరూపించుకుంది.

ప్యాసింజర్సు అందరూదిగి పోర్టులో కస్టమ్స్ ఆఫీసులోకి నడుస్తున్నారు.

సైంటిస్ట్, నరేన్, దేశాయ్ ముగ్గురూ ప్రభుత్వ గెస్ట్ హౌస్‌లో దిగారు.

సైంటిస్ట్ అటెలెవోట్ ప్రభుత్వాధికారుల్ని కలుసుకుని తన ప్రయాణానికి మోటార్ బోట్‌ని సంపాదించాడు.

వీలైనంత తక్కువ లగేజీని ప్యాక్ చేసుకున్నాడు. ఒకటి రెండు ముఖ్యమైన పుస్తకాలు, తన డైరీ, ట్రాన్సిస్టర్ రేడియో, కంపాస్ రెండు లోడ్ చేయబడ్డ పిస్తోళ్ళు, లాంగ్ రేంజ్ రైఫిల్ ఒకటి, బైనాక్యులర్స్, బ్రెడ్ పాకెట్స్, డబ్బాలలో ప్యాక్ చేసి సీలువేయబడ్డ బట్టర్ టిన్నులూ, బ్రాందీ సీసాల కేస్, గుడారాలు వేసుకోవటానికి అనువైన పెద్ద టార్పాలిన్‌లూ, ఇతర పనిముట్లూ ఉన్నాయ్ అతని లగేజీలో.

సామాన్లు మోసేందుకూ, ఇతర అవసరాలకు పనికివస్తారని నలుగురు మనుష్యులను కుదుర్చుకున్నాడు.

మోటారు బోటు సముద్రంలో ప్రయాణిస్తోంది. పేర్లు తెలియని చిన్న దీవుల్ని, నరసంచారం కానరాని దట్టమైన చెట్లతో నిండిన దీవుల్ని దాటుకుంటూ వెళ్ళి సాయంత్రానికి మరో దీవిదగ్గర బోటు ఆగింది.

అందరూ దిగి బోటుని లంగరు వేసి దీవిలోకి దిగారు. దట్టంగావున్న కొబ్బరి చెట్లమధ్య డేరా వేశారు.

అందరూ బ్రెడ్ తిని డేరాలోకి దూరి పడకమీద పడుకున్నారు. దేశాయ్ అరుబయట పడుకుంటానన్నాడుగాని అది చాల ప్రమాదమనీ, ఈ కొత్తప్రదేశంలో అలాటి పని చెయ్యొద్దని సైంటిస్ట్ చెప్పినమీదట దేశాయ్‌గూడ లోపలకు వెళ్ళి పడుకున్నాడు.

సైంటిస్ట్ ఫోల్డింగ్ చైర్‌నొకదాన్ని అరుబయట ఇసుకలో వేసుకుని కూర్చున్నాడు. అతని బుజానికి ఫ్లాష్‌లైట్ వేలాడుతోంది. చేతిలో రైఫిల్ పట్టుకుని కూర్చున్నాడు.

నరేన్ గూడ అతనికి దగ్గరే మరో ఫోల్డింగ్ స్టూల్ వేసుకుని కూర్చున్నాడు తనకు నిద్రరావటం లేదని.

దేశాయ్ గూడ వాళ్ళతో కూర్చుందామని అనుకున్నాడు గాని నిద్ర ఆపుకోలేక అతడు వెళ్ళి పడుకున్నాడు.

ఆకాశంలో మినుకుమినుకుమనే నక్షత్రాలు మానవునిలో మెరిసే ఆశల్లాగ మందకొడిగా కన్పిస్తున్నాయ్. హోరుమనే గాలి. చుట్టూ ఆవరించివున్న చీకటితో పోటీలు పడుతోంది అవధులులేని సముద్రం. ఉవ్వెత్తుగా లేచి పడే అలలు తీరాన్ని తాకి మళ్ళీ నురుగులు వెదజల్లుతూ వెనక్కు పరుగిడుతున్నాయ్.

జర్మన్ సైంటిస్ట్ ఆల్టేవో చెవులు రిక్కించి వింటున్నాడు.

అతడి కళ్ళు చీకటిలో ఎలుకలకోసం వేచివుండే పిల్లి కళ్ళలా కాపలా కాస్తున్నాయ్ వేటికోసమో.

ఇసుకలోంచి రంధ్రాలు చేసుకుంటూ పైకి వస్తున్నాయ్ పెద్దపెద్ద ఎండ్రకాయలు. ఈ జీవి ప్రపంచలోకెల్లా పెద్దదైన జాతివి. ఒక్కొక్కటి మూడునాలుగు కిలోల బరువు ఉంటుంది.

దీని గిట్టలు ఎంత బలమైనవంటే, ఒక కొబ్బరికాయను కేవలం గిట్టలతో సరిగ్గా సగానికి పగులగొట్టగలదు. అసంఖ్యాకమైన కొబ్బరిచెట్ల పైకి సునాయాసంగా పైకి ఎగబ్రాకి కొబ్బరికాయలను త్రుంచి పడవేస్తవి. ఆ తర్వాత క్రిందకు దిగివచ్చి వాటిని పగులగొట్టి ఆ కొబ్బరిని తింటాయ్. ఏదైనా ఇతర జీవి కనిపి:స్తే వాటిని చంపి తినగలవు. అటు మాంసాహారి ఇటు శాకాహారి గూడాను.

రెండవ ప్రపంచయుద్ధం అప్పుడు ఈ ఎండ్రకాయలనుంచి తీసిన నూనెని గ్లాసు రు. 50/- కొనేవారట. ఆ నూనె త్రాగితే ఎన్నోరకాల జబ్బులు నయమౌతయ్యాని మిలటరీలోని సిపాయిల నమ్మకం.

తీసి నీళ్ళలోకి దూకటానికి ప్రయత్నిస్తున్న ఆటవికులవైపుగా రెండుసార్లు కాల్చాడు.

ఆటవికుల్లో ఒకడు తుపాకిదెబ్బ తగిలి పడిపోయాడు. మిగతావాళ్ళు బెదిరిపోయి మళ్ళీ దీవిలోపలకి పారిపోయారు.

తుపాకి క్రింద పెట్టి, ఇంజన్ స్టార్టు చేశాడు. తను డేంజర్ జోన్ లోకి ప్రవేశించాడన్నమాట అనుకున్నాడు బోయ్.

ఇక్కడనుంచి తను వెళ్ళవలసిన దీవి చాల దగ్గరలోనే వుంది. కాని ఆకలి దహించి వేస్తున్నది. అయినా తమ ప్రయాణం ఇలా కొనసాగవలసిందే.

ఈపైన వున్న దీవులన్నీ ప్రమాదభరితమయిన ఆటవికుల సంచారం కలిగివుంటయ్. అందువల్ల ఏ దీవిలోనూ తను దిగ టానికి వీలుపడదు. అంటే ఇక వంటపని లేదన్నమాట.

తనయితే ఆహారంలేకుండా ఉండగలడు. కాని రాజేంద్ర వుండలేడు.

అతడు కొబ్బరిబొండాలు పగులగొట్టి ఆ నీళ్ళు రాజేంద్ర చేత త్రాగించాడు. ఆహారంకన్న అధికలాభాన్ని కొబ్బరి నీళ్లు ఇస్తాయని వాళ్ళకు చిన్నతనంనుంచే స్వతహాగా తెలి సిన విషయం.

ఈ ఒక్కరాత్రి గడిచి సవ్యంగా తెల్లారితే చాలు. తన పని నెరవేరుతుంది.

రేపటిమీది ఆశతో బోయ్ అనంతమైన భవిష్యత్తులోకి దూసుకుపోతున్నాడు.

## 6

నక్షత్రాల వెలుగులో ఆల్టేవో రిక్కించి చూస్తున్నాడు సముద్రం మీదికి.

సముద్రంలో దూరంగా నీళ్లు ఎగిరెగిరి పడుతున్నయ్. కెరటాలు ఉవ్వెత్తుగాలేచి మళ్ళీ క్రింద పడుతున్నయ్. సామాన్యంగా సముద్రంమధ్యలో ఉవ్వెత్తు కెరటాలు రావని

సముద్రంమీద ప్రయాణించే వారందరికీ తెలుసు.

ఆల్టేవో ఆతృతగా అటే చూస్తున్నాడు.

సందేహంలేకుండా అదేదో పెద్ద జంతువు అయివుంటుంది. కొంపదీసి అది ఏదన్నా పెద్ద తిమింగలం కాదుకదా అనుకున్నాడు అతడు.

అది తిమింగలమే అయితే తమని భగవంతుడుకూడా రక్షించలేడు. అలాకాకుండా మరో జంతువు, ఆక్టోపస్ గాని లేదా రక్కాసి సర్పాలుగాని, లేదా మొసళ్ళుగాని అయితే తన రైఫిల్‌తో సమాధానం చెప్పగలడు.

అలలు తగ్గిపోయినయ్. నల్లని ముద్దలాంటి ఆకారం నీళ్ళ మీద స్పష్టంగా కనబడుతోంది. కారు హెడ్‌లైట్లలా రెండుకళ్ళు తెల్లగా మెరుస్తున్నది.

భయంకరంగా తన ఎనిమిది హస్తాలతో ఈదుతూ ఒడ్డుకు వస్తోంది అది.

నరేన్ దాని ఆకారాన్ని చూసి వణికిపోయాడు.

"ఆల్టేవోసార్! దాన్ని ఎలా ఆపటం! ఎలా? ఎలా?" అని అరవబోయాడు. కాని గొంతు పెద్దగా పెగలేదు.

అతడి ఆదుర్దాని గమనించిన ఆల్టేవో అరవ్వద్దని సంజ్ఞ చేశాడు. తన చేతిలోని ఫ్లాష్‌లైట్ దానిమీదకు ఫోకస్ చెయ్యటానికి రెడీగా వున్నాడు.

ఆక్టోపస్ ఏనుగుతొండంలాంటి ఎనిమిది హస్తాలమీద నడుచుకుంటూ ఒడ్డుకు చేరింది. కాలయముని కోరల్లాంటి తన చేతుల్ని చాచి మోటార్‌బోటులోకి పోనిచ్చింది. అందులో పడుకునివున్న ఒక కూలీని పసిపిల్లవాడ్ని ఎత్తుకున్నంత అవలీలగా లాగింది. వాడి శరీరంచుట్టూ కొండ చిలువ చుట్టుకున్నట్టుగా ఆక్టోపస్ హస్తాలు చుట్టేసినయ్.

ఆల్టేవో చలించలేదు. సరిగదా తన సంచీలోంచి కెమెరా తీసి నాలుగు షాట్లు లాగాడు. అది చీకట్లోగూడ ఫోటోలు

తీయగల స్పెషల్ కెమెరా.

అవతల మనిషి ఛస్తుంటే తీరికగా నింపాదిగా ఫోటోలు తీయటం నరేన్‌కి కోపాన్ని తెప్పించింది. అయినా అతడికి భయంతో నోరు పెగల్లేదు.

ఆహారం దొరికిన జలరాక్షసి ఆక్టోపస్ మళ్ళీ సముద్ర జలాల్లోకి వెళ్ళిపోయింది.

“నువ్వు మనిషివా పశువ్వా? అవతల మనిషిని ఆ రాక్షసి కబళిస్తుంటే కూర్చుంటావా?” అని అరిచాడు నరేన్.

“శాంతపడు నరేన్. దాన్ని మనం ఎలాగూ ఎదిరించలేం! ఎలాగూ మనలో ఒకరం దానికి బలికావలసిందే! ఆ మాత్రం దానికి గోలచేస్తే, అందరూ నిద్రలేచి కలకలం చేశారంటే అందర్నీ కబళించేదాకా అదిపోదు. అందుకే ఊరుకున్నాను” అన్నాడు ఆల్టేవో.

నరేన్ కోపంతో పళ్ళు కొరికాడు. అయినా ఏమీ చెయ్యలేక ఊరుకుండిపోయాడు.

తెల్లవారింది. అందరూ నిద్రలేచారు. బ్రెడ్ తిని టెంట్ పీకివేశారు. అన్నీ ప్యాక్ చేసుకుని మళ్ళీ మోటారు బోటులోకి ఎక్కారు. బోటు స్టార్టయింది.

ఆల్టేవో మ్యాప్ తీసి కంపాస్ వంక చూస్తూ సూచనలిచ్చాడు. ఆ వైపుగానే బోటు ప్రయాణిస్తోంది.

మధ్యాహ్నానికి మరో దీవి చేరారు.

ఆ దీవి అంతా దట్టమైన చెట్లమయం. లోపల ఏ ప్రమాదాన్ని తెచ్చిపెట్టే ఆటవికులున్నారో అని నరేన్ గడగడలాడిపోతున్నాడు.

నిజంగా మ్యాప్‌లో గుప్తధనం ఉన్నచోటు కాకుండా కేవలం రాకాసి జీవులున్న దీవులేమో! లేనిపోని ఆశలు పెంచుకుని జర్మన్ సైంటిస్ట్ వెంటబడి వచ్చింది ఇక్కడ దిక్కులేని చావు చావడానికేమో అనుకున్నాడు నరేన్.

రాత్రి జరిగిన సంఘటన దేశాయ్‌కిగాని మిగతావాళ్ళకిగాని చెప్పలేదు. చెబితే వాళ్ళు భయంతో అక్కడికక్కడే ప్రాణాలు వదుల్తారు.

భుజంమీద ఎవరిదో చేయిపడటంతో ఉలిక్కిపడి చూశాడు. దేశాయ్.

"వీడు నిజంగా కప్పల్ని, పీతల్ని, ఎండ్రకాయల్ని పట్టటానికే వచ్చినట్టున్నాడు గురూ! వాడి మ్యాప్ చూసి మనం మోసపోలేదు గదా!" అన్నాడు దేశాయ్.

"నా మనసులోను అదే శంక పీడిస్తున్నది. ఈ లంకల్ని చూస్తూంటే ధనం సంగతి దేముడికెరుక. ప్రాణాలతో బయట పడగలమా అని నా అనుమానం."

"పెద్దగా అరవకు! ఆ సైంటిస్ట్‌గాడి చెవినబడితే ఇంకా ప్రమాదం!"

టెంట్ వేయటానికి నేలలో మేకులు దిగగొట్టి ఆల్టెవో వీళ్ళను కేకేశాడు.

"ఆలోచనలు తర్వాత. ముందు ఈపని కానివ్వండి. ఇంకా మనతిండి తయారుచేసుకోవాలి!" అన్నాడు ఆల్టెవో నవ్వుతూ.

ఇద్దరూ అతడికేసి కసిగా చూస్తూ ముందుకు నడిచారు.

మరోప్రక్క స్టవ్ వెలిగించి ఇద్దరు కూలీలు మాంసం వండుతున్నారు. ఉడికిన వాసన ముక్కుపుటాలకు బాగా తగులుతున్నది.

"మీ వంట పాడుగాను! ఆ వాసనకు ఏ సింహాలన్నా వచ్చి పడేను!" అని విసుక్కున్నాడు నరేన్.

అతడా మాట అన్నాడో లేదో చుట్టూ చెట్లమీద పెద్ద సంచలనం రేగింది.

చెట్లమీదనుంచి చెట్లకు దూకుతూ కోతుల్లా కొందరు ఆటవికులు వీళ్ళచుట్టూ మూగారు. వాళ్ళచేతుల్లో బాణాలు,

అయితే ఈ జీవి జీవిత విశేషాలు ప్రపంచానికి తెలియవు. ఇవి ఎలా సంపర్కం చేస్తాయో, ఎలా పిల్లల్ని కంటాయో పరిశోధించాల్సి ఉంది. అందుకే జర్మనీ దేశంనుంచి వేల మైళ్ళు ప్రయాణించి ఆల్టేవో ఇక్కడకు చేరుకున్నాడు.

ఆల్టేవో ఫ్లాష్ టార్చ్ వెలిగించాడు.

అప్పటిదాకా చీకట్లో తారాడుతున్న రాక్షసి ఎండ్రకాయలు ఈ వెలుగుకి తట్టుకోలేక ఎక్కడివక్కడ నిలబడి పోయినయ్.

వాటిని చూసి ఆల్టేవో చిరునవ్వునవ్వాడు. ఫ్లాష్ ఆర్పే శాడో అవన్నీ వాటి కలుగుల్లోకి పారిపోతయ్యి.

లేచి ఫ్లాష్ నరేన్ చేతికిచ్చి అతడు వెళ్ళి నాలుగయిదు ఎండ్రకాయల్ని తల భాగంలో పట్టుకుని తెచ్చి వాటిని బంధించటానికై నిర్దేశించబడిన డబ్బాలో వేసి మూత పెట్టేశాడు. ఆ మూతకు పైన అనేక రంధ్రాలున్నాయ్, వాటి ల్లోంచి గాలి రావటానికి వీలుగా.

ఫ్లాష్ ఆరిపోయింది.

అంతలో, చెట్ల గుంపులోంచి ఏవేవో వింత ధ్వనులు వినిపించినయ్.

నరేన్ భయంభయంగా అటుకేసి చూశాడు. ఆల్టేవో మాత్రం ధైర్యంగా రైఫిల్ని రెడీగా పట్టుకుని కూర్చున్నాడు.

## 5

రాజేంద్ర ఆ రోజల్లా పడుకునే ఉన్నాడు మైకంలో.

బోయ్ మటుకు అతడు లేచినప్పుడల్లా బ్రాందీపోసి ఇస్తున్నాడు. అది త్రాగటం మళ్ళీ పడుకోవటం. మెలకువ రాంగా మళ్ళీ త్రాగటం, వాలిపోవటం.

మధ్యమధ్యలో బోయ్ బయటకువెళ్ళి వస్తున్నాడు.

ఖాళీగావున్న ఒక మోటర్ బోట్ని మరోచోట దాచాడు.

అక్కడ సముద్రం ఒడ్డునే దుబ్బులు మొలిచి ఉన్నయ్ మూడడుగుల ఎత్తున. వాటిని తప్పుకుని నీళ్ళల్లో దిగితేగాని బోటు కనిపించదు ఒడ్డున ఉన్నవాళ్ళకు.

బోటులోకి పాతిక ముప్ఫయి కొబ్బరి బొండాలు, ఏడెనిమిది బ్రాందీ సీసాలు సేకరించాడు. ఆ బోటుకి ఇంజన్ వున్నాగాని రెండు తెడ్లని తెచ్చి బోటులో పెట్టాడు. రెండు టిన్నుల ఆయిల్ తెచ్చి లోపల పెట్టాడు.

తన దుస్తులు మార్చుకున్నాడు. చీకటి పడింది.

టౌన్ వేపు మాత్రం ఇళ్ళల్లో లైట్లు కనబడుతున్నాయ్. మిగతా మూడుప్రక్కలా గాఢాంధకారం, అగాధమైన సముద్రం.

రాజేంద్రకు మరో రెండు పెగ్లుపోసి త్రాగించాడు. ఆ తర్వాత అతన్ని భుజాన వేసుకుని సముద్రం వైపుగా నడిచాడు.

దట్టంగా పెరిగిన తుంగల్లాంటి దుబ్బుల్ని ఎడంగా నెట్టి దోవచేసుకుని మొలబంటి నీళ్ళల్లోకి వెళ్ళి బోటులో రాజేంద్రని పడుకోబెట్టాడు.

ఆ తర్వాత తనుగూడ బోటులోకి ఎగిరి కూర్చున్నాడు. తెడ్లువేసి నడిపాడు బోటుని. అలలకు బోటు ఎగిరెగిరి పడుతోంది. అయినా బ్యాలెన్స్ తప్పి బోటు ఒరిగిపోయి తలక్రిందులు కాకుండా 'బోయ్' అతినేర్పుగా ముందుకు నడుపుతున్నాడు.

రాజేంద్ర ఒళ్ళు తెలియకుండా స్పృహలేకుండా పడి ఉన్నాడు.

'బోయ్' తెడ్డు వేస్తూనే ఒకసారి తాను బోటులోకి చేర్చిన సామానువంక చూశాడు చెకింగ్ చేస్తున్న వాడిలా. చిన్నమూట బియ్యం, ఒక బుట్టెడు టొమేటాలు. పెద్దగోతం కొబ్బరి బొండాలు. బార్ లో దొంగిలించుకు వచ్చిన పెద్దప్యాక్

బిస్కట్లు. ఒక రేకుగొట్టంనిండా మంచినీళ్లు. ఆ ప్రక్కనే రాజేంద్రకు ఒకవారం వరకూ సరిపడా బ్రాందీ సీసాలు ఉన్నాయ్. వాటిమధ్యలో మత్తుగా ఒరిగిపోయిన రాజేంద్ర ఉన్నాడు.

'బోయ్' చూపులు మాటిమాటికీ అతడి తలమీదకు పోతున్నాయ్. గిరజాలు తిరిగిన జుట్టుని చూసుకుని వెలలేని వజ్రాల్ని సంపాదించినంతగా సంబరపడిపోతున్నాడు.

పూర్ కెప్టెన్. తను పారిపోయినట్లు గమనించి మిగతా వాళ్ళమీద చిందులు తొక్కుతాడు. ఏమయితేనేం! తను వచ్చిన పని సక్రమంగా నెరవేరింది. అనుకున్నదానికన్నా సులభంగా ఇంకా తొందరలో తనకు కావలసిన మనిషిని తీసుకుని వెళ్ళగలుగుతున్నాడు.

అంతా చీకటి. అయినా మోటార్ బోటు ముందుకుసాగి పోతోంది. తెడ్లు లోపల పడేసి ఇంజన్ స్టార్టుచేశాడు. కంపాస్ సహాయం లేకుండానే అతడు తన గమ్యంవేపు సాగిపోతున్నాడు.

ఆ రాత్రంతా అతడు అలాగే మేలుకుని మోటార్ బోటుని నడుపుతూనే వున్నాడు.

సముద్రంమీదనే వారు సూర్యోదయాన్ని చూశారు. సూర్యకిరణాలు సోకి రాజేంద్ర ఉలిక్కిపడి లేచాడు.

"ఎక్కడున్నాం మనం?" అనడిగాడు రాజేంద్ర.

"ఇంకా అండమాన్ చేరలేదుసార్! బ్రాందీకావాలా? ఆ సీసాలో వుంది. సీసాఎత్తి త్రాగేయండిసార్! గ్లాసులు పగిలిపోయినయ్!"

అంతే! రాజేంద్ర మరోమాట మాట్లాడకుండా సీసా ఎత్తి గడగడత్రాగి మళ్ళీ మత్తులోకి సోలిపోయాడు.

ఉదయం బాగా పొద్దెక్కిన తర్వాత ఏదో చిన్న దీవి మీద దిగాడు బోయ్. చితుకుల్ని ఏరి పొయ్యిచేసి అన్నం

వండాడు. టొమాటోలు ఉడకబెట్టి కూరచేశాడు. తను కాస్త తిని మిగతాది తన యజమాని రాజేంద్రచేత తినిపించాడు. మళ్ళీ ప్రయాణం కొనసాగించాడు ఆ తర్వాత.

అలా మూడురోజులు గడిచినయ్. 'బోయ్'కి ఆ ప్రాంతాలన్నీ క్షుణ్ణంగా తెలుసులాగుంది. ఎక్కువగా ఏదైనా నిర్మానుష్యమైన దీవిలోనే వంటకోసం దిగేవాడు.

ఒకరోజు చిన్న దీవిలో దిగి వంట మొదలెట్టాడు బోయ్. అతడు చేసిన మంటలోంచి పొగ సుడులు సుడులుగా తిరిగి పైకిలేచింది. ఆ పొగనుచూసి దీవి లోపల్నుంచి కొందరు ఆటవికులు అరుచుకుంటూ పరుగెత్తుకొచ్చారు.

మనుషులు నల్లగా బలిష్టంగా ఉన్నారు. మొలకు గోచీ తప్ప మరేంలేదు ఒంటిమీద. చేతుల్లో బల్లేలు వున్నాయ్, జుట్టుఅంతా ముడివేసి మెడమీద కొప్పులా చుట్టుకున్నారు. నల్లటి ముఖంమీద ఎర్రగా, తెల్లగా చారలున్నాయ్.

"ఖాఖాక్కాం! ఖాఖాక్కాం!" అంటూ అరుచుకుంటూ అయిదారుగురు 'బోయ్' వంటచేసే చోటికి పరుగెత్తుకు రావటంచూసి వంట వదిలేసి నీళ్ళలోకి దూకాడు బోయ్.

దూరంగా సముద్రంలో లంగరువేసి వుంచిన మోటార్ బోట్ వేపుగా 'బోయ్' ఈదటం గమనించిన ఆటవికులు తమ చేతిలోని బల్లేలను బోటువేపుగా విసరనారంభించారు.

బోయ్‌కి ఎక్కడలేని భయం పట్టుకుంది. తను అధిక శ్రమకు ఓర్చి ఇంతదూరం తీసుకువచ్చిన రాజేంద్రకు అపాయం కలుగుతుందేమోనని.

ఆ బల్లాలకు చివర విషం వుంటుంది. అది శరీరంలోకి ప్రవేశించిన మరుక్షణంలోనే మనిషి నీలంగా మారిపోయి చనిపోతాడు.

అందుకే అతడు ఆదుర్దాగా గబగబా ఈదుకుంటూ వెళ్ళి బోటులోకి ఎక్కాడు. ఒక ప్రక్కనే పడేసివున్న రైఫిల్

రెండు దెబ్బలకే గింగిరాలు తిరిగాడు. అయినా తమాయించు కుని ఒక కాలుమీదనే నిలబడి మరో కాలుతో తనను ఎదుర్కోవటానికి మీదికి కలియబడుతున్న దేశాయ్‌ని బలంగా తన్నాడు. బూటుకాలు దెబ్బతగిలి దేశాయ్ క్రిందపడిపోయి రెండు పొర్లి గింతలు పొర్లాడు.

అతడిమీదకు లంఘించబోతున్న ఆల్టేవోని నరేన్ పట్టుకుని ఆపాడు.

మరో ఇద్దరు దేశాయ్‌ని లేపి కూర్చొబెట్టి అతడు మళ్ళీ కలియబడకుండా గట్టిగా పట్టుకున్నారు.

"మనందరం కలిసికట్టుగా ఉండాల్సిన సమయంలో మీరిట్లా కొట్లాడుకోవటం ఏం బాగోలేదు!" అన్నాడు బర్మావ్యక్తి.

"లేకపోతే ఆ రాస్కెల్ ఏం కూస్తాడు. నేను గుప్తధనంకోసం వచ్చానట! మళ్ళీ వాడా కూత కూశాడో వాడి నాలుక చీల్చేస్తాను" ఆల్టేవో అన్నాడు.

"ధనమా? హాహా...ధనమా?...బంగారం! హాహా!" అని కడుపు చేతో పట్టుకుని నవ్వసాగాడు.

దేశాయ్ ఉక్రోషంతో అతడ్ని చూశాడు. "ఎందుకలా నవ్వుతావ్?"

"నవ్వకేం చేయమంటావ్? ఒకప్రక్క మన ప్రాణాల్ని తప్పా తప్పా. మనని ప్రాణాలతో వుండగానే ఎప్పుడు ఈ నరమాంస భక్షకులు జుర్రుకుని తినేస్తారో అని ఇదవుతుంటే ఇప్పుడు బంగారం మనల్ని కాపాడగలదా? కావాలంటే ఈ పెట్టెల్లో చూడండి. ప్యూర్ గోల్డ్! మేలిమి బంగారం. లక్షలకు లక్షలు విలువచేసేది వుంది. అయితే అది మనల్ని రక్షించగలదా?" బర్మావ్యక్తి అన్నాడు.

## 7

తూర్పు రేఖలు తెల్లవారుతున్నాయి. సముద్రంమీద కేవలం

మోటారుబోటుతో ఎనిమిదివందలమైళ్ళు ప్రయాణంచేసిన బోయ్ గట్టిగా నిట్టూర్చాడు. కనుబొమలపై అరచేయిపెట్టుకుని సుదూరానికి నిగిడ్చి చూశాడు.

దూరంగా ఆకుపచ్చని వృక్షాల తలలు కనుపిస్తున్నయ్.

అంటే లంక దగ్గర్లోనే వుందన్నమాట. ఇంకోగంట ప్రయాణిస్తే తన జన్మస్థలాన్ని చేరుకుంటాడు.

హుషారుగా ఈలపాట పాడుతూ రాజేంద్ర గిరిజాలజుట్టు వంక చూశాడు. మళ్ళీ స్టీరింగ్ త్రిప్పటంలో నిమగ్నుడై పోయాడు.

త్రీడీ పిక్చర్‌లో మీదకు వచ్చిపడే దృశ్యంలా, స్పీడుగా పోతున్న బోటుమీదకు దీవివచ్చి పడుతోందా అన్నంతగా చేరువౌతున్నది.

బోటుని ఒడ్డునే ఆపి పెద్దగా ఈలవేశాడు బోయ్.

తీరానికి దూరంగావున్న చెట్లలో సంచలనం కలిగింది. మరునిముషంలో రాక్షసుల్లాంటి ఆటవికులు పరుగెత్తుకుంటూ వచ్చి చేరారు.

బోయ్ బోటులోంచి మిగిలివున్న సామగ్రిని ఒడ్డుమీదకు చేరవేశాడు. గుడ్డలమూట ఒకటి, పొగాకుకట్ట, కొబ్బరి బొండాలు, బ్రాందీసీసాలకేస్, రైఫిల్ అన్నీ ఒక్కొక్కటే నింపాదిగా చేర్చాడు.

రాజేంద్రకు మెలకువ వచ్చింది.

కళ్ళు తెరచి ఒడ్డునే యమకింకరుల్లా నిలబడివున్న ఆటవికుల్ని చూసి తను ఏదైనా పీడకలగంటున్నాడేమో అనుకుని కళ్ళు నులుముకుని చూశాడు. కాని కళ్ళముందు దృశ్యం చెదిరిపోలేదు. పైగా 'బోయ్' గొంతు వినిపించింది.

“దిగండిసార్!”

“ఇదేమిటోయ్! ఎక్కడకుచేరాం మనం! ఇది మీ స్వగ్రామమా!”

"అవునుసార్! మీవల్లనే నా వివాహం కావాల్సివుంది. అందుకే మిమ్మల్ని శ్రమకలిగించి ఇంతదూరం తెచ్చాను మిమ్మల్ని!" బోయ్ నవ్వుతూ సమాధానం చెప్పాడు.

"డబ్బు కావాలంటే అప్పుడే ఇచ్చేవాడ్నికదా! ఇంత శ్రమపడటం దేనికి?" రాజేంద్ర అన్నాడు.

"డబ్బు మాకెందుకుసార్! మాలో ఒక ఆచారం వుంది. యుక్తవయస్కుడైన యువకుడికి వివాహం కావాలంటే నాగరిక దేశాల్లోని వ్యక్తి తలనరికి వధువుకు కట్నంగా సమర్పించవలసివుంటుంది. అందులోనూ తెల్లరంగుగల మనిషి తల అయితే ఇంతా విలువైన కానుక అన్నమాట. అందుకే మీ గిరిజాలజుట్టు తల నన్నాకర్షించింది."

రాజేంద్రకు మత్తు వదిలింది. వాడు చెప్తున్నదేమిటో పూర్తిగా తలకెక్కింది.

ఇంక కొద్దిసేపట్లో తన తల మెడమీద వుండదు. నల్లగా మసిబొగ్గులా తాటకిలా వుండే ఆటవిక యువతి...'బోయ్' కాబోయే భార్య చేతుల్లో వుంటుంది. అతడు పెద్దగా నవ్వాడు.

"నాతల నా శరీరం నేను చేసుకున్న భార్యకు కాబట్టలేదు. పోనీలే! నీవు భార్యను సంపాదించుకోవటానికన్నా అది ఉపయోగపడితే చాలు! ఊఁ. చూస్తావేం? కానియ్!" అంటూ ముందుకువంగి తల వాల్చాడు.

ఒక్క కత్తివేటుతో అతని తల తెగి పడింది.

బోయ్ మహదానందంతో దాన్ని అందుని తమ పెద్దకు అందించాడు.

ఆ తర్వాత ఆ బృందం అంతా ఏవేవో అరుపులు అరుచుకుంటూ, పాడుకుంటూ దీవిలోని అడవిలోకి సాగిపోయారు.

## 8

"బంగారమా? నిజంగానా? మమ్మల్ని ఆటలు పట్టించటం

లేదు గదా?" దేశాయ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఆటలు పట్టించటమా? మన ప్రాణాలు యముడి చేతిలో ఉన్నయ్ ఇప్పుడు! ఇటువంటప్పుడా జోక్స్! నేను చెప్పేది అక్షరాల నిజం!" అంటూ తనుకూర్చున్న చోటునుంచి లేచి గదిలో చుట్టూ పేర్చివున్న కొయ్యపెట్టెల్ని ఒక్కోదాని మూతలాగి ఇవతల పడేశాడు.

అందరి కళ్ళూ జిగేలు మన్నయ్.

ఆ పెట్టెలనిండా ఇటుకరాయి ప్రమాణంలో బంగారం దిమ్మలు ఉన్నయ్.

దేశాయ్ అనుమానం పట్టలేక వాటివద్దకువెళ్ళి ఒక బంగారు దిమ్మను చేతిలో పైకితీసి పరీక్షించి చూశాడు. నరేన్‌కి అందించాడు ఇంకా అనుమానం తీరక.

మిగతా కూలీలుగూడ ఆనందంతో వెళ్ళి వాటిని తను చేతుల్లోకి తీసుకుని పరీక్షిస్తున్నారు.

వాటివద్దకు వెళ్ళకుండా కూర్చున్నదల్లా ఆల్బెర్ట్ ఒక్కడే. అతడు బర్మావాడి ప్రక్కకు వెళ్ళాడు.

"నువ్వు ఇక్కడికెలా వచ్చావ్? ఈ బంగారం ఎలా వచ్చింది ఇక్కడకు?" అని అడిగాడు నిదానంగా.

"ఇంతకు పూర్వం ... అంటే ఒక సంవత్సరం క్రితం ఒక స్మగ్‌లింగ్ గ్యాంగ్ బంగారం తీసుకుపోతూ ఎక్సైజ్ వాళ్లు వెంటబడితే వచ్చి ఈ దీవిలో దాక్కున్నారు. ఈ ప్రాంతాల్లో నరమాంసభక్షకులుంటారని ఎక్సైజ్ వాళ్లెవరూ ఇటుకేసిరారు. ఆ విషయం తెలీని స్మగ్లర్స్ ఈ దీవిమీద దిగి కాంప్ వేసుకున్నారు. ఈ ఆటవికులకు బందీలైనారు. వాళ్ళను చంపి తినేశారు. ఈ బంగారం మిగిలిపోయింది. నేనూ ఆ గ్యాంగ్‌లో వాడినే. నన్నూ ఇవాళో రేపో స్వాహా చేస్తారు ఈ రాక్షసులు!"

"అంటే వీళ్లు రోజుకొక మనిషిని చంపుకుతింటారా?"

బరిసెలూ ఉన్నాయ్. వాటి మొనలకు పచ్చటి రంగుపూసి ఉంది. అది ఒకరకమైన విషం. బరిసెకాని బాణంకాని ఎదటి మనిషిలో నేరుగా దిగబడకపోయినా 'రయ్‌ని' ఏ ప్రక్కగానన్నా దూసుకుపోయి చిన్నగాయం అయిందో ఆ తర్వాత విషప్రభావంవల్ల మనిషి నిముషాల్లో చచ్చిపోతాడు.

నరేన్, దేశాయ్ లిద్దరూ గుడ్లప్పగించి వాళ్ళకేసి చూశారు.

వాళ్ళు నల్లగా బొగ్గులా ఉన్నారు. ఒంటిమీద గుడ్డలు లేవు. ఒళ్ళంతా ఎలుగుబంటికిమల్లే పొడవాటి రోమాలు వ్రేలాడుతున్నయ్. ఆ వెంట్రుకల గుబురే మర్మస్థలాన్ని గూడ కప్పివేసినై. వాళ్ళ కళ్ళు ఎర్రగా చింత నిప్పూలా ఉన్నాయ్. వాళ్ళ శరీరాలమీద అక్కడక్కడా నెత్తురు మరకలు కన్పిస్తున్నయ్.

"జంభో!" అంటూ అరిచాడు అందులోనుంచి ఒకవ్యక్తి ముందుకువచ్చి.

అర్థంగాక నిలబడి చూస్తున్న మనుషుల్ని చూసి వాళ్ళలో మరొకడు 'ముందుకు నడవండి' అన్నట్లు సంజ్ఞ చేశాడు.

ఆట్రేవో సరంజామా అంతా నాలుగు పెట్టెల సరిపడా ఉంది. ఆ పెట్టెల్ని నలుగురు కూలీలు నెత్తికెత్తుకున్నారు.

ఆటవికుల చక్రబంధంలో ఆట్రేవో బృందం ముందుకు సాగింది.

ఒకమైలు దూరం దట్టమైన అడివిలోకి నడిచారు. ఆటవికుల పల్లె వచ్చింది.

పెద్ద మైదానంలో వృత్తాకారంలో చుట్టూ మేదర గుడిసెలలాగ వేయబడి ఉన్నయ్. అందులోనుంచి మరికొందరు ఆటవికులు వచ్చారు.

గుడిసెల మధ్య ఖాళీ జాగా చాలావుంది. అక్కడ

అందర్నీ కూర్చోబెట్టారు.

వాళ్ళ నాయకుడు కాబోలు నెత్తికి దేగ ఈకలు కట్టుకుని ఉన్నాడు. వాడు బయటికివచ్చి ఏదో అరిచాడు.

ఆ తర్వాత ఆల్టేవో బృందంలో ప్రతి మనిషిని గుచ్చిగుచ్చి చూశాడు. కొందర్ని బరిసె త్రిప్పి మొదలుతో కండవున్న చోట పొడిచాడు. బలిష్ఠంగా కండలు తిరిగివున్న కూలీవాడి వంక చూపించి తను వెళ్ళి ఎత్తైన రాయిమీద కూర్చున్నాడు.

మరో ఇద్దరు ఆటవికులువచ్చి ఆ కూలివాడ్ని వెడరెక్కలు వెనక్కు విరచి కట్టేశారు. బరిసె మొదలుతో పొడుస్తూ నాయకుడి దగ్గరకు లాక్కెళ్ళి అతడిముందు నిలబెట్టారు.

మరి కొంతమంది ఆటవికులు సాయంపట్టగా కూలీవాడి ఒంటిమీద గుడ్డల్ని ఊడలాగేశారు. అతడు పూర్తినగ్నంగా ఉన్నాడు. మర్మస్థానాల మీద అడ్డం పెట్టుకునే అవకాశం లేకుండా అతడి చేతులు కట్టివేయబడి ఉన్నై.

ఎక్కడనుంచో డప్పుల శబ్దం వినిపించింది. ఆ శబ్దం గుండెలవిసేలా ఉంది.

నరేన్, దేశాయ్ లిద్దరూ బొమ్మల్లాగ నిశ్చేష్టులై ఇదే మర్యాద తమకుగూడ పట్టబోతుందా అని భీతావహులై పోతున్నారు.

ఆల్టేవో మాత్రం నిశ్చింతంగా ఏదో క్రైమ్ పిక్చర్ చూస్తున్నట్టుగా కూర్చుండిపోయాడు.

మిగతా కూలీల్లో కొందరు ఏడుస్తున్నారు. మరికొందరు ఏడవటానికి కన్నీళ్ళుగూడ రాక అలాగే కూర్చున్నారు.

డప్పులు వాయిస్తున్న వాళ్ళమధ్యలో నుంచి ఒకడు భీకరంగా అరుస్తూ చేతిలోని వెడల్పాటి పదునైన కత్తిని ఝుళిపిస్తూ ముందుకు దూకాడు.

నిలబడివున్న కూలీవాడి మెడమీద ఒకవేటు వేశాడు. తల తెగి క్రిందపడిపోయింది. నెత్తురు విరజిమ్మింది.

క్రిందబడ్డ తలను ఒడిసి పట్టుకుని ప్రక్కనే బండమీద పెట్టాడు మరో వ్యక్తి. మొదటివాడు కత్తిని తిరగేసి ఆ తల మీద మరో దెబ్బ వేశాడు. తల రెండుగా పగిలింది.

దాన్ని తీసుకుని కొబ్బరి బొండాన్ని అందించినట్టుగా అక్కడ కూర్చున్న నాయకుడికి అందించాడు. నాయకుడు వేడిగావున్న మెదడును నంజుడులా తినేశాడు.

మిగతా ఆటవికులు అందరూ గుమిగా మిగిలిన మొండెం మీదకు ఎంగిలి విస్తరాకు మీదకు దూకే కాట్లకుక్కల్లా ఎగబడ్డారు. నోటితో ఆ మొండెంలోని కండల్ని పీక్కుతింటు న్నారు రాబందుల్లా.

ఆ దృశ్యం చూడలేక దేశాయ్ స్పృహతప్పి పడి పోయాడు.

కూలీవాడ్ని ముగించంగానే తమలో ఒకరితర్వాత ఒకర్ని అదేరకంగా ఆరగించేస్తారేమోనని అక్కడున్న ప్రతిఒక్కరూ భయపడ్డారు.

కాని ఆ తర్వాత ఆటవికులు మిగతా వాళ్ళని లేవమని సంజ్ఞ చేశారు. అందర్నీ మందగా తోలుకువెళ్ళి అక్కడకి వందగజాల దూరంలోవున్న ఒక దిబ్బదగ్గరకి తీసుకువెళ్ళారు.

అది నిజానికి దిబ్బకాదు. అదొక భూగృహం. లోపలకు దిగటానికి అయిదారు మెట్లున్నయ్.

తలుపులాంటి రాతిపలకను తొలగించి అందర్నీ అందు లోకి దింపి మళ్ళీ పలకను మూసేశారు.

అదొక పెద్దగదిలావుంది. పైన కిటికీలలాగ రంధ్రా లుండటంవలన వెలుతురు వస్తున్నది. గాలికూడా బాగానే వుంది లోపల. లంక అవటంవలన సముద్రం మీదనుంచి వీచే గాలి ఆ భూగృహంలోకి గూడ కొంచెం కొంచెంగా వస్తున్నది.

గదిలో ఆ లేవో బృందంగాక మరో కొత్తవ్యక్తివున్నాడు.

అతడు బర్మాకు చెందివుంటాడని అతడి ఎత్తైన బుగ్గలు, లోతైన చిన్నకళ్లు చెబుతున్నాయ్.

"నరకంలోకి వచ్చిన స్నేహితులారా! స్వాగతం!" అన్నాడు వచ్చిన వాళ్ళను చూసి.

ఆల్టేవో కూలీల నెత్తిన పెట్టెల్ని గదిలో ఒకమూల పెట్టించాడు. ఒక పెట్టె తెరిచి ఒక సీసా తీశాడు. దాని మీద పేరు మరోసారి చదివి అందులోనుంచి రెండు బిళ్ళలు తీసి నోట్లో వేసుకున్నాడు. ఇంకా కొన్ని చేతులోకి పోసు కుని అందరికీ తలా ఒకటి ఇచ్చాడు.

"మనకి ఆహారంలేదు. అందుకే ఈ విటమిన్ టాబ్లెట్స్ని ఇస్తున్నాను!" అన్నాడు ఆల్టేవో అందరివంకా చూసి.

"ఆ పాత వ్యక్తిని మన గతి ఏమిటో అడిగి తెల్సుకో కుండా, ఏదో ఘనమైన పార్టీ ఇస్తున్నవాడిలా ఏమిటా పోజు!" పెద్దగా అన్నాడు దేశాయ్.

ఆల్టేవో కోపంగా చూశాడు. "పరిస్థితుల్ని చూసి నిన్ను వదిలేస్తున్నాను. లేకపోతే ఒక్క పాట్‌తో నిన్ను చంపేసి వుందును!" అన్నాడు.

"చంపక ఇప్పుడు మాత్రం చేసిందేమిటి? ఆ మ్యాప్ చూపించి మమ్మల్ని ఎందుకు మభ్యపెట్టాలి! ఈగతికి మమ్మల్ని తీసుకువచ్చింది నువ్వు కదూ?"

ఆల్టేవో సుడిగాలిలా వెళ్ళి దేశాయ్‌మీద పడ్డాడు. అది ముందే ఊహించిన దేశాయ్ గభాలున నేలమీద బోర్లాపడి పోయాడు. ఆల్టేవో ఎదురుగోడకు గుద్దుకున్నాడు.

"ఆగండి! మీలో మీరు కొట్టుకోకండి!" అంటూ అరి చాడు బర్మావ్యక్తి. కాని అతడి మాటలు విన్పించుకునే దెవరు?

దేశాయ్ మళ్ళీ లేచి పిడికిలి బిగించి ఆల్టేవోమీద కురి శాడు. అతడ్ని పొట్టలో దభీదభీమని గుద్దాడు. ఆల్టేవో

ఆల్టేవో అడిగాడు.

"లేదు. వారానికొకడ్ని. మనం మాంసంకోసం గొర్రెల్ని మేకల్ని పెంచినట్టే వీళ్లు చేజిక్కిన మనుషుల్ని ఇలా మంద వేసి మేపుతారు. వారానికి ఒకరోజు ఒక మనిషిని పీక్కు తినేస్తారు. అది వాళ్ళ పండగరోజేమో!"

"నువ్వు ఎన్నాళ్ళయింది వచ్చి? మనం తప్పించుకునే మార్గం లేదా?"

"నేను వచ్చి ఏడాది అవుతుంది. మేందిగిన ఓడలో దాదాపు వందమందిమి ఉన్నాం. అందర్నీ తినేశారు. నేను ఇంకా ఈ ప్రత్యక్ష నరకంలో రోజులు లెక్కేసుకుంటూ బ్రతికి ఉన్నాను. నాకు తెలిసినంతవరకూ మనకు తప్పించుకునే మార్గమేమీలేదు."

"అలా వీల్లేదు. ఆలోచిస్తే ఏదో ఒకమార్గం ఉండక పోదు."

బంగారాన్ని పరీక్షించి అలసి ఆకలితో సొమ్మసిల్లి నిద్ర పోయారు అందరూ. ఆల్టేవో మాత్రం తన రైఫిల్‌ని తుడిచి శుభ్రం చేసుకున్నాడు.

ఆల్టేవో మెట్లెక్కి రాతి పలకమీద తట్టాడు. సమాధానం రాలేదు. మళ్ళీ మరోసారి తట్టాడు.

ఈ తడవ రాతి పలక ప్రక్కకి తొలగించి ఒక ఆటవికుడు తల లోపలకు పెట్టి ఏమిటన్నట్టుగా కోపంగా చూశాడు.

ఆల్టేవో లోపలకు రమ్మనట్టుగా సైగచేశాడు వాడు రెండు మెట్లు దిగాడో, లేదో తనజేబులోంచి రివాల్వరుతీసి వాడ్ని కాల్చేశాడు. దానికి సైలెన్సరుగూడ అమర్చడంవల్ల చీమ చిటుక్కుమన్నంత శబ్దంగూడ లేకుండా వాడు నేల కొరిగిపోయాడు.

"ఇక ఇదే అదను! ఈ ఆటవికులు ఇతర దీవుల్లోకి వెళ్ళి

వుంటారు వేటాడ్డానికి. పైన ఇంకా ఒకరిద్దరు వుండచ్చు. వాళ్ళనుగూడ ఎదుర్కొనగలిగితే మనం పారిపోవచ్చు."

అందరికీ ప్రాణాలు తిరిగి వచ్చినట్టయింది. ఆట్లేవో కూలీలవంక తిరిగి "మీలో ఎవరన్నా ఒకళ్ళు బయటికి వెళ్ళి ఇంకా ఆటవికులున్నారేమో చూడండి! ఉంటే వాళ్ళని ఇక్కడకు రమ్మని సైగచేయండి. వాళ్ళని నేను పంపిస్తాను యముడి దగ్గరకు" అన్నాడు.

కూలీల్లోంచి ఒకడు మెట్లెక్కి బిలంపైకి వెళ్ళాడు. చుట్టూ కలయజూశాడు. ఎవరూ ఆటవికులు లేరు.

వెనక్కి తిరిగివచ్చి "ఎవరూ లేరు!" అన్నాడు.

తాము పారిపోవటానికి, ప్రాణాలతో బయటపడడానికి అవకాశం చేజిక్కింగానే దేశాయ్‌కి ఈ బంగారాన్ని ఎలా చేజిక్కించుకోవాలా అన్న సమస్య పట్టుకుంది. ఆట్లేవో ధోరణి చూస్తుంటే దాన్ని తమకు దక్కనిచ్చేట్టు లేదు.

గబగబ అందరూ తల ఒక పెట్టి ఎత్తుకున్నారు.

బర్మ్యాక్యర్తికి బంగారం కేస్‌వంక చూస్తూనే ఏదో అసహ్యకరమయిన వస్తువువంక చూసినట్టుగా చీదరించుకున్నాడు.

"ఈ పాడు బంగారాన్ని నేను తాకను. ఈ కేస్ గూడ ఎవరన్నా ఎత్తుకోండి!" అంటూ అతడు ఆట్లేవో లగేజ్ బాక్స్ ఒకటి నెత్తికెత్తుకున్నాడు.

ఇదే అదనుగా దేశాయ్ గభాలున వంగి ఆ పెట్టెను ఎత్తాడు. అది తనకు మించిన బరువులావుంది. అయినా అతడిలోని ఆశ అతడికి ఇంకా బలాన్నిచ్చింది. ఆ ఉత్సాహంతోనే అతడు లక్షల విలువచేసే బంగారపు దిమ్మలున్న పెట్టెను తలమీద పెట్టుకున్నాడు.

ఆట్లేవో సైలెన్సర్ చేతబుచ్చుకుని ముందు నడుస్తున్నాడు. అతడి వెనకాలే నెత్తిమీద పెట్టెలు మోస్తూ బారుగా మిగతావాళ్ళు నడుస్తున్నారు.

దేశాయ్ చివరగా నడుస్తున్నాడు. బరువు మోయలేని వాడిలా నెమ్మదిగా అడుగులు వేస్తూ ఒక పెద్ద పొదదగ్గర ఆగాడు.

అతడి ఉనికిని ఎవరూ పట్టించుకోవడంలేదు. ఎవరికివారు ఎంత త్వరగా ఇక్కడనుంచి బయటపడదామా అనే ఆత్రుతతో వున్నారు.

లగేజీని మోటార్‌బోట్‌లో సర్దారు. చివరగా ఒక కూలీ తలమీద బంగారంపెట్టె మిగిలిపోయింది. దాన్నికూడా లోపల పెట్టి అందరూ ఎక్కితే బోటు మునిగిపోవచ్చు.

"ఆ పెట్టె అక్కడే పారేయ్. అందరూ త్వరగా బోటులోకి ఎక్కండి!" అని అరిచాడు ఆల్టేవో.

పగిలిపోయిన గాజు పెంకుల్ని పారేసినట్టుగా ఆ పెట్టెను నాగరిక ప్రపంచంలో లక్షలు విలువచేసే బంగారాన్ని అతి నిర్లక్ష్యంగా క్రిందపడేశారు. బంగారు ఇటుకలన్నీ చెల్లా చెదరుగా తీరంమీద పడిపోయాయి.

"దేశాయ్ ఏడీ?" నరేన్ అడిగాడు.

కాని అంతలోనే ఎవరో అరిచారు. "అమ్మయ్యో! నరమాంస భక్షకులు!"

అంతే! అందరూ బోటులోకి దూకారు. ఆల్టేవో భుజానికి తగిలించుకున్న రైఫిల్‌ని తీసి రెడీగా పట్టుకున్నాడు.

నరేన్ స్టీరింగ్ ముందు కూర్చుని ఇంజన్ స్టార్టు చేశాడు. మోటారుబోటు శరవేగంతో ముందుకుసాగింది.

మరో దెసనుంచి పడవలో తెడ్లువేసుకుంటూ వస్తున్నారు ఆటవికులు. పారిపోతున్న తమ బందీలని చూసి హాహాకారాలు చేశారు. కొందరు తెడ్లువదిలి ఈటెలు విసిరారు. అయినా మోటార్‌బోటు వాళ్ళకందలేదు.

## 9

పెట్టెనెత్తిన మోసుకుంటూ బరువుగా అడుగులు వేస్తున్న

దేశాయ్‌కి సముద్రం ఒడ్డునే చిందరవందరగా పడివున్న బంగారపు ఇటుకలు మెరుస్తూ కనిపించినయ్. అతడి కళ్ళు జిగేలుమన్నయ్.

అబ్బ! వీటన్నిటినీ కూడా ఏరుకుంటే బాగుండును అనుకున్నాడు. నెత్తిమీదనుంచి పెట్టెను దించాడు.

పెట్టెలో ఒక్క ఇటుక కూడ ఇమడనట్టుగా ఉన్నయ్. అయినా అన్నిటినీ ఏరి పెట్టెమీద పేర్చాడు.

అయితే ఇప్పుడో కొత్త చిక్కు వచ్చింది. పైన పేర్చిన ఇటుకలు పడిపోకుండా పెట్టెను తన తలమీదికి ఎత్తుకోవటం ఎలా?

అంతలోనే ఎవరో అటువచ్చిన అలికిడివిని తలెత్తాడు.

"కాస్త సాయంచేసి ఈ పెట్టెను తలమీదకెత్తు!" అని అధికారయుతంగా అరిచాడు.

అంత విలువగల ధనాన్ని చూసేసరికి దేశాయ్ మతిపోయింది. ఆ వచ్చిన వాళ్లు ఆటవికులనీ, తన రక్తాన్ని త్రాగే యమకింకరులనీ అతడు గ్రహించలేదు.

బల్లెం చివరికొనతో ఆ బంగారం దిమ్మల్ని కూలద్రోశారు వాళ్ళంతా.

దేశాయ్‌ని పెడరెక్కలు విరిచి కట్టివేసి నాయకుడి ముందు నిలబెట్టారు. అతడ్ని వివస్త్రుడ్ని చేశారు. ఆ తర్వాత డప్పులమోత మొదలయింది.

దేశాయ్‌కిమాత్రం ఎదురుగా బంగారు దిమ్మలు తప్పమరేం కనపట్టంలేదు.

—: ఐపోయింది :—

# తాజా శవం

## శ్యాంబాబు

అందమైన ఆడక్లయింట్స్ వున్న కేసులో పనిచేయాలంటే నాకెంతో ఉత్సాహం. అందుకే ఆరోజు ఉదయం టెలిఫోన్ రిసీవర్లో ఆవిడగొంతు వినగానే సిగరెట్ వెలిగించి ఉత్సాహంగా ముందుకు వంగాను.

"యస్! డిటెక్టివ్ సిన్హాస్ అసిస్టెంట్ స్పీకింగ్."

"సిన్హాగారు వున్నారా?" అది కోకిల కంఠమా, కోమల కంఠమా అని ఆలోచించదలచుకోలేదు. అది నిశ్చయంగా కోమల కంఠమే. అందమైన అమ్మాయిలు పక్షుల కూతల్ని అనుకరిస్తారని నేను అనుకోను.

"ఎక్స్క్యూజ్ మి! మాట్లాడుతున్నది ఎవరో చెపుతారా?"

"నాపేరు సుజాత! సిన్హాగార్ని అర్జెంటుగా కలుసు

కోవాలి."

"ఓ అరగంట ఆగండి. ఇంకా కన్సల్టింగ్ రూమ్‌లోకి రాలేదు" అన్నాను గదిలో ఉదయం దినపత్రిక చదువు కొంటూ 'మెరాకో' కాల్చుకొంటున్న సిన్హాగార్ని మన సులో ఊహించుకొంటూ.

"వెంటనే కలుసుకోవాలి. ప్లీజ్!" అన్నది సుజాత.

దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వలేదని అన్నారు పెద్దలు. సుజాతలాంటి అమ్మాయిల విషయంలో కాసేపు పూజారిపాత్ర నటించడం నాకిష్టం.

"ఓ. కె. మీరు ఎక్కడనుండి మాట్లాడుతున్నారు?" అడిగాను.

"11/2, పార్కురోడ్. మా ఇంట్లోంచే మాట్లాడు తున్నాను" ఆవిడ గొంతులో ఆతృత కనిపిస్తోంది.

"రైటో. మీరు వెంటనే రండి. సిన్హాగారికి చెపుతాను" అన్నాను రిసీవర్ క్రెడిల్ చేస్తూ.

* * *

సుజాత వయస్సెంతుంటుందో మనిషిని చూసి ఊహించి చెప్పడం కష్టం. ఇరవైకు, ముప్పైకు మధ్య వుండొచ్చు. గుండ్రని ముఖం, కవ్వించే కాటుక కళ్లు, నవ్వే పెదిమలు, మనిషి పొడుగనే చెప్పాలి. ఏ అవయవానికి ఆ అవయవం ఎవరో శిల్పి, జీవితమంతా కష్టపడి చెక్కినట్లు-ఒక్కక్షణం ఊపిరి పీల్చడం మానేశాను సుజాతను చూడగానే.

సిన్హాగారు చలించని మహర్షిలా సుజాతను ఆపాదమస్తకం క్షణంలో పరిశీలించారు.

"కూర్చోమ్మాయ్! వివరాలు చెప్పు" అన్నారు సూటిగా ఆమె కళ్ళల్లోకే చూస్తూ.

సుజాత ఒక్కసారి పెదిమలు తడిచేసుకొంది. "మావారు

నిన్న సాయంత్రంనుండి కనిపించడంలేదు" అన్నది.

నవ్వొచ్చింది నాకు. అయినా సీరియస్ గా ఆమె ముఖం లోకే చూస్తూ కూర్చున్నాను.

"వివరంగా చెప్పు" అన్నారు సిన్హాగారు రైలింజన్లా 'మొరాకో' పొగ వదుల్తూ.

"మావారిపేరు సుబ్బారావు. షేర్ బ్రోకరు. స్టాక్ ఎక్స్ఛేంజ్ లో ఎవరినడిగినా చెపుతారు. నిన్న సాయంత్రం ఆఫీసునుండి బయల్దేరిన తర్వాత ఇంతవరకూ ఇంటికిరాలేదు. ఆయన కేమన్నా ప్రమాదం జరిగిందేమోనని భయంగావుంది" అన్నది సుజాత.

"అమ్మాయ్! సంపాదనచేసే మగవాడికి లక్షపను లుంటాయి. ఒక్కరాత్రి సుబ్బారావు ఇంటికి రాకపోతే నువ్వెందుకు కంగారుపడుతున్నావో అర్థంకావటంలేదు" అన్నారు సిన్హా తాపీగా.

ఒక్కక్షణం సుజాత నావైపు నిస్సహాయంగా చూసింది. "సిన్హాజీ! నేను భయపడడానికి కారణం వుంది. గత నెల రోజులుగా ఆయనెవ్వరో చంపుతామని బెదిరింపు ఉత్తరాలు వ్రాస్తున్నారు."

"వాట్!" అన్నాను ఆశ్చర్యంగా సుజాతవైపు చూసి.

"అమ్మాయ్! నువ్వు వెంటనే పోలీసు రిపోర్టు ఇవ్వా ల్సింది. ఇలాంటి విషయాలను పోలీసులు బాగా కూపీ తీస్తారు" అన్నారు సిన్హా.

సుజాత కళ్ళల్లో ఒక్కక్షణం నీళ్లు నిలిచాయి అనిపిం చింది.

"సిన్హాజీ! పోలీస్ కంప్లెయింట్ ఇవ్వమని ఎన్నిసార్లు చెప్పినా ఆయన నామాట వినలేదు. ఎవరో సరదాకి తనను భయపెట్టడానికి అలా వ్రాస్తున్నారని అనేవారు. నిన్న

సాయంత్రం ఆఫీసునుండి ఇంటికి బయలుదేరుతూ నాకు ఫోన్ చేశారు. ఆయనకోసం కనిపెట్టుకొని రాత్రంతా మేలుకొని వున్నాను. ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు. పొద్దున్నే పనిమనిషి తలుపేసరికి మెలుకువవచ్చింది. ఆయనింకా రాలేదు. ఆయన సెక్రటరీ జూలీకి ఫోన్ చేశాను. నిన్న సాయంత్రం ఆరింటికి ఆఫీసులోంచి బయలుదేరారని చెప్పింది. ఆ ఉత్తరాలు గుర్తొచ్చి నాకు భయంవేసింది. వెంటనే మీకు ఫోన్ చేశాను."

"ఆ ఉత్తరాలు తెచ్చారా?" అడిగాను ఆమె కళ్ళలోకి చూస్తూ.

సుజాత తలవూపి హాండ్ బేగ్ లోనుండి నాలుగు ఉత్తరాలు తీసి బల్లమీద పెట్టింది. ఆర్డినరీ ఎన్వలప్స్ మీద సుబ్బారావు అడ్రసు టైపు చేయబడివున్నాయి. పోస్టలు ముద్రలు అర్ధంకాకుండా గజిబిజిగా వున్నాయి. ఒక కవరుమాత్రం ఈవూళ్ళోంచే నాలుగురోజులక్రితం పోస్టయినట్లు తెలుస్తోంది.

కవరులో పావురాయి కాగితంమీద గజిబిజి అక్షరాల్తో, చిన్నపిల్లాడి వ్రాతలా, అన్నిటిలోనూ రెండేవాక్యాలు వ్రాసి వున్నాయి.

"సుబ్బారావ్! నీచావు దగ్గిరపడింది. ప్రతిక్షణం ఎదురు చూడు" సంతకంలేదు. ఉత్తరాలను, కవర్లను ఒక్క క్షణం మార్చిమార్చి చూశారు సిన్హాగారు.

"అమ్మాయ్! సుబ్బారావుకు శత్రువులు ఎవరయినా వున్నారా?" అడిగారు.

"నాకు తెలిసినంతవరకూ ఆయనకు అందరూ మిత్రులే వుండేవారు. ఒకరితో శతృత్వం పెట్టుకొనే స్వభావంకాదు ఆయనది."

"అమ్మాయ్! ఒక మనిషిని చంపేటంత పగ మామూలు శతృత్వంవల్ల కలుగదు. దానికి బలమైన కారణాలుంటాయి. సుబ్బారావు నీకు అన్ని విషయాలు దాచకుండా చెప్పే వాడా?" అడిగారు సిన్హా.

సుజాత ఆశ్చర్యంగా చూసింది. "మీ ప్రశ్న అర్థం కాలేదు" అన్నది నెమ్మదిగా.

"అంటే సుబ్బారావుగారు తన వ్యాపార విషయాలు, బయట గొడవలు మీతో ఇంట్లో వున్నప్పుడు చర్చించేవారా" అడిగాను నేను.

సుజాత తలవూపింది. "రోజూ భోంచేసేప్పుడు ఆ రోజు జరిగిన విషయాలన్నీ నాకు చెప్పడం ఆయన అలవాటు."

సిన్హాగారు అర్థంచేసుకొన్నట్టు తలపంకించారు. "సుబ్బారావు ఎప్పుడయినా రాత్రుళ్ళు ఇంటికి రాకుండా వుండి పోయేవాడా?"

"లేదు. ఎప్పుడయినా ఆలస్యం అయ్యేటట్టయితే ముందుగా ఫోన్ చేసి చెప్పేవారు."

"ఐ సీ. అడుగుతున్నందుకు ఏమీ అనుకోకండి. సుబ్బారావుగారికి గర్ల్ ఫ్రెండ్స్ ఎవరయినా వున్నారా?" అడిగాను నేను కుతూహలంగా.

సుజాత నావైపు కోపంగా చూసింది. "లేదు. ఆయన అలాంటి మనిషి కాదు."

"అమ్మాయ్! బాగా ఆలోచించిచెప్పు. సుబ్బారావు ఎప్పుడయినా తనకు ఎవరితోనన్నా శతృత్వం వున్నట్లు అన్నాడా ... బాగా ఆలోచించి చెప్పు. ఏ కాలేజీలో చదివేప్పుడో, ఏ ఆస్తి తగాదాలోనో, ఎవరితోనైనా తనకు బద్ధవైరం వున్నట్లు నీతో చెప్పాడా?" అడిగారు సిన్హా.

సుజాత ఒక్క నిముషం ఆలోచిస్తూ వుండిపోయింది.

తరువాత తల అడ్డంగావూపి, "లేదు. ఎప్పుడూ అలాంటి ప్రసక్తి రాలేదు" అన్నది.

సిన్హాగారు గంభీరంగా నవ్వారు. "అమ్మాయ్! భయపడక. బహుశా నువ్వు ఇంటికి తిరిగి వెళ్ళేప్పటికి సుబ్బారావు ఇంటికి తిరిగొచ్చి వుంటాడేమో" అన్నారు.

సుజాత ముఖంలో ఒక్క క్షణం రిలీఫ్ కనిపించినట్లయింది. "అలా జరిగితే బావుణ్ణని వేయిదేవుళ్ళకు మొక్కుకొంటున్నాను" అన్నది.

"రైటో! ఒకవేళ అవసరమొస్తే పనికొస్తుంది. సుబ్బారావు ఫోటో పంపించు" అన్నారు.

"అవసరం వుంటుందేమోనని వెంట తెచ్చాను" అన్నది సుజాత హాండ్ బాగ్ తెరచి పాస్ పోర్ట్ సైజ్ ఫోటో బల్ల మీద పెడుతూ. "పోయిన ఏడాది తీయించుకొన్నది" అన్నది.

అందమైన ఆడవాళ్ళ భర్తలెప్పుడూ అసహ్యంగావుంటారని నా ప్రగాఢ విశ్వాసం. నా నమ్మకాన్ని బలపరచడానికి సుబ్బారావు ఫోటో శతవిధాల ప్రయత్నం చేసింది.

నున్నగా అణచి పైకి దువ్విన క్రాపు, చీకికళ్ళు, గద్ద ముక్కు, బిగించిన పెదిమలు, అతని ఒంటి రంగును మార్చడానికి ఫోటోగ్రాఫరు చేసిన ప్రయత్నం వృధా అయినట్లు కనిపిస్తోంది.

సిన్హాగారు ఫోటోవంక కాసేపు దీర్ఘంగా చూశారు.

"అమ్మాయ్! నువ్వు ఇంటికెళ్ళేప్పటికి సుబ్బారావు రాకపోతే మళ్ళీ ఫోన్ చెయ్యి. అతన్ని వెతికి పట్టుకొనే పని ప్రారంభిస్తాను" అన్నారు 'మొరాకో' ఆష్ ట్రేలో ఆర్పేస్తూ.

## 2

సుబ్బారావులాంటి అనాకారికి, ఎంతమంచివాడైనా కాని

వ్వండి, సుజాతలాంటి భార్య వుండడం చూస్తే నాకు అకారణంగా కోపం రాసాగింది. సుబ్బారావు ఇంటికి తిరిగి రాకుండావుంటే బావుండుననిపించింది.

అనుకొన్నట్లుగానే సుబ్బారావు ఇంటికి రాలేదని సుజాత ఫోన్ చేసింది. సుబ్బారావు ఆఫీసు అడ్రసు తీసుకొని ఫోను పెట్టేశాను.

సిన్హాగారు ఈజీచైర్‌లో దీర్ఘంగా ఆలోచిస్తూ కని పించారు. ఎత్తైన భారీ విగ్రహం. ఎర్రనికళ్ళు, బిస్మార్కు మీసం, బిగించిన పెదిమలు, పెదిమలమధ్య నిరంతరం వెలిగే 'మొరాకో' సిగార్ - అపరాధుల గుండెల్లో ప్రతిక్షణం కలుక్కుమనే ధర్మపు దివిటీ.

"మనం పరిశోధన మొదలుపెట్టడానికి తగిన కారణం వుందంటారా?" అడిగాను నేను సందేహంగా.

సిన్హాగారు తపోభంగమైన మహర్షి లా చూశారు నావైపు. "అదే ఆలోచిస్తున్నాను. సుజాత అనవసరంగా భయపడు తోందా లేక నిజంగా సుబ్బారావును ఎవరైనా ఎత్తు కెళ్ళారా? అలా అయితే ఏమిటి వాళ్ళకు ఉపయోగం? సుబ్బారావుమీద చంపేంతటి పగవున్నది ఎవరికి?" అన్నారు తనలో తాను మాట్లాడుతున్నట్లు చిన్నగా.

నేను మాట్లాడలేదు. మౌనంగా వింటూ ఊరుకొన్నాను.

సిన్హాగారు చటుక్కున లేచి నిలబడ్డారు.

"డామిట్! కూర్చొని ఆలోచించడంవలన ప్రయోజనం ఏముంది? పరిశోధన ప్రారంభిస్తేకాని నిజానిజాలు తెలి యవు. పద. సుబ్బారావు ఆఫీసుకు వెళదాము" అన్నారు బయటకు నడుస్తూ.

పావుగంటలో స్టాక్ ఎక్స్ఛేంజికి దగ్గర్లో వున్న సుబ్బా రావు ఆఫీసుకు చేరుకున్నాము.

ఆఫీసు ముందు గదిలో ఎవరూ లేరు. నేను, సిన్హాగారు ముఖాలు చూసుకొన్నాం. గదిలో విజిటర్స్ కూర్చునేందుకు సోఫా, రెండుబల్లలు, కుర్చీలు, గోడలకు గమ్మత్తయిన ఆయిల్ పెయింట్స్, క్రింద ఉన్నికార్పెట్.

"ఆఫీస్" అని వ్రాసివున్న గదిమీద చిన్నగా తట్టాను. లోపల ఎవరో కదిలిన చప్పుడయింది.

"ప్లీజ్ కమిన్!" ఎవరిదో ఆడగొంతు వినిపించింది.

తలుపు తెరచుకొని లోపలకు నడిచాము. టైపు రైటరు వెనకాల గదిలో ఓ మూలగా ఓ ఆంగ్లో ఇండియన్ అమ్మాయి కూర్చొనివుంది. మమ్మల్ని మేము పరిచయం చేసుకొని వచ్చిన పని చెప్పాను. మిస్ జూలీ నేను చెపుతున్న విషయాల్ని ఆశ్చర్యంగా విన్నది. సుబ్బారావుకు వస్తున్న బెదిరింపు ఉత్తరాలను గురించి చెప్పగానే నమ్మలేనట్లు చూసింది మా వంక.

"హౌ డిస్ బిలీవింగ్! మిస్టర్. రావుకు శత్రువులున్నారని నేనెప్పుడూ అనుకోలేదు" అన్నది ఎర్రని లిప్‌స్టిక్ వేసిన పెదిమలు తడుపుకొంటూ.

"ఆమాటే మిసెస్ సుజాతకూడా అంటోంది. నిన్న సుబ్బారావు ఆఫీసునుండి ఇంటికి ఎన్నిగంటలకు బయల్దేరాడో చెప్పగలరా?" అడిగాను.

"సుమారు ఆరుగంటల ప్రాంతంలో బయలుదేరారు."

"వెళ్ళేముందు ఎవరికయినా ఫోన్ చేశారా?"

"ఆ! ఇంటికి ఫోన్ చేసి మిసెస్ రావును తనకోసం కాచుకొని వుండమని, ఏదో ఇంపార్టెంట్ విషయం మాట్లాడాలనీ అన్నారు."

"ఐసీ. ఇంటికెళ్ళేముందు ఇంకెక్కడికయినా వెళ్ళాలని గాని, ఎవర్నయినా కలుసుకోవాలనిగాని అన్నారా?"

"లేదు. అలాంటిదేం చెప్పలేదు. కాని ఈరోజు మార్నింగ్ మెయిల్ చూశాక ఆయన వెంటనే ఇంటికి వెళ్ళలేదని అనుకొంటున్నాను" అన్నది జూలీ అదోలా.

సిన్హాగారు చిత్రంగా జూలీవంక చూశారు. "మిస్ జూలీ! మళ్ళీ ఏదయినా ఉత్తరం వచ్చిందా?" అడిగారు.

"అవును. సుబ్బారావుగారే వ్రాశారు. రాత్రి ప్రొద్దుపోయి పోస్ట్ చేసుండాలి. కవర్ మీద లేట్ ఫీ అతికించారు. తానిక ఆఫీసుకు రాబోవడంలేదనీ, బిజినెస్ మానేస్తున్నాననీ, ఆఫీసు అద్దె, అకౌంటెంట్ కు, గుమస్తాకు, ప్యూన్ కు, నాకు రెండు నెలల బోనస్‌తో కలిపి జీతాలకు సరిపోయే చెక్ జత చేసి, వ్రాశారు. ఉత్తరం మొదట చదవగానే నాకు విషయం అర్థం కాలేదు. ఆ చెక్ కార్ డీలర్ మహాలింగం ఇచ్చినది. నా పేరుమీద వ్రాయించారు. ఫోన్ చేసి కనుక్కొన్నాను రాత్రి ఆయన కారు అమ్మేసినట్లు తెలిసింది."

ఒక్క క్షణం అంతా గజిబిజిగా తోచింది నాకు. "యు మీన్ టుసే, రావుగారు బిజినెస్ ఈ రోజునుండి మానేశారనా?" అన్నాను.

"అవును! అదే నాకు అంతుపట్టకుండా వుంది. ఇప్పుడు స్టాఫ్ అందరికీ ఎలా చెప్పాలో అర్థంకావడంలేదు" అన్నది జూలీ తలపట్టుకొంటూ.

నిజంగానే సుబ్బారావు కేసులో ఏదో అంతు తెలియని గమ్మత్తువుంది అనిపించడం మొదలుపెట్టింది నాకు. నిన్న సాయంకాలం ఇంటికి బయల్దేరిన సుబ్బారావు, మధ్యదారిలో కారు అమ్మేసి, ఆఫీసు సిబ్బందికి, అద్దెకు, పనివాళ్ళ జీతాలకు సరిపడా చెక్కు పంపించి, ఇంటికెళ్ళకుండా అదృశ్యమయిపోయాడు. వండ్రఫుల్.

"మిస్ జూలీ! ఆ వుత్తరం ఓసారిలా ఇస్తావా?" అడిగారు

సిన్హా.

మిస్ జూలీ డ్రాయరు సొరుగులోనుండి ఓ పోస్టల్ కవరు తీసి బల్లమీద పెట్టింది.

సిన్హాగారు కవర్ని జాగ్రత్తగా చూశారు. రైల్వే స్టేషన్ ఆర్. యమ్. యస్. ముద్ర స్పష్టంగా కనిపిస్తోంది. అంటే ఆ ఉత్తరం రైల్వేస్టేషన్లో పోస్ట్ చెయ్యబడిందన్న మాట. లేట్ ఫీ క్రింద ఎక్స్ట్రా పదిహేను పైసలు స్టాంపులు అతికించి వున్నాయి.

కవర్లో డైరీలోంచి చింపిన కాగితంమీద వ్రాసిన ఉత్తరము, దానితోపాటు పదిహేనువేలకు చెక్కు వున్నాయి. చెక్కు మిస్. జూలీ పేర్న వ్రాయబడివుంది. చెక్కుమీద సంతకం 'మహాలింగం అండ్ సన్స్' కార్ డీలర్స్ మేనేజరు సంతకం చేసివుంది.

"మిస్ జూలీ! ఈ ఉత్తరం వ్రాసింది రావుగారేనంటారా?" అడిగాను.

"నో డౌట్ ఎబౌట్ దట్. అది ఆయన చేతివ్రాతే. అందులో సందేహంలేదు."

"సుబ్బారావు బిజినెస్ ఎలా నడుస్తోంది?"

"ఈమధ్య కాస్త నష్టం వస్తోంది."

"అంటే బిజినెస్ మానేసేంత నష్టంలో నడుస్తోందా?"

"ఒకరకంగా అనే చెప్పుకోవాలి. గత ఆరునెలల్లోనూ సుబ్బారావుగారు స్పెక్యులేషన్లో విపరీతంగా నష్టపోయారు. ఆఖరికి ఆయన ఇల్లు తాకట్టుపెట్టి తెచ్చిన డబ్బు కూడా పోయింది. నిజం చెప్పాలంటే మళ్ళీ అదృష్టం కలిసొచ్చి హఠాత్తుగా విపరీతమైన లాభాలొస్తేగాని నిలబడగల స్థితిలోలేదు. గత రెండు నెలలుగా మా స్టాఫ్ ఎవరికీ జీతాలు ఇవ్వలేదు. ఇదే మరొకరి దగ్గరయితే ఈ పాటికి అంతా పని

మా నేసి వుండేవాళ్ళం. కాని మిస్టర్ రావ్ దగ్గర అలా కాదు. బాగా లాభాలు వచ్చే రోజుల్లో ఆయన మమ్మల్ని పార్ట్నర్స్‌లా చూసేవారు.''

''ఐసీ. అయితే సుబ్బారావు తను బిజినెస్ మానేయ బోతున్నానని మీకు నిన్నగాని, ఈమధ్య ఎప్పుడయినా, కనీసం సూచనప్రాయంగానైనా చెప్పాడా?'' అడిగారు నిస్వాగారు.

''లేదు. అందుకే నాకు ఈ విషయం ఎంత ఆలోచించినా అర్థంకావడంలేదు. ఎలాంటి పరిస్థితుల్లోనయినా ఆయన బిజినెస్ మానేయరనే నేను అనుకొనే దాన్ని.''

అన్నది మిస్ జూలీ ఇంకా ఈ విషయాన్ని తను నమ్మలే దన్నట్లు.

''నిన్న సుబ్బారావు ఎవరెవరితో మాట్లాడాడో, ఎవర్ని కలుసుకొన్నాడో చెప్పగలవా?''

జూలీ తల వూపింది. ''నిన్న ఆఫీసుకు వచ్చినప్పట్నుంచి చాలా మూడీగా వున్నారు. రోజంతా ఎవర్నీ కలుసుకో లేదు. మధ్యలో ఓసారిమాత్రం బ్యాంక్‌కు ఫోన్ చేసి తన లోన్ అప్లికేషన్ విషయం గురించి ఏజెంట్‌తో మాట్లాడారు. ఆ తర్వాత రోజంతా దాదాపు సిగరెట్లు కాలుస్తూ గడిపారు. రెండుగంటల ప్రాంతంలో సిగరెట్లు అయిపోతే బోయ్‌ని పంపించి మరో ప్యాకెట్ తెప్పించుకొన్నారు. ఆఫీసుబోయ్ ఆయన బ్రాండ్ 'స్టేట్ ఎక్స్‌ప్రెస్ 555' దొరక లేదని 'డన్‌హిల్' సిగరెట్లు తెచ్చిచ్చాడు. ఎప్పుడూ ఎవర్నీ ఏమీ అనని మిస్టర్ రావ్ అతనిమీద కోప్పడ్డారు. తరువాత మళ్ళీ తన ఆలోచనల్లో మునిగిపోయారు.

''అయిదు గంటల ప్రాంతంలో కారు డ్రైవరు జానీని పిలిచి, తాను కారు అమ్మేస్తున్నానని, తను ఇక పనిక్కి

రావలసిన అవుసరంలేదని చెప్పి, అతనికి ఇవ్వాల్సిన జీతం ఇచ్చేశారు. జాని చాలా గొడవచేశాడు. తనను పర్మనెంటుగా తీసెయ్యడానికి కారణం కారు అమ్మడంకాదని, ఏదో మనసులో పెట్టుకొని తన ఉద్యోగం తీసేస్తున్నారనీ అన్నాడు. చివరికి మిస్టర్ సుబ్బారావు కోపంవచ్చి పోలీసుల్ని పిలుస్తాను అని బెదిరిస్తే వెళ్ళిపోయాడు. ఈ విషయాలు తప్పితే నిన్న ఆయన ఎవర్నీ కలుసుకోవడంగాని, మాట్లాడ్డంగాని జరుగలేదు.''

''ఈ కారు డ్రైవరు జానీ ఎలాంటివాడు?'' అడిగాను నేను.

''చాలా గర్విష్టి. మిస్టర్ రావ్‌నుకూడా ఒక్కోసారి నిర్లక్ష్యంగా చూస్తున్నట్లు అనిపించేది.''

''ఐసీ. సుబ్బారావుకు ఎవరైనా శత్రువులున్నట్లు మీకు తెలుసా?''

''లేదు. ఆయన చాలా మంచి యజమాని. ఎప్పుడూ ఎవరిమీద కోపం తెచ్చుకొన్నట్లుగాని, తగాదా పెట్టుకొన్నట్లుగాని నేను చూడలేదు. అంచేతే నిన్న ఆఫీస్‌బోయ్‌మీద కోప్పడడం, డ్రైవర్ జానీతో తగాదా నాకు అసహజంగా తోచాయి.''

అన్నది మిస్ జూలీ ముఖంమీద చిరుచెమట కర్చీఫ్‌తో వత్తుకొంటూ.

''ఓ.కె. మిస్ జూలీ. థాంక్యూ వెరీమచ్. ఒక్క చివరి ప్రశ్న వేస్తాను'' అన్నాను.

జూలీ అడగమన్నట్లు తల వూపింది.

''సుబ్బారావుగారి ప్రయివేట్ లైఫ్‌గురించి మీకేమైనా తెలుసా? అంటే సుజాతతో ఆయన ఎలావుండేవాడు. ఆయనకేవయినా గర్ల్‌ఫ్రెండ్స్ వున్నారా-ఇలాంటివి?''

మిస్. జూలీ ముఖం ఒక్క క్షణం ఎర్రబడింది. "లేదు. హియీజ్ ఎ జంటిల్ మన్" అన్నది నావంక చిత్రంగా చూస్తూ.

జూలీకి థాంక్స్ చెప్పి మహాలింగం గారేజికి బయలు దేరాము.

## 3

'మహాలింగం అండ్ సన్' కార్ డీలర్స్ మేనేజరు ముత్యాలరావు మమ్మల్ని చూడగానే వినయంగా లేచి నిల బడ్డాడు. నున్నగా కోడిగుడ్డులా మెరుస్తోన్న బట్టతల, గద్ద ముక్కు, తెలివైనకళ్ళు, హిట్లర్ మీసం, పొట్టిగా లావుగా వలిగిన బిజినెస్ సూట్లో చూడముచ్చటగా వున్నాడు ముత్యాలరావు.

"గ్లాడ్ టు సీ యు జంటిల్ మన్! వాట్ కెన్ ఐ డు ఫర్ యు" అన్నాడు నవ్వుతూ.

నేను మమ్మల్ని పరిచయం చేసుకోగానే ఆశ్చర్యంగా మావంక చూశాడు. "వండ్రఫుల్ మార్నింగ్. మిమ్మల్ని గురించి విన్నానుగాని ఇంతవరకు కలుసుకొనే భాగ్యం లభించలేదు. ఏం తీసుకొంటారు" అన్నాడు బల్లమీద బెల్ నొక్కి.

సిన్హాగారు నవ్వుతూ చూశారు. "ముత్యాల్రావ్! అలాంటి ప్రయత్నాలు చెయ్యక. ఎక్కువసేపు కూర్చోవడానికి టైమ్ లేదు. నేనడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పు" అన్నారు.

"ష్యూర్, ష్యూర్! అడగండి ఐ విల్ బి గ్లాడ్ టు..." అన్నాడు ఉత్సాహంగా జబ్బలు చరుచుకొంటూ.

"నిన్న సాయంత్రం స్టాక్ బ్రోకర్ సుబ్బారావు ఇక్కడికి ఎన్నింటికి వచ్చాడు" అడిగారు.

"సాయంత్రం ఆరుంబావు, ఆరున్నర ప్రాంతాలలో వచ్చారు."

"ఇక్కడనుండి మళ్ళీ ఎన్నింటికి బయల్దేరాడు?"

"ఎనిమిదయిందనుకుంటాను. ఆయన్ని పంపించి తరువాత నేనూ ఇంటికెళ్ళాను."

"ఐసీ. ఇక్కడనుండి ఎక్కడికి వెళ్తుంటాడో మీకు తెలుసా?" అడిగాను.

"నో ఐడియా! తెలియదు. కాని ఈ ప్రశ్నలన్నీ ఎందుకడుగుతున్నారు?" సస్పెన్స్ భరించలేని మనిషిలా అడిగాడు.

"నిన్న సాయంత్రంనుండి సుబ్బారావు కనిపించడంలేదు" అన్నారు సిన్హా.

ముత్యాల్రావు విచిత్రంగా నవ్వాడు. "ఆశ్చర్యంగా వుందే?"

"అవును. నిన్న సాయంత్రం సుబ్బారావు ఎలాంటి డ్రస్ వేసుకొన్నాడు?"

ముత్యాలరావు ఒక్కక్షణం ఆలోచించాడు. "నల్లచారలున్న తెల్లసూటు, నల్లరంగు టై, తెల్లషర్టు" అన్నాడు.

నేనింకా అడగవలసిన ప్రశ్నలేమన్నా వున్నయ్యా అన్నట్లు చూశాను సిన్హాగారివైపు. సిన్హాగారు తలవూపి లేచి నిలబడ్డారు.

"థాంక్యూ మిస్టర్ ముత్యాలరావ్. థాంక్స్ ఫర్ ది ఇన్‌ఫర్మేషన్" అన్నాను సిన్హాగారితో బయటకు నడుస్తూ.

గారేజినుండి బయటకు రాగానే ఒక్కక్షణం పేవ్‌మెంట్ మీద ఆగాము.

"సుబ్బారావు ఇక్కడినుండి రైల్ స్టేషన్‌కు వెళ్ళాడో, ఇంకెక్కడికయినా వెళ్ళాడో తెలియదు. జూలీకి వ్రాసిన ఉత్తరం స్టేషన్‌లో పోస్ట్ చేశాడు కాబట్టి, రైల్వేస్టేషన్‌కే

వెళ్ళాడని అనుకోవాలి" అన్నారు సిన్హాగారు. నేను అవునన్నట్లుగా తలవూపాను.

# 4

"సుబ్బారావు రైల్వేస్టేషన్ నుండి రైలెక్కి మరో వూరెళ్ళిపోయాడో లేక మళ్ళీ వూళ్ళోకి వెళ్ళిపోయి వుండాలి" అన్నారు సిన్హాగారు స్టేషన్లో కెళుతూ

"ఒకవేళ ఉత్తరం పోస్ట్ చెయ్యడానికే రైల్వేస్టేషన్కు వచ్చినట్లయితే, ఆర్. యమ్. యస్. పోస్టాఫీసులో ఉత్తరం పోస్ట్ చేసి తిరిగి ఊళ్ళోకి వెళ్ళిపోయి వుండాలి" అన్నాను.

"యస్. దటీజ్ రైట్ లేకపోతే ఏదన్నా ఊరు వెళ్ళుండాలి. వెళితే ఎక్కడకు వెళ్ళుంటాడు. కేవలం ఉత్తరం పోస్ట్ చెయ్యడంకోసమే రైల్వేస్టేషన్కు వచ్చాడని నేననుకోను. సుబ్బారావు ఏదో చెయ్యాలని నిశ్చయించుకోకపోతే అంత అర్జంటుగా వుత్తరాన్ని పోస్టు చెయ్యాలనుకోడు. లేక ఊరువదిలి పోతున్నాడు కనుక జూలీకి ఆ ఉత్తరం వ్రాసి వెళ్ళిపోయాడా?" తనలోతాను మాట్లాడుకొంటున్నట్లు అన్నారు సిన్హాగారు.

ఇద్దరం టిక్కెట్ కలెక్టర్ దగ్గరకు నడిచాము. కోల్ షార్టేజివలన చాలా ట్రైన్సు కాన్సిల్ చేశారు. టి. సి. ఆవులిస్తూ మావంక చూశాడు.

"ఎక్స్క్యూజ్ మీ, ఐ వాంట్ సమ్ ఇన్ఫర్మేషన్" అన్నాను అతనివంక నవ్వుతూ చూస్తూ.

అతను నావంక కోపంగా చూశాడు. "ఐ హావ్ నో ఇన్ఫర్మేషన్ టు సప్లై. యూగో అండ్ ఆస్క్ ఇంది ఎంక్వయిరీ" అతని రైల్వే ఇంగ్లీషు ముచ్చటగావుంది.

"దిసీజ్ నథింగ్ టు డు విత్ ఎంక్వయిరీ ఆఫీస్"

అన్నాను.

"దెన్ గో అండ్ మీట్ ది ఇంచార్జ్!"

"హు యీజ్ ది ఇంచార్జ్?" అడిగాను.

"గో అండ్ ఆస్క్ ఇన్ ది ఆఫీస్" అన్నాడు విసుగ్గా.

"వేరీజ్ ది ఆఫీస్?" అన్నాను అదే ధోరణిలో.

అతను మావంక కోపంగా చూసి చకచకా లోపలకు వెళ్ళి ప్రయాణీకుల టికెట్లు 'పంచ్' చెయ్యసాగాడు. సిన్హాగారు ముందుకు వచ్చి నిలబడ్డారు. జేబులోనుండి పర్సు తీసి చేత్తో పట్టుకొని అతనివైపు నవ్వుతూ చూశారు.

"అబ్బాయ్! నిన్న సాయంత్రం ఎనిమిది పదిగంటల మధ్య నువ్విక్కడే వున్నావా?" అడిగారు పర్సువంక ఆశగా చూస్తున్న అతన్ని.

అతనొకసారి పెదిమలు తడిచేసుకొని మా వంక అనుమానంగా చూశాడు. "లేదు నేను కాదు. రాత్రి ఏనిమిది నుండి పన్నెండువరకూ సత్తిరాజు డ్యూటీ. అతనిప్పుడు హాయిగా నిద్రపోతూ వుంటాడు."

"అలాగా! ఆర్. యమ్. యస్. ఆఫీసు ఎటుప్రక్క వుంది?

"ప్లాట్ ఫారంకు అటు చివరవుంది."

"ఏదైనా వుత్తరం పోస్ట్ చెయ్యాలంటే ఇటునుండీ వెళ్ళాలా వేరే దారుందా?" అడిగారు సిన్హా.

"ఇటునుండే వెళ్ళాలి" అన్నాడు టి. సి. విసుగ్గా.

సిన్హాగారు చటుక్కున వెనక్కు తిరిగి బుకింగ్ ఆఫీసు వైపు నడిచారు. టి.సి. మా వంక కోపంగా చూస్తున్నాడు.

"సార్! సత్తిగాజు అడ్రసు కనుక్కోరా?" అడిగాను.

సిన్హాగారు నావైపు చూశారు, "ఆ పని నువ్వు చెయ్యి. ఈలోగా రిజర్వేషన్ కౌంటర్లోనూ, బుకింగ్ ఆఫీసులోనూ

రాత్రి సుబ్బారావు టికెట్టుకొన్నాడేమో ఎంక్వయిర్ చేస్తాను'' అన్నారు.

నేను టి. సి. సత్తిరాజు అడ్రస్ వ్రాసుకొనే లోపలే సిన్హాగారు తిరిగొచ్చారు. ''లాభంలేదు బోయ్! రాత్రి సుబ్బారావు టికెట్టుకొనలేదు. అసలు ఎనిమిదినుండి, రెండు గంటల మధ్య ట్రైనేమీ లేదట. వెయిటింగ్ హాల్ అటెండర్ని అడిగాను. సుబ్బారావు పోలికలున్న మనిషెవరూ రాలేదన్నాడు'' అన్నారు.

నేను సిన్హాగారి వైపు నిస్పృహగా చూశాను. ''అయితే స్టేషన్ నుండి సుబ్బారావు ఏమయినట్లు? ఎటు వెళ్ళాడు'' అన్నాను.

# 5

సత్తిరాజు ఇల్లు రైల్వే క్వార్టర్స్‌లో వుంది. మా కారు ఆగేప్పటికి రోడ్డుమీద ఆడుకొనే పిల్లలు కారును చుట్టుముట్టారు. వాళ్ళల్లో ఓ పెద్దకుర్రాణ్ణి చూసి మేము మళ్ళీ తిరిగొచ్చేవరకూ కారుని ఎవరూ ముట్టుకోకుండా చూస్తే పావలా ఇస్తానని చెప్పి సత్తిరాజు క్వార్టర్స్ తలుపు తట్టాను. ఎవరో భూతద్దాల వ్యక్తి తలుపు తెరిచాడు.

''సత్తిరాజుగారు కావాలి,'' అన్నాను అతన్ని ఎగాదిగా చూస్తూ.

''నేనే సత్తిరాజును. ఏం కావాలి?'' అడిగాడు సత్తిరాజు.

మమ్మల్ని పరిచయం చేసుకొని వచ్చిన విషయం చెప్పాను. సత్తిరాజు కళ్ళజోడు ఓసారి శుభ్రంగా తుడిచి, మళ్ళీ పెట్టుకొని మా వంక పరకాయించి చూశాడు.

''ఎంతోమంది వస్తుంటారు, పోతుంటారు. రోజూ అనేకమందిని చూస్తుంటాను. ఎలా గుర్తుపెట్టుకోవడం?''అన్నాడు

వేదాంత ధోరణిలో.

నేను సుబ్బారావు ఫోటో చూపెట్టానతనికి. "నల్ల చారలున్న తెల్ల సూటు వేసుకొన్నాడు. నలుపురంగు టై. మీరు చూసేవుండాలి" అన్నాను.

సత్తిరాజు ఫోటోవంక కాసేపు దీర్ఘంగా చూశాడు. "ముఖం గుర్తులేదుగాని, మీరు చెప్పిన సూటు వ్యక్తిని నిన్న సాయంత్రం చూచాను."

"సత్తిరాజూ గో ఆన్! వివరంగా చెప్పు!" అన్నారు సిన్హాగారు 'మొరాకో' వెలిగిస్తూ.

"ఎనిమిదిన్నర తొమ్మిది ప్రాంతంలో అనుకొంటాను. ఆర్. యమ్. యస్. ఆఫీసు కెళ్ళడానికి లోపలకు వెళతానని అడిగాడు. ప్లాట్ ఫారం టిక్కెట్టు కొనుక్కొని వెళ్ళమన్నాను. రాత్రి రెండు గంటలవరకూ వచ్చే ట్రెయిన్సు, వెళ్ళే ట్రెయిన్సు ఏమీ లేకపోవడం వలన బుకింగ్ ఆఫీసు మూసేసి వుందని, లేకపోతే కొనేవాణ్ణని అన్నాడు. సరే వెళ్ళమని చెప్పాను. ఓ పది నిముషాల తరువాత బయటికి వెళుతూ థాంక్స్ చెప్పి వెళ్ళాడు" అన్నాడు సత్తిరాజు.

"సత్తిరాజూ! ఫోటోను మళ్ళీ ఓ సారిచూసి అతనేమో చూడు" అన్నారు సిన్హాగారు.

సత్తిరాజు మళ్ళీ ఫోటో ఓసారి పరకాయించి చూశాడు తల అడ్డంగా ఊపుతూ.

"మొహం గుర్తులేదు. చారల సూటు, నల్ల టై మాత్రం గుర్తున్నాయి. అతనే అయ్యుండాలి," అన్నాడు.

సత్తిరాజుకు 'థాంక్స్' చెప్పి మళ్ళీ బయలుదేరాము.

సో దిస్ జ్ ది డెడ్ ఎండ్! సుబ్బారావు ఉత్తరం పోస్టు చేసి బయటకొచ్చాడు. అంటే బయటవూరికి వెళ్ళలేదని తెలుస్తోంది. మరి వూళ్ళోనే వుంటే ఇంతవరకూ ఇంటి

కెందు కెళ్ళలేదు. ఉత్తరం పోస్ట్ చేసింతరువాత సుబ్బా రావు ఎక్కడికి కెళ్ళాడు? ఆలోచిస్తుంటే అంతా గందర గోళంగా వుంది.

"ఏం చేద్దాం సార్?" అడిగాను.

"మళ్లీ రైల్వే స్టేషన్ కు పోనియ్! సుబ్బారావు బయటికి కొచ్చాక ఎక్కడికి కెళ్లాడో తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం," అన్నారు సిన్హాగారు తాపీగా.

ఆ తర్వాత రెండుగంటలూ, సిన్హాగార్ని తిట్టుకుంటూ గడిపానని వేరే చెప్పఖర లేదనుకుంటాను.

సిన్హాగారు తరగని ఉత్సాహంతో, పోర్టర్లను, రిక్షా వాళ్ళను, టాక్సీడ్రైవర్లను, కిళ్ళీ బంకువాళ్ళను, ఆఖరికి ముష్టివాళ్ళనుకూడా సుబ్బారావును వర్ణిస్తూ అతన్నిగురించి ఆచూకీ అడిగారు. రాత్రి ఎనిమిది తొమ్మిది మధ్య సుబ్బా రావును చూసి గుర్తుపెట్టుకున్న వాళ్లెవరూ లేరు.

అసలు సుబ్బారావు మాయమవ్వలేదనీ, ఈపాటికీ ఇంటికి చేరుకొనుంటాడనిపించి, మధ్యలో ఓసారి సుజాతకు ఫోన్ చేశాను. సుబ్బారావు రాలేదని చెప్పింది.

ఎంత సేపు వెతికినా సుబ్బారావును చూసిన మానవమాత్రు డెవరూ కనిపించలేదు.

స్టేషన్ నుండి బయటికొచ్చాక సుబ్బారావు హఠాత్తుగా అదృశ్యమయిపోయాడు. ఎక్కడికెళ్ళాడు. ఊళ్ళోనే వున్నాడా? లేక ఎవరయినా అతన్ని కిడ్నాప్ చేశారా? లేక ఏ సందులోనో హత్యచేశారా? రాత్రి తొమ్మిది తరు వాత సుబ్బారావు ఏమయ్యాడో ఎంత ప్రయత్నించినా ఆచూకీ తెలియలేదు.

# 6

సిగరెట్ వెలిగించి ఇంతవరకూ జరిగిన విషయాలన్నీ ఓసారి ఆలోచించాను.

సుబ్బారావు ఇంకా ఇంటికి రాలేదనీ, త్వరగా ఏదైనా చెయ్యమని సుజాత మళ్ళీ ఓసారి ఫోన్ చేసింది.

ఆలోచిస్తోంటే మధ్యలో మాకు తెలియని విషయాలు చాలా వున్నాయనిపిస్తోంది.

సుబ్బారావు వ్యాపారంలో నష్టపడ్డాడు. నిన్న సాయంత్రం ఆఫీసునుండి ఇంటికి బయలుదేరి మధ్యలో కారు అమ్మేసి, ఆ చెక్కును, జూలీకి వ్రాసిన వుత్తరాన్ని రైల్వేస్టేషన్‌లో పోస్ట్ చేసాడు. సుబ్బారావు రైలెక్కి మరో ఊరెళ్ళినట్లు సాక్ష్యంలేదు. అసలు రైల్వేస్టేషన్ నుండి బయటికొచ్చాక ఎటువెళ్ళాడో ఎవరూ గమనించలేదు.

ఆఫీసులోనుండి ఇంటికి బయలుదేరేముందు సుజాతకు ఫోన్ చేసి అర్జెంట్ విషయం మాట్లాడాలన్నాడు. ఏమిటా విషయం? సుజాతతో మాట్లాడదలచినవాడు ఇంటికెళ్ళకుండా ఎక్కడికి వెళ్ళినట్లు?

అంటే సుబ్బారావుకు ఆరోజు సాయంత్రంవరకూ ఎక్కడికన్నా ఊరువదిలి వెళ్ళాలి అనే ఆలోచన లేనట్లు స్పష్టమవుతోంది. అయితే సుబ్బారావును రైల్వేస్టేషన్ దగ్గర ఎవరైనా కలుసుకున్నారా? కలుసుకొని తమవెంట తీసుకెళ్ళారా? అంచేత ఏ రిక్షాగాని, టాక్సీగాని సుబ్బారావు ఎక్కలేదా?

ఒకవేళ ఎవరన్నా సుబ్బారావుని కిడ్‌నాప్ చేసి తీసుకెళ్ళారా? సుబ్బారావులాంటి మనిషిని బలవంతంగా తీసుకెళ్ళడం అసంభవం. కాని తెలిసినవాళ్ళెవరయినా అయితే సుబ్బారావు అనుమానం లేకుండా అతనివెంట వెళ్ళి వుండొచ్చు. అయితే సుబ్బారావును కిడ్‌నాప్ చెయ్యడం వలనకాని, హత్యచెయ్యడం వలనగాని ఎవరికి లాభం వస్తుంది? కారణం ఏమయ్యుంటుంది?

ఆలోచించి బుర్ర వేడెక్కిపోతోంది. ఒక్కసారి తల విదిలించి చివరికంతా కాలిన సిగరెట్ ని ఆష్ ట్రేలోఆర్పేసి, మరోటి వెలిగించాను. ఆలోచించిన విషయాలన్నీ ఓ కాగితం మీద వరసగా వ్రాశాను.

సిన్హాగారు కాగితం తీసుకు చదివి నావంక నవ్వుతూ చూశారు.

"గుడ్ వర్క్ బోయ్! మనకు సుబ్బారావు పర్సనల్ లైఫ్ గురించి ఏమీ తెలియదు. బహుశా అతని ఇంట్లో ఏ వుత్తరాలవల్లో ఏ పర్సనల్ డైరీవల్లో మనకేదన్నా ఇన్ ఫర్ మేషన్ తెలియొచ్చు" అన్నారు దీర్ఘంగా ఆలోచిస్తూ.

"అయితే నేను వెళ్ళి చూసొస్తాను" అన్నాను వుత్సాహంగా లేచి నిలబడుతూ.

"సుజాతను మరో ప్రశ్న కూడా అడుగు. నిన్న ఆఫీసు నుండీ బయలుదేరినప్పుడు ఏదో అర్జంట్ విషయం మాట్లాడా లన్నాడు సుబ్బారావు. అదేమిటో కనుక్కో," అన్నారు సిన్హాగారు.

నేను తలవూపి హుషారుగా సుజాత ఇంటికి బయలు దేరాను.

సుజాత చెప్పిన అడ్రస్ ప్రకారం ఇంటిముందు కారా పాను. చుట్టూ అందమైన తోటమధ్య చిన్న బంగళా కని పిస్తోంది. నగరంలో బాగా డబ్బున్నవాళ్ళు నివసించే ప్రదేశం అది. ఇళ్ళన్నీ ఒకదానికొకటి ఎడంగా విశాలమైన ఆవరణంలో కట్టబడివున్నాయి.

కారుదిగి ఇనపగేటు తెరుచుకొని లోపలకు నడిచాను.

వరెండా మెట్లెక్కి హాల్లోకి అడుగుపెడుతూండగానే ఒకవ్యక్తి లోపలినుండి వరెండామీదికివచ్చి నావంక పైకి క్రిందికి ఓ క్షణం చూసి చకచక నడుచుకొంటూ గేటు

తెరచుకొని వెళ్ళిపోయాడు.

దాదాపు ఆరడుగుల పొడవు, కండలు తిరిగిన శరీరం. నుదుటిమీదకు కుప్పగా పడుతోన్న జుట్టూ, చిన్న కళ్ళు, బలంగా పొడవుగావున్న ముక్కు, లావు పెదిమలు, సన్నగా కత్తిరించిన మీసం, ఖాకీపాంటు, తెల్ల టెరిలిన్ షర్టు వేశాడు.

"హలో! మీరా?" హాలులో పలకరింపు విని అటు తిరిగాను. సుజాత చిన్నగా నవ్వింది.

"హలో ... కొన్ని విషయాలు తెలుసుకోవాలని వచ్చాను" అన్నాను హాల్లోకి నడుస్తూ.

"కూర్చోండి" అంది సుజాత నాకో సోఫా చూపెట్టి తను కూర్చొంటూ. నేను విశ్వాసపాత్రుడైన నౌకర్లా వెంటనే ఓ సోఫాలో కూర్చొన్నాను.

"సారీ! కూల్ డ్రింక్ ఏమీ ఆఫర్ చెయ్యనందుకు. మా ఫ్రిజిడెర్ ఎందుకో పాడయిపోయింది. కాఫీ తీసుకొంటారా?" అన్నది సుజాత నా వంకే చూస్తూ.

"నెవర్ మైండ్! ఇందాక నేను లోపలకు వస్తున్నప్పుడు బయటకు వెళ్ళిన దెవరు?"

"ఓ...అతనా? అతను మా డ్రైవరు జానీ! మళ్ళీ పనిలోకి తీసుకోమని అడుగుతున్నాడు. ఆయన ఊరెళ్ళారని, తర్వాత రమ్మని చెప్పాను."

"సుబ్బారావుగారు కారు అమ్మేశారని మీకు తెలియదా?"

"తెలుసు. జూలీ చెప్పింది. అదే నాకు అర్థంకావడం లేదు. కారు అమ్మేస్తున్నానని నాకు మాటమాత్రంగాకూడా చెప్పలేదు" సుజాత కళ్ళక్రింద నల్లని చక్రాలు చూస్తే నాకు జాలేసింది.

"సుజాతగారూ! సుబ్బారావుగారు మొన్న సాయంత్రం ఆఫీసునుండి బయలుదేరేముందు మీతో ఏదో అర్జంట్ విషయం మాట్లాడాలని ఫోన్ చేశారని తెలిసింది. బహుశా ఆ విషయం ఏమైయ్యుంటుంది?" అడిగాను ఆ మెకళ్ళల్లో గుచ్చి చూస్తూ.

సుజాత భృకుటి ఒక్క క్షణం ముడిపడింది. "నో ఐడియా. నాకు చెప్పలేదు. ఏదో విషయం మాట్లాడాలి షాపింగ్ కు అటూ వెళ్ళకుండా ఇంట్లో నే వుండమని ఫోను పెట్టేశాడు."

"ఐసీ! సుబ్బారావుగారికి డైరీ రాసే అలవాటుందా?"

"పర్సనల్ డైరీ ఏమీ వ్రాయరు. బిజినెస్ డైరీ వ్రాస్తారు గాని అదెప్పుడూ ఆయన కోటుజేబులో నే వుంటుంది."

"సుబ్బారావు ఆఫీసురూము, పర్సనల్ కరెస్పాండెన్సు నేనొక్కసారి చూడవచ్చా?" అడిగాను. సుజాత ఒక్క క్షణం ఆలోచిస్తున్నట్లు మౌనంగా వుండిపోయింది. తరువాత తలవూపి హాలులో ఎడంప్రక్క గది చూపెట్టింది. "డైఆల్ మీన్స్!" అంటూ.

సుబ్బారావు ఆఫీసుగది నీట్ గా అరేంజ్ చేసివున్నా గదంతా దుమ్ము పేరుకొనివున్నది. పుస్తకాల అరలమీద, రేక్సమీద దుమ్ము దట్టంగా కనిపిస్తోంది. టేబుల్ మీద పెద్ద సైజు ఆష్ట్రేనిండా సిగరెట్ పీకలు, అగ్గిపుల్లలు నిండుగా వున్నాయి. ఒక సిగరెట్ పీక జాగ్రత్తగా తీసి చూశాను. 'స్టేట్ ఎక్స్ప్రెస్ 555'.

"కొన్ని ఇబ్బందులవలన పోయిన నెలనుండి, పనిమనిషిని, వంట మనిషిని మాన్పించాల్సి వచ్చింది. అంతా అస్తవ్యస్తంగా వుందను కొంటాను" అన్నది సుజాత సిగ్గుపడుతున్నట్లు.

నేను లోలోపలే నవ్వుకొన్నాను. ఆర్థిక ఇబ్బందివల్ల సుబ్బారావు నౌకర్ల నందరినీ తొలగించాడని నాకు తెలుసు.

సుబ్బారావు అదృశ్యమయ్యాడని తెలిస్తే బహుశా ఈ ఇల్లు కూడా వేలానికి రావచ్చు.

ప్రతి సొరుగు, ప్రతి పుస్తకం, ప్రతిఫైలు, చిత్తుకాగితాలతో సహా అతి జాగ్రత్తగా వెతికాను. సుబ్బారావు పర్సనల్ విషయాలగురించి ఏరకమైన ఇన్ఫర్మేషన్ దొరికినా చాలనే వుద్దేశ్యంతో. అన్ని ఆఫీసు కాగితాలు, షేర్ ట్రాన్స్ఫర్ ఫారమ్స్, అకౌంట్ పుస్తకాలు, షేర్ మార్కెట్ ధరల వివరాల కాగితాలు, ఎవరో దూరంలో వున్న ఒకరిద్దరు స్నేహితులు వ్రాసిన వుత్తరాలు తప్ప మరేమీ లేవు.

రెండుగంటలు వృధాప్రయాస తర్వాత వట్టి చేతులతో బయటపడ్డాను.

సుజాత పొగలుకక్కే కాఫీతో ప్రత్యక్షమయింది.

“ఏమైనా దొరికాయా?” అంది కప్పు అందిస్తూ.

“నో లక్! అండ్ థాంక్యూ” అన్నాను కాఫీ అందుకొంటూ.

## 7

మార్చి ఎనిమిదవ తారీఖు! ఇప్పటికి సుబ్బారావు అదృశ్యమయి ఎనిమిది రోజులు కావొస్తోంది. ఎంత ప్రయత్నం చేసినా సుబ్బారావు జాడ ఏమీ తెలియలేదు.

సిన్హాగారు ఇన్స్పెక్టర్ కృష్ణమోహన్ సహాయంకూడా తీసుకున్నారు. మరో నాల్రోజులు చూసి పేపర్లలో ప్రకటించమని సుజాతకు సలహా ఇచ్చారు. సుజాత చాలా నీరసించినట్లు కనిపిస్తోంది.

అసలు సుబ్బారావు ఏమయ్యాడు? ఎందుకు ఎవరికీ కనిపించకుండా వెళ్ళిపోవలసివచ్చింది. అతన్ని చంపుతామని బెదిరింపు వుత్తరాలు వ్రాసినవాళ్ళు అతన్ని ఎత్తుకుపోయారా?

ఇన్స్పెక్టర్ కృష్ణమోహన్ మార్చురీలోకి వచ్చిన ప్రతి

శవాన్ని ఓ కంట కనిపెడుతోనే వున్నాడు. సుబ్బారావు అదృశ్యం పెద్ద మిస్టరీక్రింద తయారయింది.

బల్లమీది టెలిఫోన్ వుదయం ఏడుగంటలకే మ్రోగడం కొద్దిగా ఆశ్చర్యమనిపించింది. అవతల కృష్ణమోహన్ కంఠం వినిపించింది.

"గుడ్ మార్నింగ్ మోహన్" అన్నాడు ఆవులిస్తూ.

"నో, బాడ్ మార్నింగ్. ప్రొద్దున్నే శవం తయారయింది. లీలా చౌదరీ పార్కు నార్త్ గేటువైపు. శవం చారలసూటు, నలుపు నెక్ టైలో వుంది. మీ తాలూకు కాండేట్ ఏమోనని అనుమానం" అన్నాడు కృష్ణమోహన్.

నేను చటుక్కున బెడ్ మీదనుండి లేచి నిలబడ్డాను. "ఉయ్ విల్ బి దేర్ ఇన్ టెన్ మినిట్స్" అన్నాను ఫోన్ పెట్టేసి సిన్హాగారి గదివైపు పరిగెడుతూ.

సిన్హాగారు, నేను లీలా చౌదరీ పార్కు నార్త్ గేటు చేరుకొనేప్పటికి ఇన్ స్పెక్టర్ కృష్ణమోహన్ సపరివారంగా అప్పటికే తమ పనుల్ని చకచకా చేసుకుపోతున్నారు.

కృష్ణమోహన్ మమ్మల్ని శవం పడున్నచోటుకు తీసుకెళ్ళాడు.

పార్కులోపల గోడప్రక్కగా వున్న నీళ్ళకుండీలో మడమలోతు నీళ్ళల్లో శవం వెల్లకిలా కనిపిస్తోంది. పోలీస్ సర్జన్ గోవిందన్ నాయర్ శవాన్ని చూస్తున్నాడు.

సగంవరకూ నీళ్ళలో తడిసిన నల్లచారలున్న తెల్లసూటు కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. లోపలిభాగాలు రక్తంతో కలిసి కనిపిస్తోన్నాయ్. గాయంచుట్టూ నల్లగా కాలిపోయివుంది. కోటు భుజంమీద, కుడిచెంపమీద రక్తం గడ్డకట్టివుంది. కుండీలో నీళ్ళలో కొద్దిగా తల ప్రాంతంలో రక్తం వున్నట్లు

కనిపిస్తోంది.

"ఎక్కడో చంపి శవాన్ని ఇక్కడ పారేసి వుండాలి" అన్నాడు కృష్ణమోహన్.

అవునన్నట్లు తలాడించాను. కాని నీళ్ళకుండీలోనే ఎందుకు పారేశారు? నార్త్ గేటు దగ్గరనుండి కుండీకి చాలా దూరంవుంది. ఇంతదూరం తీసుకొచ్చి పారేయాల్సిన అవుసరం ఏముంది? హంతకుడు ఇంత రిస్క్ ఎందుకు తీసుకొన్నాడు? అసలు హంతకు డెవరు?

శవాన్ని ఫోటోలు తియ్యడం అవగానే శవాన్ని గట్టు మీదకు లాగారు. డాక్టర్ నాయర్ శవాన్ని కాసేపు పరీక్షించి లేచి నిలబడ్డాడు.

"హత్య జరిగి ఆరేడు గంటలకన్నా ఎక్కువ అయి వుండదు. అంటే ఎప్రాక్సిమెట్ గా మరణం రాత్రి ఒంటిగంట తరువాత సంభవించి వుండాలి. రిగర్ మార్టిస్ అయి నాలుగయిదు గంటలకన్నా ఎక్కువ అయివుండదు. ఖచ్చితంగా పోస్ట్ మార్టమ్ అయితేగాని చెప్పలేను" అన్నాడు భుజాలు చరుచుకొంటూ.

డిటెక్టివ్ సిన్హా 'మిరాకో' కాలుస్తూ తాపీగా వింటూ నిలబడ్డారు.

నేను మోకాళ్ళమీద కూర్చొని కోటుజేబులు తడిమాను. ఒకజేబులో తడిసిపోయిన 'డన్ హిల్ సిగరెట్ పెట్టె' అగ్గిపెట్టె కనిపించాయి. మరో జేబులో ఫౌంటెన్ పెన్, వంద రూపాయలనోటూ, కొన్ని చిల్లరనోట్లూ వున్నాయి.

నేను చూస్తున్నదిమాత్రం కనిపించలేదు. సుబ్బారావు 'బిజినెస్ డైరీ' ఎప్పుడూ అతని జేబులోనే వుంటుందని చెప్పింది సుజాత. మళ్ళీ ఓసారి కోటుజేబులో, ప్యాంట్ జేబులో తడిమిచూశాను. ఏమీలేవు. లేచి నిలబడ్డాను.

సిన్హా గారు బండీలో ఓమూల తదేకంగా చూస్తున్నారు. "కృష్ణమోహన్ భాయ్! అదేమిటో గమనించావా?" అడిగారు.

కృష్ణమోహన్ అంచమ్మట జాగ్రత్తగా వంగి ఆ వస్తువును బయటకి తీశారు. అందరూ అదే ఆశ్చర్యంగా చూశారు. వెస్ట్ అండ్ స్మిత్ .32 కాలిబర్ రివాల్వర్ అది. సుబ్బారావు మరణానికి కారణం అదేనని వేరే చెప్పనవసరం లేదనుకొంటాను. కృష్ణమోహన్ బయటికి తీయగానే బారెల్ లోనుండి, చాంబర్ నుండి నీళ్ళు కారాయి.

"బహుశా వేలిముద్రలేమీ దొరక్కపోవచ్చు. వెంటనే దాన్ని లాబ్ కు పంపించు" అన్నారు సిన్హాగారు.

శవాన్ని మార్చురీకి పంపించి అందరూ బయలుదేరగానే మేమూ కారుదగ్గరికి నడిచాము. కృష్ణమోహన్ మా వెనకే కారుదగ్గరికి వచ్చాడు.

"సుబ్బారావును ఎవరు చంపి వుంటారు?" అన్నాడు సిగరెట్ వెలిగిస్తూ.

"కృష్ణమోహన్ భాయ్! హంతకుడు ఇంతకాలం బయట పడకుండా సుబ్బారావును దాచిపెట్టాడు. ఎందుకో మనకు తెలియదు. కాని రాత్రి అతన్ని హత్యచేశాడు. ఒక హత్య జరిగిందంటే దానికి మోటివ్ వుందన్నమాట. మోటివ్ తో హత్య జరిగిందంటే అది ఎంత రహస్యమైనా తెలిసితీరుతుంది. హంతకులు ఎంత తెలివిగా హత్యచేసినా ఎక్కడో ఓచోట పొరపాటు చేస్తుంటారు. అదే వాళ్ళను పట్టేస్తుంది" అన్నారు సిన్హాగారు గంభీరంగా.

కృష్ణమోహన్ ఆయనవంక ఆశ్చర్యంగా చూశాడు.

"అవును! సుబ్బారావు హంతకుడెవరో మనకు తెలియక పోవచ్చు. కాని కొన్ని అనుమానాలు మనలో కలగకుండా

హత్య చెయ్యలేకపోయాడు. ఉదాహరణకు సుబ్బారావు కోటుజేబులోవున్న డన్‌హిల్ సిగరెట్ ప్యాకెట్. సుబ్బారావు బ్రాండ్ సిగరెట్లు 555. సుబ్బారావు మాయమైన రోజు అతని జేబులో డన్‌హిల్ సిగరెట్లు వున్నాయి. ఈ ఎనిమిది రోజులూ సుబ్బారావు ఆ సిగరెట్లు కాల్చాడా? లేక సుబ్బారావుకు 555 సిగరెట్లు దొరకలేదా? మరొక విషయం. సుబ్బారావు శవాన్ని నీళ్ళలో ఎందుకు పారేయాల్సివచ్చింది? సుబ్బారావు జేబులో వుండాల్సిన ఒక డైరీ ఏమయింది? మనకు దొరికిన రివాల్వర్ ఎవరిది? వీటన్నిటికీ హత్యతో సంబంధంలేదని నేను అనుకోను. సమర్థుడైన డిటెక్టివ్‌కు ఆ ఆధారాలు చాలు. లెటజ్ మూవ్'' అన్నారు కార్లో ఎక్కి కూర్చుంటూ.

''అయితే మార్చురీకివచ్చి శవాన్ని గుర్తుపట్టమని సుజాతకు కబురు చెయ్యనా?'' అడిగాడు కృష్ణమోహన్.

''ష్యూర్. యూ డు ఇట్. డాక్టర్ గోవిందన్‌ను వీలయినంత త్వరగా, జాగ్రత్తగా పోస్ట్‌మార్టమ్ చెయ్యమను. శవం నీటిలో ఎందుకు పారేశారో ఇప్పటికీ అర్ధంకావడం లేదు'' అన్నారు సిన్హాగారు.

కృష్ణమోహన్ తలవూపి పోలీస్ జీపు ఎక్కాడు.

# 8

డాక్టర్ గోవిందన్ నాయర్ పోస్ట్‌మార్టమ్ రిపోర్ట్ కష్టంగా ఏ పాయింటూ వదలకుండావుంది. నేనూ, సిన్హాగారు, కృష్ణమోహన్ మూడు టైప్‌డ్ కాపీలను చదివి కాసేపు అలోచిస్తూ వుండిపోయాము.

రాత్రి ఒంటిగంటకు మరణం సంభవించి వుండాలని తేల్చాడు గోవిందన్ నాయర్. కణతలోనుండి 'సెరిబ్రల్ మెంబరన్స్' లోకి హైవెలాసిటీ రివాల్వర్ గుండు దూసు

కళ్ళడం వలన, బ్రెయిన్ టిష్యూ నజ్జయి వెంటనే మరణం సంభవించి వుండాలి. కణతకు ఆనించి రివాల్వర్ కాల్చినట్లు గాయంచుట్టూ నల్లగా కాలిన చర్మంవల్ల తెలుస్తోంది. చితికిన మెదడుతప్ప మిగతా శరీర భాగాలన్నీ ఆరోగ్యంగా వున్నాయి.

కాని ఊపిరితిత్తులలోనూ, కడుపులోపల జీర్ణకోశంలోనూ చెమ్మ కనిపిస్తోంది. ఇలా 'విస్కెరా'లో చెమ్మ కనిపించడం అసాధారణంగా వుందని డాక్టర్ నాయర్ వ్రాశాడు.

శరీరంలో భాగాలు సరిగా పనిచేయకపోవడంవలన అప్పుడప్పుడూ ఊపిరితిత్తులలో ఇలా చెమ్మ కనిపించే అవకాశం వుంటుందని, కాని సుబ్బారావు శరీరం చాలా ఆరోగ్యకరంగా ఉందని, ఈ చెమ్మకు కారణం అర్థంకావడంలేదని 'విస్కెరా'లో బయలాజికల్ ఫ్లూయిడ్స్‌కు చెందని చెమ్మ ఉండడం ఆశ్చర్యకరంగా వుందని పేర్కొన్నాడు.

సిన్హాగారు 'మొరాకో' వెలిగించి డాక్టర్ వైపు దీర్ఘంగా చూశారు. "నాయర్ భాయ్! శవం నీళ్ళలో తడవడం వలన 'విస్కెరా'లో చెమ్మఏర్పడే అవకాశం వుందంటావా?" అన్నారు రైలింజన్లా పొగవదుల్తూ.

"నో, నాట్ పాసిబుల్. మండీలో మురికినీళ్ళు శవంలోపలికి వెళ్ళడం అసంభవం. ఒకవేళ వెళ్ళినా వాటిని తేలిగ్గా విడదీయవచ్చు. కాని సుబ్బారావు ఊపిరితిత్తులలో జీర్ణకోశంలో చెమ్మ ఎలావచ్చిందో అర్థంకావడంలేదు. రిపోర్ట్ వ్రాసేముందు నేను చాలా బుక్స్ రిఫర్ చేశాను. నోన్ కేసెస్‌లోగాని, హైపోథెటికల్‌గాగాని ఏరకమైన సంజాయిషీ ఉన్నట్లు కనిపించలేదు."

అన్నాడు డాక్టర్ నాయర్ నుదుటిమీద చెమటతుడుచు

కొంటూ.

సిన్హాగారు తలవూపి ఇన్ స్పెక్టర్ కృష్ణమోహన్ వైపు తిరిగారు. "సుజాత శవాన్ని చూసిందా?" అడిగారు.

కృష్ణమోహన్ తలవూపాడు. "వెరీ హోల్ ఉమెన్! శవాన్ని బ్లాంక్ గా చూసి గుర్తుపట్టింది. మార్చురీలోనుండి బయటకు రాగానే ఫెయింట్ అయి పడిపోయింది. ముఖం మీద నీళ్ళుచల్లి కాసేపు స్మెల్లింగ్ సాల్ట్ వాసన చూపెడితే గాని స్పృహరాలేదు."

"యస్! క్వయిట్ షాక్!" అన్నారు సిన్హాగారు.

నేనుమాత్రం ఆలోచిస్తూనే వున్నాను. సుజాతమీద ఆ క్షణం జాలేసినా, సుబ్బారావు మరణంలో మిస్టరీ నా మనసులో ఇంకా వేధిస్తూనేవుంది.

"సుబ్బారావు మార్చి ఒకటిన అదృశ్యమైనరోజు అతని దగ్గర డన్ హిల్ సిగరెట్లువున్నాయి. అవి ఇంకా అతని జేబులోనే వుండడం ఆశ్చర్యంగావుంది. అతన్నెవరన్నా ఇంతకాలం బందీగా వుంచినా, అగ్గిపెట్టెకూడా ఉన్నప్పుడు సిగరెట్ లు ఎందుకు కాల్చుకోలేదు?" అన్నాను నాలో నేనే అనుకొంటున్నట్లు.

"బహుశా కాళ్ళు చేతులు కట్టేశారేమో" అన్నాడు కృష్ణమోహన్.

"అలా అయితే ఈ ఎనిమిది రోజులూ అన్నం నీళ్లు లేకుండా వున్నాడంటారా?"

అన్నాను అర్గ్యుమెటేంవ్ గా. సిన్హాగారు డాక్టర్ నాయర్ వైపు చూశారు.

"ఇంపాసిబుల్! సుబ్బారావు జీర్ణకోశంలో వున్న పదార్థాలు పూర్తిగా జీర్ణమయిలేవు. చనిపోయే సమయానికి అతను అన్నంతిని ఎక్కువ సమయం కాలేదని తెలుస్తోంది. పైగా

ఎనిమిది రోజులు అన్నంలేకుండా వున్న మనిషి జీర్ణకోశంలో లోపలవున్న రకరకాల జీర్ణగ్రంథులు ఉత్పత్తి చేసేరసాలు ఎక్కువ మొత్తాల్లో చేరివుంటాయి. సుబ్బారావు విషయంలో అలాంటిదేమీలేదు. ఒకరకంగా చెప్పాలంటే అతనుభోజనం చేసి చనిపోయేప్పటికి గంటకూడా అయివుండదు'' అన్నాడు డాక్టర్ నాయర్.

''నెక్స్ట్... సుబ్బారావు శవాన్ని నీళ్ళకుండీలో పారే యడం. ఎందుకని నీళ్ళకుండీలో వేశారు?'' అన్నాను అందరి వంకా చూస్తూ.

సిన్హాగారు చటుక్కున ముందుకువంగారు_ ''డామిట్! ఒక విషయం ఎవరూ గుర్తించలేదు. శవంవున్న నీళ్ళ కుండీలో మడమల లోతుకన్నా ఎక్కువ నీళ్లులేవు'' అన్నారు నోట్లోంచి చురూట్ బయటికితీసి.

''అయితే ఏమిటి?'' అన్నాడు కృష్ణమోహన్ ఆశ్చ ర్యంగా.

అప్పుడు తట్టింది నాకు సిన్హాగారి పాయింట్. ''అవును. కాని సుబ్బారావు శరీరం అంతా నీళ్ళలో తడిసినట్లువుంది. శవాన్ని వెల్లకిలా మడమలలోతు నీళ్లు, అంటే దాదాపు రెండంగుళాలువున్న నీటిలో పడుకోబెడితే శవం తల వెనుక భాగం, వీపు, చేతుల క్రిందిభాగం, కాళ్ళకున్న బూట్లు సగంవరకు, శరీరం క్రిందిభాగం అంతా తడుస్తుంది. శవం పైభాగం అంతా పొడిగా వుండాలి. కాని సుబ్బారావు శవం, వేసుకొన్న సూటుతోసహా అంతా తడిసినట్లువుంది'' అన్నాను.

''దానిదేముంది ముందు వెల్లకిలా పడేసి తరువాత వెనక్కి త్రిప్పివుండొచ్చుగా'' అన్నాడు కృష్ణమోహన్.

డాక్టర్ నాయర్ మావంక ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

సిన్హాగారు నావైపు ఎంకరేజింగ్‌గా నవ్వారు.

"అలా అయితే సూటంతా బురద అయివుండేది. కాని సుబ్బారావు వేసుకొన్న సూటు అక్కడక్కడా దుమ్ము మరకలు తప్పితే ఎక్కడా బురద లేదు. కాని వళ్ళంతా చాలాసేపు నీళ్ళలో నానినట్టువుంది. ఎందుచేత?" అన్నాను సిన్హాగారివైపు చూస్తూ.

"దటీజిట్! అంటే సుబ్బారావును తీసుకొచ్చి కుండీలో పడేయకమునుపే అతను పూర్తిగా తడిసివుండాలి. నీళ్ళలో పడేయడంవలన అతను ఆ నీళ్ళలో తడిశాడని అనుకోవడానికి శవాన్ని నీళ్ళకుండీలో పడేశారు" అన్నారు సిన్హా చుట్టను పళ్ళమధ్య బిగించి.

కృష్ణమోహన్ అర్థంకానట్లు సిన్హాగారివైపు చూశాడు. "కాని శవం నీళ్ళలో పడేయడం వలన తడిసింది అని మనం అనుకోనేట్లు తప్పుదారి పట్టించడంలో హంతకుల ఉద్దేశ్యమేమైయ్యుంటుంది?" అసలీ వ్యవహారం అంతా పిచ్చివాగుడు అన్నట్లున్నాడు కృష్ణమోహన్.

సిన్హాగారి ముఖంలో కండరాలు బిగుసుకున్నాయి. "కృష్ణమోహన్ భాయ్! హంతకుడు చాలా తెలివిగా ఈ హత్య చేశాడు. శవం తడిసివుండడంవలన ఏదో మనకు తెలుస్తుందనే వుద్దేశ్యంతోనే హంతకుడు మనల్ని తప్పుదారి పట్టించే ప్రయత్నం చేశాడు. ఎందుకు అనేదే పరిశోధకుడు సాల్వ్ చెయ్యాల్సిన సమస్య. శవం కారణం లేకుండా తడిసివుంటే ఏదో విషయం ఇన్వెస్టిగేటర్‌కు తెలుస్తుందనే శవాన్ని నీళ్ళకుండీలో పడేశాడు. కాని కుండీలో సరిగ్గా నీళ్ళు లేకపోవడంవలన మనకా విషయం తెలిసింది."

సిన్హాగారి మాటల్లో కొంత రీజన్ వున్నట్లు తలవూపాడు కృష్ణమోహన్.

నేనూ సిన్హాగారితోపాటు లేచి బయటకు వెళ్ళడానికి ఉద్యుక్తుడనయ్యాను.

"అయితే నెక్స్ట్ చెయ్యవలసిందేమిటి?" అన్నాడు కృష్ణ మోహన్ ఏంచెయ్యాలో తోచనివాడిలా.

సిన్హాగారు అతనివైపు సూటిగా చూశారు. "ఇన్ స్పెక్టర్! ఇప్పుడు మన చేతిలో వున్నది కేవలం సుబ్బారావును వెతికే పనికాదు. అయస్కాంతం దగ్గరకిచేరే ఇనపముక్కలా అతనిశవం మనదగ్గరకు చేరింది. ఇది హత్యకేసు. సుబ్బారావు మరణంవలన ఎవరికి లాభిస్తుందో మనం తెలుసుకోవాలి. నిజమైన హంతకుడెవరో తేలేవరకూ అతనితో సంబంధమున్న ప్రతీవాళ్ళు అనుమానితులే. సుబ్బారావు లీగల్ అడ్వయిజర్ ఎవరో కనుక్కొన్నావా?"

"కనుక్కొన్నాను. విమలారావు. అడ్రసు మీకు తెలుసనుకుంటాను" అన్నాడు కృష్ణమోహన్.

సిన్హాగారు తలవూపి బయటకు నడిచారు. నేనూ ఆయన వెనకాలే బయలుదేరాను. వరెండాలోకి రాగానే కృష్ణ మోహన్ మమ్మల్ని వెనక్కి పిలిచాడు. సిన్హాగారు అతన్ని ప్రశ్నార్థకంగా చూశారు.

"మీరు సుజాతను కలుసుకోబోతున్నారా?" అడిగాడు.

"యస్! విమలారావును కలుసుకొన్నతరువాత సుజాత దగ్గరకు వెళతాను. పాపం ఆ అమ్మాయి దుఃఖంలోవుంది" ఒకోసారి సిన్హాగార్ని చూస్తే నాకే ఆశ్చర్యంవేస్తుంది.

"సుబ్బారావు వస్తువులు కొన్ని మా దగ్గర వున్నాయి. దయచేసి ఆమెకు అందజేస్తారా?" అడిగాడు కృష్ణమోహన్.

సిన్హాగారు సరేనన్నట్లు తలవూపారు.

"అతని సూటుమాత్రం దానిమీది రక్తంమరకలు ఎనాలిసిస్ కోసం లాబ్ కి వెళ్ళింది. ఈ వాచ్, మనీ, ఫౌంటెన్ పెన్,

కీబంచ్ ఆవిడకు ఇవ్వండి" అన్నాడు అవన్నీ తీసి టేబిల్ మీద పెడుతూ.

నేను ఒక్కొక్కటి తీసి జేబులో వేసుకోసాగాను. వందరూపాయలనోటు, కొన్ని చిల్లరనోట్లు, తాళాలగుత్తి చాలారకాల తాళాలు వున్నాయి. రోలెక్స్ '62 మోడల్ చేతి గడియారం–స్టెయిన్ లెస్ స్టీల్ చెన్ తో తళతళ మెరుస్తోంది. ఎవరో దారినపోయే దొంగ ఈ హత్య చెయ్యలేదు. వస్తువులన్నీ ఒక్కొక్కటే చూస్తూ జేబులో వేసుకొన్నాను.

సిన్హాగారు కృష్ణమోహన్ కు తలవూపి కారెక్కి కూర్చున్నారు. నేను లోపల కూర్చొని ఇంజన్ స్టార్ట్ చేసి, గేర్ మీద చెయ్యివేశాను. చటుక్కుని ఏదో గుర్తొచ్చి ఇంజన్ ఆఫ్ చేశాను.

జేబులో చెయ్యిపెట్టి సుబ్బారావు రోలెక్స్ ఆటోమాటిక్ వాచీని బయటికి తీశాను.

"వాటీజిట్ బోయ్?" అన్నారు సిన్హాగారు నా చేతిలో సుబ్బారావు వాచీవంక చూస్తూ.

రోలెక్స్ '62 మోడల్ ఆటోమాటిక్, విత్ డేట్ ఇండికేటర్ చేతిగడియారం, నల్లని ప్లాటినమ్ కోటెడ్ డయల్ మీద కొట్టిచ్చినట్లు కనిపిస్తున్నాయి.

నేను నమ్మలేనట్లు గడియారం డేట్ ఇండికేటర్ వైపు చూస్తూ వుండిపోయాను. అది రెండవ తేదీని చూపెడుతోంది. కేసు స్వరూపం చాలావరకు బోధపడిపోయిందినాకు. దానిని సిన్హాగారికి అందించాను ఉత్సాహంగా.

# 9

నౌఖరు వెళ్ళి మేము కలుసుకోవాలని వచ్చామని చెప్పగానే విమలారావు తానే స్వయంగావచ్చి సాదరంగా మమ్మల్ని లోపలకు ఆహ్వానించాడు.

విమలారావు నగరంలో పేరుపొందిన సివిల్ లాయరు. కార్పొరేషన్ ఎక్స్ ఆఫీషియో మెంబరు. పార్టీ పాటుగా కానిమనిషి. ఎర్రని ఎరుపు, నడినెత్తిన బట్టతల కొబ్బరి బొండాలా మెరుస్తోంటుంది. విశాలమైన నుదురు, తెలివైన కళ్లు, చిన్న సైజు బొజ్జ విమలారావును చూడగానే మనకు కనిపించే చిహ్నాలు ఇవి.

"యస్! వాట్ కెన్ ఐ డు ఫర్ యు. ఊరక రారు మహాత్ములు" అన్నాడు విమలారావు మేము కూర్చోగానే.

"సుబ్బారావు హత్య గురించి నీకు తెలిసేవుంటుంది" అన్నారు సిన్హా.

"ఓ యస్. హి యీజ్ మై క్లైంట్!" అన్నాడు విమలారావు.

"అతని బిజినెస్ వ్యవహారాలే కాకుండా, స్వంత విషయాలు కూడా నువ్వే చూసేవాడివా?"

"యస్. నాచురల్లీ."

"సుబ్బారావు మరణానికి ముందు వీలునామా ఏమన్నా వ్రాశాడా?"

"లేదు. వ్రాయలేదు."

"అంటే అతను మరణిస్తే అతని ఆస్తిపాస్తులు ఎవరికి చెందుతాయి?"

"ఆయన భార్యకి. అంటే సుజాతకి. కాని సిన్హాజీ సుబ్బారావుకి ఆస్తి ఏమీ లేదని చెప్పాలి. ఉన్న ఆస్తంతా 'షేర్ మార్కెట్ స్పెక్యులేషన్'లో పోయింది. అతని ఆస్తి అమ్మకమంతా నా పర్యవేక్షణలోనే జరిగింది. ఈ ఊళ్ళోవున్న ఇల్లుకూడా నెలరోజుల క్రితం తాకట్టు పెట్టాడు" అన్నాడు విమలారావు.

"అయితే సుబ్బారావు చనిపోవడం వలన సుజాతకు చిల్లి

గవ్వకూడా రాదన్నమాట."

"యస్. దటీజ్ రైట్! అతని చావువలన ఆర్థికంగా ఎవరికీ లాభంవుండదు."

నేను విమలారావువంక ఆశ్చర్యంగా చూశాను. "అంటే అప్పులవాళ్లు డబ్బుకోసం ఇల్లు వేలంవేస్తే సుజాతకు నిలువ నీడకూడా వుండదంటారు. హౌ స్ట్రేంజ్. సుజాతకు పెర్సనల్‌గా బ్యాంక్ అకౌంట్ వుందా?" అడిగాను.

"నో. అలాంటిదేం లేదు."

సిన్హాగారు ఒక్కక్షణం దీర్ఘంగా ఆలోచిస్తూ వుండిపోయారు. "సుబ్బారావు లైఫ్ ఇన్‌ష్యూర్ ఏమైనా చేశాడా?"

ఒక్కక్షణం విమలారావు ముఖంలో ఏదో గుర్తొచ్చినట్లు మెరిసింది. "చేశాడు. యు ఆర్ రైట్. యాభైవేలకి పాలసీ తీసుకొన్నాడు."

మేము విమలారావుకు థాంక్స్ చెప్పి తిన్నగా కృష్ణమోహన్ దగ్గరకి వెళ్ళాము. లాయరు విమలారావు చెప్పిన విషయాలు, వాచ్ విషయంకూడా నేను చెప్పగానే కృష్ణమోహన్ లేచి నిలబడ్డాడు.

"హత్యజరిగిన రోజు, అంటే రాత్రి సుజాతకు ఎలిబీ వుందో, లేదో తెలుసుకోవాలి. సుబ్బారావును హత్య చేయడానికి ఆమెకే ఎక్కువ అవకాశం వుంది" అన్నాడు కృష్ణమోహన్.

సిన్హాగారు అతనివైపు నవ్వుతూ చూశారు. "సుజాతే ఈ హత్య చేసుంటే, మన సిద్ధాంతం ప్రకారం రాత్రి సుజాతకు నిర్భేధ్యమైన ఎలిబీ వుంటుంది."

కృష్ణమోహన్ చికాగ్గా సిన్హాగారివైపు చూశాడు. "చూద్దాం!" అన్నాడు.

"ఒకటవ తారీఖు రాత్రికూడా సుజాతకు ఎలిబీ వుందో, లేదో కనుక్కో. కాని సుజాత ఈ హత్య చేసిందని నే ననుకోను. ఎందుకంటే ఒకటవ తారీఖునుండి ఈరోజు వరకూ శవాన్ని చెడకుండా వుంచిన పదతేమిటి? ఒకవేళ అలాంటి పదతివున్నా సుజాతలాంటి ఆర్డినరీ హౌస్ వైఫ్ కు అలాంటి విషయాలు తెలుస్తాయని నేననుకోను" అన్నాను నేను.

"ఉయ్ విల్ ఫైండవుట్" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కృష్ణమోహన్.

# 10

సుజాతకు రాత్రి అనుకొన్నట్లుగానే చాలా పటిష్టమైన ఎలిబీ వున్నట్లు తెలిసింది. రాత్రంతా సుజాత ఒంటరిగా ఇంట్లో వుండలేక నాలుగురోజులబట్టి స్నేహితుల ఇంట్లో వుంటున్నట్లు తెలిసింది. సుజాత రాత్రంతా వాళ్ళఇంట్లోనే వున్నట్లు చిన్నపిల్లలతోసహా వాళ్ళు సాక్ష్యం ఇచ్చారట. అయితే 1వ తేదిరాత్రి మాత్రం సుజాత భర్తకోసం ఇంట్లోనే వున్నట్లుకాని, బయట ఎక్కడన్నా వున్నట్లుగాని విరుదంగా సాక్ష్యం ఏమీ లేదు.

"ఐ డోంట్ బిలీవ్!" అన్నాను అడ్డంగా తలవూపుతూ.

"ఏమిటది?" అడిగాడు కృష్ణమోహన్.

"సుజాత హత్యచేసిందంటే నేను నమ్మలేను. యాభై వేల రూపాయలకు సుజాత భర్తను చంపుతుందంటారా?"

"సంభవమే! సుబ్బారావు దివాళా తీశాడు. అప్పుల వాళ్ళు రేపో, ఎల్లుండో వున్న ఆసినంతా ఎగరేసుకు పోతారు. అలాంటి పరిసితుల్లో సుజాత ఏంచేస్తుంది. పైగా సుబ్బారావుకు, సుజాతకు మధ్య అనుబంధం మనం అను కున్నంత అన్యోన్యంగా లేకపోవచ్చు. సుబ్బారావు అనా

కారి. సుజాత చాలా అందమైన మనిషి. డబ్బు గాని తప్ప సుబ్బారావులాంటి అనాకారిని ఎవరు చేసుకొంటారు? ఆ డబ్బే లేనప్పుడు సుబ్బారావు పురుగుతో సమానం కావడంలో ఆశ్చర్యం లేదుగదా?'' అన్నాడు కృష్ణమోహన్.

సిన్హాగారు అవునన్నట్లు తలాడించారు. ''మరోవిషయం మనం మరచిపోతున్నాం. సుబ్బారావు ఒకటవ తేదీన ఆఫీసు నుండి బయలుదేరినప్పుడు తను ఇంటికొస్తున్నాననీ, తనకోసం కాచుకొని వుండమనీ, ఏదో విషయం మాట్లాడాలనీ ఫోన్ చేశాడు. అంటే సుబ్బారావు ఆఫీసునుండి ఇంటికే బయలు దేరాడన్నమాట. రైల్వేస్టేషన్‌లో మిస్ జూలీకి ఉత్తరం పోస్ట్ చేసింతరువాత తిన్నగా నడిచి ఇంటికెళ్ళిపోయాడేమో. అంచేతే రైల్వేస్టేషన్ నుండి బయటికొచ్చింతరువాత అతన్నెవరూ స్పెసిఫిక్‌గా గుర్తుపెట్టుకొనివుండరు. అతని జీర్ణకోశంలో జీర్ణంకాని ఆహారంకూడా ఈ విషయం పాసిబిలిటీని చూపిస్తోంది. ఇంటికెళ్ళి భోంచేసింతరువాత ఒకటో తారీఖున సుజాత అతన్ని కాల్చి చంపివుండొచ్చు. ఆ తర్వాత శవాన్ని చెడకుండా దాచేసి, నీళ్ళకుండీలో పారేసి వుండొచ్చు. అందుకే శవానికున్న ఆటోమేటిక్ వాచ్ రెండో తేదీనాడు ఆగిపోయి, తిరిగి 8వ తేదీన పనిచేయటం ప్రారంభించింది. ఆటోమేటిక్ వాచ్ పనిచెయ్యాలంటే కనీసం 12 గంటలకోసారి చేతికదలిక వుండాలని మీ అందరకూ తెల్సునుకుంటాను'' అన్నాడు సిన్హాగారు.

మేమిద్దరం సిన్హాగారివైపు చూస్తూ వుండిపోయాము. ఆయనే మళ్ళీ, ''మోహన్ భాయ్! నీళ్ళకుండీలో మనకు దొరికిన రివాల్వర్ విషయం ఏంతేలింది?'' అన్నారు కళ్ళుమూసుకొని 'మురాతో' పొగ వదుల్తూ.

కృష్ణమోహన్ చటుక్కున డ్రాయర్ తెరచి ఓ ఫైలు

బయటికి తీశాడు. "ఆ విషయమే మీకు చెప్పడం మరచిపోయాను. ఆ రివాల్వర్ సుబ్బారావుదే. లైసెన్సింగ్ డిపార్ట్‌మెంట్‌తో రిఫర్ చేశాను. నాలుగేళ్ళ క్రితం కొన్నాడు సుబ్బారావు ఆ రివాల్వర్‌ని. మరణం దానిలో నుండి పేల్చిన గుండువల్ల సంభవించినదని ఫైర్ ఆర్మ్స్ ఎక్స్‌పర్ట్ వ్రాశాడు" అన్నాడు చకచకా రిపోర్ట్ చదువుతూ.

"యాస్! దట్ ఫిట్స్! అంటే రివాల్వర్ సంపాదించడం సుజాతకు సమస్యకాదు" అన్నారు సిన్హాగారు కళ్ళుమూసుకొంటూ.

"కాని మీరన్నట్లు ఒకటవ తారీఖు రాత్రి భోజనం చెయ్యగానే సుబ్బారావు చనిపోయుంటే ఇంతకాలం శవం చెడిపోకుండా ఎలావుంది? ఒకవేళ సుజాత హత్యచేసినా, రాత్రి శవాన్ని పార్కులో పారేసింది సుజాతే కావడం అసంభవం. సుజాతకు మరోవ్యక్తి సహాయం చేసుండాలి. ఆ వ్యక్తి ఎవరు?"

అన్నాను సిన్హాగారివంక చూస్తూ. వారిరువురూ సుజాతను అనుమానించడం నాకు నచ్చలేదు.

"అవును! ఎవరో వుండివుండాలి. సుజాతకు మరెవరితోనో సంబంధం వుందేమో! సుబ్బారావు దంపతుల్ని చూస్తే ఆ పాసబిలిటీ వుందనిపిస్తోంది. భర్తను చంపే ధైర్యం, తెగువ, అసహ్యం, ఆడదానికి మరో మగాడితో సంబంధంవుంటే గాని రావు. ఒకవేళ సుజాతకు మరోవ్యక్తితో సంబంధం ఉందనుకొందాం. అలాంటప్పుడు సుజాతకు రెండురకాలుగా సుబ్బారావు మరణంవలన లాభిస్తుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కృష్ణమోహన్.

సిన్హాగారు చటుక్కున కళ్ళు తెరిచారు. "కృష్ణమోహన్

భాయ్! హంతకులు డా॥ నాయర్‌ను చాలా తెలివిగా మోస గించారు'' అన్నాడు ఉత్సాహంగా. ఆయనకళ్లు జ్యోతుల్లా మెరుస్తోన్నాయ్.

మేమిద్దరం ఆయనవైపు ఆశ్చర్యంగా చూశాము.

''శ్యామ్! సుజాత దగ్గరికి వెళ్ళినప్పుడు నీవు ఇంట్లో రిఫ్రిజిరేటర్ గాని చూశావా?'' అడిగారు సిన్హాగారు గంభీరంగా.

నేను క్షణంసేపు ఆలోచించాను. రిఫ్రిజిరేటర్ చూసినట్లు గుర్తులేదు. కాని సుజాత మాటలు గుర్తుకొచ్చినయ్. 'సారీ! డ్రింక్స్ ఆఫర్ చెయ్యనందుకు. మా ఫ్రిజిడర్ ఎందుకో పనిచేయుడంలేదు'- వుందన్నట్లు తలవూపాను.

''అయితే సుబ్బారావు శవాన్ని ఎనిమిది రోజులపాటు చెడిపోకుండా తాజాగా వుంచడానికి హంతకులు ఉపయోగించిన పద్ధతి చాలా సులభమైంది. రిఫ్రిజిరేటర్లో దాచి వుంచారనడంలో సందేహంలేదు'' అన్నారు సిన్హా ఆరిపోయిన చుట్ట వెలిగిస్తూ.

''ఎలా. ఎలా కుదురుతుంది?'' అడిగాడు కృష్ణమోహన్.

''మనం ఏదైనా ఒక పదార్థాన్ని కోల్డ్‌స్టోరేజిలోకాని, రిఫ్రిజిరేటర్‌లోగాని వుంచినప్పుడు ఆ పదార్థం రిఫ్రిజిరేషన్ ప్రభావం వలన, అందులో వున్నంతసేపు తన స్వరూప స్వభావాల్ని కోల్పోదు. అంటే ఆ పదార్థం రిఫ్రిజిరేషన్‌లో పెట్టినప్పుడు ఎలా ఉంటుందో, తిరిగి బయటికి తీసేప్పుడూ అదేస్థితిలో వుంటుంది.''

ఇన్‌స్పెక్టర్ కృష్ణమోహన్ బుద్ధిమంతుడైన విద్యార్థిలా తలవూపాడు.

''అదే సిద్ధాంతాన్ని ఇప్పుడు సుబ్బారావు విషయానికి అనుసరించారనుకో. అప్పుడేమవుతుంది. ఒకటవ తారీఖు

రాత్రి పదిగంటల ప్రాంతంలో సుబ్బారావునుచంపి ఫ్రిజిడర్‌లో దాచారనుకొందాము. తిరిగి ఎనిమిదవ తారీఖున రాత్రి బయటకుతీసి పార్కులో పారేస్తే శవం స్థితి ఎలా వుంటుంది? ఒకటవ తారీఖు రాత్రి ఏ రకంగా వుందో అలాగే వుంటుంది. అంటే కొద్ది గంటల క్రితమే ప్రాణంపోయినట్లు తెలుస్తుంది. అందుచేతే డాక్టర్ నాయర్ రాత్రి ఒంటిగంట ప్రాంతంలో మరణం సంభవించినట్లు పోస్ట్‌మార్టమ్ రిపోర్ట్ వ్రాశాడు'' అన్నారు సిన్హా.

కృష్ణమోహన్ ఇంకా ఆశ్చర్యంగావింటూనే వున్నాడు.

''అవును. అలా అయితే అన్ని విషయాలు కరెక్ట్‌గా అతికినట్లు సరిపోతాయి. శవంలోపల ఊపిరితిత్తులలోనూ, జీర్ణకోశంలోను వున్న చెమ్మ రిఫ్రిజిరేషన్ ప్రభావం వలన ఏర్పడివుంటుంది. అలాగే శవాన్ని నీళ్ళకుండీలో పడేయడంలో ఉద్దేశ్యం అదే అయివుంటుంది. శవాన్ని దాదాపు ఏడురోజులు రిఫ్రిజిరేషన్‌లో వుంచితే తప్పకుండా వళ్లంతా చాలా చల్లబడి, లోపల ఏర్పడే నీటివల్ల బట్టలు తడిసి ఉంటాయి. దానివల్ల మనకు అనుమానం కలగకుండా నీళ్ళకుండీలో శవాన్ని పారేశారు'' అన్నాను నేను.

''యస్. దట్స్‌రైట్! మోహన్‌భాయ్! వెంటనే నీ పరివారాన్ని సుజాత ఇంటికి పంపించు. ఇంట్లోవున్న రిఫ్రిజిరేటర్‌లో వేలిముద్రలు, మనిషి రక్తానికి సంబంధించిన మరకలు ఉన్నాయేమో జాగ్రత్తగా పరీక్షించమని చెప్పు'' అన్నారు సిన్హాగారు యాష్‌ట్రేలో మొరాకో ఆర్పేస్తూ.

''నేనేవెళ్ళి అన్నీ జాగ్రత్తగా చెయ్యిస్తాను'' అన్నాడు కృష్ణమోహన్ హడావిడిగా బయటకు నడుస్తూ.

''సుజాతకు సహాయంచేసిన వ్యక్తి ఎవరో నాకిప్పుడు అనుమానం వస్తోంది'' అన్నాను సిన్హాగారివైపు చూస్తూ.

"ఎవరు?"

"డ్రైవర్ జానీ! ఆ రోజు సుబ్బారావు గది వెతకడానికి వెళ్ళినప్పుడతను ఇంట్లోంచి బయటకువస్తూ కనిపించాడు. బలంగా, అందంగా ఉన్నాడు."

అన్నాను జానీ రూపాన్ని గుర్తుచేసుకొంటూ.

"మనం జానీదగ్గరకు వెళ్దాంపద. ఆలశ్యమైతే పిట్ట పారిపోవచ్చు" అన్నారు సిన్హాగారు కారువైపు అడుగులేస్తూ.

అందమైన సుజాతను తలచుకుంటే నాకెందుకో దిగులనిపించింది.

* * *

"లేదు! నేనీ హత్య చెయ్యలేదు" అన్నది సుజాత సిన్హాగారి కళ్ళల్లోకి చూస్తూ.

సుజాత కంఠంలో ఓ రకమైన కాన్ఫిడెన్స్ కనిపిస్తోంది. సాధారణంగా నేరసులు అంత స్థిరంగా, నిర్లక్ష్యంగా మాట్లాడలేరు. సుజాత హంతకురాలు కాదని నాకు ఇన్ని ఆధారాలు దొరికినా ఇప్పటికీ అనిపిస్తోంది. అంత అందమైన మనిషిలో ఓ మనిషిని అంత క్రూరంగా చంపే ధైర్యం వుందంటే నమ్మలేకపోతున్నాను.

ఇన్స్పెక్టర్ కృష్ణమోహన్ మేకపిల్లను తినబోయే పులిలా ఆమెవైపు చూస్తున్నాడు.

"అమ్మాయ్! బుకాయించి లాభంలేదు. రిఫ్రిజిరేటర్ మీద నీవి, జానీవి వేలిముద్రలు, రిఫ్రిజ్ డ్రైన్ పైప్ కింద మెటల్ ఫ్రేములో ఉన్న నీటిలో మనిషి రక్తం, నీకువున్న మోటివ్ అన్నీ నువ్వే హత్యచేశావని నిరూపిస్తున్నాయి" అన్నారు సిన్హాగారు గంభీరంగా.

కారు డ్రైవరు జానీ ఓమూల తలవంచుకొని నేలమీద కూర్చునాన్నడు. అరెస్ట్ చేసిందగ్గరనుండి అతను కనీసం

ఒక్క మాట కూడా మాట్లాడలేదు.

"లేదు. ఈ హత్యతో నాకు సంబంధంలేదు" అన్నది సుజాత మళ్ళీ.

"అయితే ఎవరు నువ్వు కాకపోతే? జానీ చేశాడా?" అడిగారు సిన్హా.

"కాదు. అసలు సుబ్బారావు హత్య చెయ్యబడలేదు. అతను ఆత్మహత్య చేసుకొన్నాడు" అన్నది సుజాత.

"వాట్! నాన్సెన్స్" అరిచాడు కృష్ణమోహన్.

ఎందుకో ఒక్క క్షణం చాలా రిలీవింగ్ గా ఫీలయ్యాను. అప్పుడు గుర్తొచ్చింది. సుబ్బారావు కణతకు దాదాపు ఆనించి రివాల్వర్ పేల్చబడింది. అందుచేతే బుల్లెట్ చేసిన గాయం చుట్టూ నల్లగా కాలిపోయింది. కుడికణత కావడంవలన ఆత్మహత్యకు మరింత పాసిబిలిటీవుంది. అయితే సుజాత ఇదంతా ఎందుకు చేసినట్లు??

సుజాత హాండ్ బాగ్ లోంచి ఓ కవరు బయటికి తీసింది.

"ఇది సుబ్బారావు ఆత్మహత్య చేసుకొంటున్నట్లు వ్రాసిన ఉత్తరం. 1 వ తారీఖు రాత్రి ఇంటికొచ్చి భోంచేసిం తరువాత అతను ఆత్మహత్య చేసుకొన్నాడు."

అన్నది ఆ ఉత్తరం సిన్హాగారికిస్తూ.

"జీవితంలో అన్నిరకాలుగా ఓడిపోయాను నేను. బిజినెస్ లో నష్టం వచ్చింది. రేపో, మాపో అప్పులవాళ్ళు నాకున్నవన్నీ తీసుకుపోతారు. నేను దేవత అని నమ్మిన భార్య నన్ను మోసంచేసింది. జీవితంలో ఎన్ని ఎదురు దెబ్బలు తిన్నా ఇలాంటి నమ్మకద్రోహం నా జీవితంలో చూడలేదు. డ్రైవరు జానీతో అక్రమ సంబంధం వుందని తెలిసినప్పటి నుండీ, జీవితం చీకటైనట్లనిపించింది. విరక్తి వలన ఈ బ్రతుకు అనవసరం అనిపించింది. నా ఆత్మహత్యకు ఎవరూ

కారణంకారు." క్రింద సుబ్బారావు సంతకం, 1 వ లేదీ వేసివుంది.

అందరూ ఆశ్చర్యంగా ఆ ఉత్తరాన్నే చూస్తూ వుండి పోయారు.

"అయితే సుజాత శవాన్ని దాచడానికి ఇంత కష్టపడిం దెందుకు!" అడిగాను.

"క్వయిట్ సింపుల్ బోయ్!" అన్నారు సిన్హాగారు. అందరూ ఆయనవైపు చూశాము.

"అవును. ఇన్సూరెన్స్‌వారి యాభై వేల రూపాయల కోసం సుజాత సుబ్బారావు హత్యచేయబడినట్లు నిరూపించ డానికి ప్రయత్నించింది. సుబ్బారావు చనిపోతే ఇన్సూ రెన్స్ డబ్బు 50 వేలు సుజాతకు వస్తాయి. కాని సుబ్బా రావు తనంతట తాను ఆత్మహత్య చేసుకొంటే ఇన్సూరెన్స్ కంపెనీవాళ్ళు డబ్బు ఇవ్వరు. సుబ్బారావు సహజంగానో యాక్సిడెంట్ లోనో, హత్యచేయబడడం వలనో మరణించా డని నిరూపించబడితే సుజాతకు డబ్బువస్తుంది. కాని సుబ్బా రావు ఆత్మహత్య చేసుకొన్నాడు. అందుచేతే తనకు ఎలిబీ సృష్టించుకొని, తనమీదకు అనుమానం రాకుండా వుండ డానికి సుజాత సుబ్బారావు 1 వ తారీఖున కాకుండా, 8 వ తారీఖున చనిపోయినట్లు మనం అనుకోవడానికి ప్రయత్నం చేసింది" అన్నారు సిన్హా.

"అవును. జానీ నేను సుఖంగా బ్రతకడానికి ఆ యాభై వేలు చాలా అవసరం. మేము హత్యచేయడంలేదు. పట్టు బడితే సుబ్బారావు ఆత్మహత్య చేసుకొన్నాడని నిరూపించ డానికి అతను చనిపోతూ వ్రాసిన ఉత్తరం వుంది. అతని ఆత్మహత్యను, హత్యగా నా మీదకు అనుమానం రాకుండా ప్రూవ్ చేస్తే ఆ యాభై వేలు మావవుతాయి. అందుచేతే

శవాన్ని ఫ్రిజ్ లోవుంచి మీ దగ్గరకువచ్చి సుబ్బారావు కని పించడంలేదని నాటకం ఆడాను," అన్నది సుజాత తల వంచుకొని.

"అయినా నువ్వు జైలు తప్పించుకోలేవు. పోలీసులను, ఇన్సూరెన్స్ కంపెనీవాళ్లను మోసం చెయ్యడానికి ప్రయ త్నించినందుకు నీకు, సహాయం చేసినందుకు ఎకాంప్లిస్ ఇన్ కాన్స్పిరసీగా జానీకి రెండేళ్ళకు తగ్గకుండా కఠినశిక్ష పడు తుంది" అన్నాడు ఇన్స్పెక్టర్ కానిస్టేబుల్స్కు సైగ చేస్తూ.

సిన్హాగారు వాళ్ళిద్దరివైపు జాలిగా చూశారు.

"అయితే మరొక్క అనుమానం" అన్నాను నేను సిన్హా గారివైపు చూస్తూ.

చెప్పమన్నట్లు తలాడించారు సిన్హాగారు.

"సుబ్బారావుకు బెదిరింపు ఉత్తరాలు వ్రాసిందెవరు?"

"ఎవరూ వ్రాయలేదు. సుబ్బారావుకి ఇదివరకు వచ్చిన కవర్లలో పోస్ట్ ముద్రలు సరిగా పడనివి ఏరి వాటిలో తను వ్రాసిన ఉత్తరాలు పెట్టి మనకిచ్చింది సుజాత" అన్నారు సిన్హాగారు. సుజాత అవునన్నట్లు తలాడించింది.

నాకెందుకో ఇంకా దిగులు అనిపిస్తోంది. యాభై వేల కోసం రెండేళ్ళ జైలుశిక్ష రిస్క్ చేసింది సుజాత. రెండేళ్ళ జైలుశిక్ష తర్వాత సుజాతకు ఇంకా జానీమీద ప్రేమ మిగిలి వుంటుందేమో చూడాలి.

—: ఐపోయింది :—

# సముద్రపు దొంగలు?

మల్లాది వెంకటకృష్ణమూర్తి

ఎటు చూసినా నిశ్చలంగా కనపడే నీరు. అంతులేదు. చూపు మేర ఆనేంత దూరమంతా, ఏదిక్కు చూసినా నీళ్ళు. చుట్టుప్రక్కల నేలఎక్కడా లేకపోవడంవల్ల నీటిపక్షులు కూడా ఎగరటంలేదు ఎక్కడా.

సముద్రం మధ్యలో వెళ్తోంది "జలనిధి." ఓడ డెక్ మీద కుర్చీలో కూర్చుని చూస్తున్నాడు కులకర్ణి మిగతా ప్రయాణీకులతో పాటు, నీళ్ళవంక.

అలా పదిరోజాలనుంచి నీళ్ళమీదే, ఆ షిప్‌లో గడుపుతున్నారు అంతా. నీళ్ళు చూసిచూసి విసుగువేస్తోంది. డెక్ మీద ఎక్కువసేపు కూర్చుంటే సముద్రం నీటిమీదనుంచి వచ్చేగాలి ఉప్పగా తగులుతుంది. చెయ్యినాకి చూసుకుంటే

ఉప్పగా ఉంటుంది.

కార్గో షిప్ కాదది. పేసెంజర్ లైనర్. కులకర్ణితో పాటు మరో రెండువందలమంది ప్రయాణం చేస్తున్నారు జలనిధిలో.

ఆస్ట్రేలియాలోని పెర్త్‌నుంచి బయలుదేరి, సిలోన్‌లోని కొలంబోకి వెళ్తోంది జలనిధి, తిరుగు ప్రయాణం చేస్తూ. దాదాపు రెండు నెలలు ప్రయాణం చేస్తేకాని నేల తగలదు మళ్ళీ.

కులకర్ణి తన చేతిలోని నెవిల్ షూట్ నవల 'ఆన్ ది బీచ్' చదువుతూంటే ప్రక్కన కుర్చీలోవచ్చి కూర్చుని అన్నాడు ప్రయాణంలో పరిచయం అయినతను.

"హలో మిస్టర్ కులకర్ణీ."

"హలో" అన్నాడు కులకర్ణి తన చేతిలోని పుస్తకం మూసి నవ్వుతూ.

"ఇంకా పావు వంతయినా ప్రయాణం పూర్తికాలేదు. అప్పుడే విసుగుపుడుతోంది."

"నాకూ అంతే. ఈ నీళ్ళవంక చూడాలంటే సిక్‌గా వుంది."

"ఇంకో నలభై రోజాలపైనే ఇలా కొలంబోకోసం ఎదురు చూస్తూ కూర్చోవాలి."

"వి ఆర్ లైక్ ప్రిజనర్స్. ఈ ఓడలో ఖైదీలైపోయాం. ప్రయాణం ఇంత విసుగ్గా వుంటుందని ముందరే తెలిస్తే ఏరో ప్లేన్‌లో వెళ్ళేవాణ్ణి."

"నేను ఓసారి ప్రయాణంచేశాను ఓడలో. నాకు తెలుసు ఎంత విసుగ్గా వుంటుందో. అయినా నాకు విమాన ప్రయాణం అంటే భయం. దానికేమయినా అయితే అంత ఎత్తులోంచి ఒక్కసారిగా నీళ్ళలోకిపడి, సముద్రంలోని తిమింగిలాల నోట్లో చావాలి."

చిన్నగా నవ్వి, అన్నాడు కులకర్ణి.

"అలా చావడం తేలక, ఇలా రెండు, మూడు నెలలు దీంట్లో చచ్చేకంటె."

అతను, కులకర్ణి మూసేసిన 'ఆన్ ది బీచ్' వంక చూసి అన్నాడు.

"నెవిల్ షూట్ నవలలో ప్రేమ, విమానం, సస్పెన్స్ లేకుండా నడవవు. అయినా ఎప్పుడూ కొత్తగా బావుంటాయి. 'ఆన్ ది బీచ్' సినిమా చూశాను నేను."

కులకర్ణి సిగరెట్ పేకట్ తీసి ఖాళీగావుంటే దాన్ని బయటకి, సముద్రంలోకి విసిరేసాడు.

"సిగరెట్ కావాలా?"

అతని మిత్రుడు తనదగ్గరున్న 'లక్కీ-స్ట్రైక్స్' సిగరెట్ పాకెట్ అందిస్తూ అన్నాడు.

"ఇటాలియన్ సిగరెట్స్ ఇవి."

"పొగాకుతో చేస్తే ఏదేశం సిగరెట్స్ అయినా నాకు ఒకటే. థాంక్స్."

కులకర్ణి సిగరెట్ ముట్టించి అడిగాడు పొగ పీలుస్తూ.

"నిన్న కెప్టెన్ సముద్రదొంగల గురించి ఏదో చెప్తున్నాడు? మీకు తెలుసా వివరాలు ఇంకా ఏమయినా?"

"ఈ దారిలో ఇదే మొదటిసారి నా ప్రయాణం. నాకు తెలీదు. కాని ఓ విశేషం తెలుసు నాకు ఈ రూట్లో."

"ఏమిటి?"

"ఇంక కొంతకాలానికి మన ఓడ భూమధ్యరేఖ చేరుకుంటుంది. ఓడ అక్కడ ఆపేస్తారు చాలాసేపు. ఓడ కెప్టెన్, మిగతా పనివాళ్ళు పార్టీ చేసుకుంటారు అక్కడ."

"ఎందుకు?"

"ఆనవాయితీ ఓడ కెప్టెన్స్ అందరికీ."

"పెర్త్‌నుంచి కొలంబోకి 5,780 కిలోమీటర్ల దూరం. మధ్యలో ఎక్కడో తగలచ్చు."

కాసేపు మౌనంగా వుండిపోయారు ఇద్దరూ.

"నేను సిగరెట్స్ తెచ్చుకుంటాను. ఎక్స్‌క్యూజ్ మి ఫరే మూమెంట్" అని కులకర్ణి లేచాడు. డెక్ మీదనుంచి మెట్లమీదుగా క్రిందకి దిగాడు, లోయర్ డెక్‌లోకి. పేసేజ్‌లోంచి ప్రొవిషన్ స్టోర్స్‌కి వెళ్ళి, ఇండియాకింగ్స్ కోసం అడిగాడు.

అవి లేవు. ఇటాలియన్ సిగరెట్స్ 'లకీ స్ట్రైక్స్' నాలుగు పేకెట్స్ కొనుక్కున్నాడు ఇండియన్ కరెన్సీతో.

ఆ ఓడ దాదాపు చిన్న సైజు పట్నంలా వుంటుంది. అన్ని వసతులూ ఉంటాయి ప్రయాణీకుల ఓడలో. స్విమ్మింగ్ పూల్, బిలియర్డ్స్ రూమ్, టేబిల్ టెన్నిస్ రూమ్, ఇండోర్ గేమ్స్ రూమ్, బార్బర్ షాప్, లాండ్రీ, మినీ థియేటర్ — పట్నంలో కావాల్సిన నిత్యావసరమయినవన్నీ షిప్‌లో వున్నాయి.

కులకర్ణి సిగరెట్ తాగుతూ కాసేపు బార్‌లో కూర్చున్నాడు డబుల్ విస్కీ తీసుకుని. తర్వాత కేబిన్ నంబర్ E 117 వైపు కదిలాడు. కేబిన్ తలుపుమీద కొట్టాడు మునివేళ్ళతో.

రెండు నిముషాలాగి మళ్ళీ తలుపుమీద కొట్టాడు. తలుపు తెరచుకుంది. అరవైఏళ్ళ ముసలాయన, ఫ్రెంచ్ దేశస్థుడు, తలుపు తెరచి కులకర్ణి వంక చూసి నవ్వాడు.

"హలో మిస్టర్ కులకర్ణి" అన్నాడు ప్రక్కకి తప్పుకుంటూ.

"గ్లోరియా లేదా?" అడిగాడు కులకర్ణి లోపలకు వెళ్ళకుండానే, ఆయనవంక పలకరింపుగా నవ్వి.

"లేదు. టేబిల్ టెన్నిస్ ఆడటానికి వెళ్ళింది."

"మళ్ళీ వస్తానయితే."

కులకర్ణి అయిదు నిముషాల్లో కేబిన్స్‌వుండే కారిడార్ లోంచి టేబిల్ టెన్నిస్ గదిలోకి చేరుకున్నాడు. గ్లోరియా ఆడుతోంది.

"హాలో మిస్టర్ కర్ణి" పలకరించింది గ్లోరియా ఆడుతూనే.

కులకర్ణి ప్రతిగా నవ్వి కూర్చున్నాడు ఓ ఖాళీకుర్చీలో, ఆటవంక చూస్తూ. పావుగంటలో ఆట పూర్తయింది.

"ఏమిటి విశేషం?" అడిగింది గ్లోరియా కులకర్ణి దగ్గరకి వచ్చి.

"కొత్తచోటు కనుక్కొన్నాను."

"ఎక్కడ?" ఆతృతగా అడిగింది గ్లోరియా.

"నాతోరా. చూపిస్తాను."

"ఇప్పుడా?" కొద్దిగా సందేహంగా అడిగింది.

"అవును. ఇప్పుడే" చిలిపిగా నవ్వి గ్లోరియా చెయ్యి పట్టుకుని నడిచాడు కులకర్ణి.

కులకర్ణి గ్లోరియాతో వంటరిగా వుండేందుకు అనేకచోట్లు వెదుకుతూనే వున్నాడు, గ్లోరియాకి తనంటే ఇష్టమని తెలియగానే. ఆ ఓడలో రహస్య ప్రదేశాలంటూ ఏమీలేవు.

"ఇటెక్కడికి?" అడిగింది గ్లోరియా, మెట్లమీద కిందకి దిగుతూ.

"క్రింద లోడింగ్ రూమ్‌వుంది వకటి."

"లోడింగ్ రూమ్?"

"అవును. లోడింగ్ రూమ్."

"లోడింగ్ రూమ్‌లో ఏంచేస్తారు?"

"కన్సైన్‌మెంట్స్, సామాను లోడ్ చేస్తారు, అధికంగా వుండే ప్రయాణీకులవి, బుకింగ్ చేయబడ్డవి. అక్కడ

ఎవరికీ పనివుండదు అసలేమాత్రం."

"ఇదేనా లోడింగ్ రూమ్?" అడిగింది గ్లోరియా ఛాతీ మీద రెండుచేతులూ మడచి ఆ సామానుతో నిండిన గదివంక చూస్తూ.

"అవును."

కులకర్ణి అలా చేతులు కట్టుకుని నిలబడ్డ గ్లోరియావంక చూసాడు. అయిదడుగుల ఏడంగుళాల పొడవు, పొడవుకి తగ్గ లావు, గులాబి రంగుతో నిగనిగ మెరిసే వళ్ళు. హాట్ పేంట్, (తొడలదాకానే బిగుతుగా వుండే నిక్కర్) దాని మీద ఫుల్‌హేండ్స్ షర్ట్. బాబ్డ్ హేర్.

కులకర్ణి గ్లోరియా నడుంచుట్టూ చెయ్యివేసి మీదకి లాక్కున్నాడు కొద్దిగా తన్మయంగా. గ్లోరియా పెదవులని ముద్దు పెట్టుకున్నాడు.

"ఎవరూ రారుగా ఇక్కడికి?" అడిగింది గ్లోరియా.

"రారు."

"మొన్నటిలా ఎవరైనా చూస్తే."

"చూడనీ."

గ్లోరియాని పూర్తిగా ఆక్రమించుకున్నాడు కులకర్ణి.

ఇద్దరూ నిమిషాలలో మిగతా ప్రపంచమంతా మర్చిపోయారు. చుట్టూ సముద్రం వుందని, ఆ నీళ్ళమీద ఓడలో, మధ్యలో, లోడింగ్ రూంలో తామిద్దరం వున్నామన్న సంగతే మర్చిపోయారు. వాళ్ళకి ప్రస్తుతానికి, ఆ క్షణానికి గుర్తుందల్లా కోరిక, సుఖం.

"లోడింగ్ రూమ్" అన్నది గ్లోరియా మత్తుగా నవ్వుతూ.

## 2

చీకటి పడింది.

దూరంగా వస్తున్న స్టీమర్‌వంక చూసారు పెద్ద పడవలో

వున్న దాదాపు ఏభైమంది.

నిశ్శబ్దంగా, చీకటిని చీల్చుకుంటూ, భూతంలా వస్తోంది స్టీమర్. ఆ పడవలో వున్న వాళ్ళలో నాగరికుడు ఒక్కడే. అమెరికన్. మిగతా వాళ్ళంతా అనాగరికులు. నాగరికత ఏ మాత్రం తెలియని, రాతియుగపు అనాగరికత వదలని మొండి వాళ్ళు.

అమెరికన్ కాళ్ళకి ఇనుప గొలుసులు కట్టివున్నాయి, పారిపోకుండా. అలాంటి పడవే మరొకటి ఇంకొంచెం దూరంలో వుంది, మరో యాభైమందితో.

వస్తున్న స్టీమర్‌కి అడ్డంగా నడిపారు పడవలు రెండిటినీ ఆ చీకట్లో. స్టీమర్ అయిదారు ఫర్లాంగుల దూరం రాగానే తమ చేతుల్లోని కాగడాలని వెలిగించి, వాటిని చేత్తో గాల్లోకి వూపుతూ గట్టిగా హాహాకారాలు చేశారు ఏకకంఠంతో.

కొంతమంది చేతిలో కత్తులతో, బాణాలతో, ఈటె లతో సముద్రంలోకి దూకి ఆగుతున్న ఆ స్టీమర్ వైపు ఈదుకు వెళ్ళసాగారు వేగంగా.

'జలనిధి'లో, ఇంజన్ రూమ్‌లో వున్న నావికుడు కొంచెం దూరంలో అడ్డంగా ఆగివున్న పడవలమీదవున్న మనుషులని, వాళ్ళ చేతుల్లోని కాగడాలని చూసి, ఇంటర్ కమ్యూని కేషన్‌లో చెప్పాడు కెప్టెన్‌తో.

"సర్. స్టీమర్ ఆపుతున్నాను. ఎదురుగా రెండు పెద్ద పడవలనిండా జనం అడ్డం వచ్చారు."

నైట్ రూంలో సిగరెట్ తాగుతూ టెలివిజన్ చూస్తున్న జలనిధి కెప్టెన్ చెప్పాడు కంగారుగా.

"నేను వస్తున్నాను."

చేతి గడియారంవంక చూసుకున్నాడు. అర్ధరాత్రి పన్నెండవుతోంది. ఇంజన్ రూంకి కెప్టెన్ చేరుకునేసరికే

ఓడ వేగం తగ్గిపోయింది క్రమంగా.

ఓడ గదిలోవున్న నావికుడు పేనెల్‌లో అనేక ఇండికేటర్స్‌ని చూస్తూ త్వరగా ఓడ ఆపే ప్రయత్నంలో వున్నాడు.

"చూడండి సార్. అవిగో."

కెప్టేన్ ఎదురుగా కనపడే దృశ్యం చూసాడు. రెండు పెద్ద పడవలనిండా కాగడాల వెలుతురులో కనపడే అనాగరికులు తెడ్లువేస్తూ కదులుతున్న ఓడకి ఫర్లాంగు దూరంలో తమ పడవలని వుంచుతూ, గట్టిగా అరుస్తున్నారు.

"వాళ్లు సముద్రపు దొంగలు" అన్నాడు కెప్టేన్ ఆదుర్దాగా.

"వాళ్ళ పడవల అడ్డం వున్నంతసేపు మన స్టీమర్ నడపడానికి వీల్లేదు. ఏమాత్రం డేమేజ్ అయినా అంతా మునిగిపోతాం" అన్నాడు నావికుడు.

ఓడ ఆగింది క్రమంగా. పూర్తిగా ఆగకుండానే కెప్టేన్ మైక్ అందుకుని పబ్లిక్ ఎడ్రస్ సిస్టమ్ స్విచ్ ఆన్ చేసి చెప్పాడు జలనిధిలోని ప్రయాణీకులందరికీ.

"లేడీస్ అండ్ జంటిల్‌మన్. మూడురోజుల క్రితం, మనం ఈ ప్రాంతానికి రాకముందు నేను మీకు ఈ చుట్టుప్రక్కల తిరిగే సముద్రపు దొంగల గురించి చెప్పాను. దురదృష్టవశాత్తు ఆ సముద్రపు దొంగలు మన ఓడని ఆపేసారు ఇప్పుడు. మీ దగ్గరున్న విలువయిన వస్తువులన్నీ రహస్య ప్రదేశాలలో భద్రపరచండి. వాళ్ళకి ఎదురు తిరగకండి. అనాగరికులు వాళ్ళు."

సముద్రంలోకి దూకి ఈదుకు వచ్చినవాళ్లు చాలామంది జలనిధికి వ్రేలాడుతున్న త్రాళ్ళని, లైఫ్‌బోట్స్‌ని పట్టుకుని పైకి పాకారు, ఓడలోకి అప్పటికే.

రేడియో రూంలోంచి వైర్‌లెస్ మేన్ దొంగల గురించి షోర్‌లోని రిసీవింగ్ స్టేషన్‌కి సమాచారం చెప్తున్నాడు. నిశ్శబ్దంగా పిల్లుల్లా లోపలకివచ్చిన ఆ అనాగరికులు తెరచి వున్న ఇంజన్ రూంలోకి వచ్చారు.

చాలాసార్లు వాళ్ళు స్టీమర్‌లలో ప్రవేశించి దొంగతనాలు చేసారు. ఓడ కదిలేందుకు వుపకరించే ప్రధాన యంత్రాలన్నీ యింజన్ రూంలోనే వుంటాయని తెలుసు వాళ్ళకి. తెల్లటి దుస్తుల్లోవున్న ఆ గదిలోని నలుగురూ ఓడ నడిపేవాళ్ళని కూడా గ్రహించకలిగారు వాళ్ళు.

చేతిలోని కత్తులని, ఈటెలని వాళ్ళకి ఆనించారు కదిలితే పొడిచి చంపుతామన్నట్లుగా. కెప్టెన్ జేబులో రివాల్వర్ వుంది. ఓడలో నాలుగయిదు రైఫిల్స్‌కూడా వున్నాయి. కాని అవి ఆ అనాగరికులని జయించలేవు.

అన్నిటికన్నా ముఖ్యం ప్రయాణీకుల సంరక్షణ. వాళ్ళు చెప్పిన మాట వింటే ఎవరినీ ఏంచేయకుండా వెళ్ళిపోతారు. ఎవరినయినా చంపుతే మాత్రం అందరినీ చంపికాని వెళ్ళరు.

ఆ అనాగరిక దొంగల గురించి చాలావిన్నాడు కెప్టెన్, కాని ఇదే మొదటిసారి చూడటం వాళ్ళని. మైక్‌లో చెప్పాడు పబ్లిక్ ఎడ్రస్ సిస్టమ్‌ద్వారా, నౌకలోని ప్రయాణీకుల కలవరం విని.

"మన ఓడనిండా ఇంకా స్పేపట్లో దొంగలుంటారు. వారేం అడిగితే అది ఇచ్చేయండి. ఎదురు తిరిగితే మనందరినీ చంపి, ఓడని ధ్వంసంచేసి మరీ వెళ్తారు. ఎవరూ ఎదురు తిరగద్దు."

"బేడ్‌లక్ సర్" అన్నాడు కెప్టెన్ సహచరుడు.

అతడు భయపడుతున్నాడని గ్రహించి అన్నాడు కెప్టెన్ ధైర్యంచెబుతూ. "ఏం ఫర్వాలేదు. అంతా అరగంటలో అయిపోతుంది. వాళ్ళని ఏం చెయ్యకపోతే మనల్ని ఏం

చెయ్యరు."

ప్రయాణీకులంతా తమతమ కేబిన్స్‌లోంచి బయటికివచ్చే సారు అప్పటికే. కొందరు డెక్‌మీదకు చేరి చూస్తున్నారు. కొందరు రిస్ట్‌వాచీలలాంటి విలువయిన వస్తువులని దాస్తున్నారు తివాచీలకింద, అక్కడక్కడా.

ఈదుకు వచ్చినవాళ్ళతో కలిసారు రెండు పడవలమీది జనం, చేతుల్లో బరిసెలు, ఈటెలు మొదలయిన ఆయుధాలతో. తమతో తెచ్చిన అమెరికన్‌తో ఏదో చెప్పారు అనాగరిక భాషలో.

అమెరికన్ చెప్పాడు ఇంగ్లీలో అందరికీ.

"మీకు హానిచెయ్యమని చెప్పమన్నారు. మీ దగ్గరున్న బంగారం, వెండి, దంతంసామాను, తినుబండారాలన్నీ ఈ గుడ్డమీద పడేయమని చెప్తున్నారు."

వాళ్ళలో ఇద్దరు ఓ పెద్ద ఎర్రగుడ్డని నేలమీద పరిచారు.

దాదాపు వందమందిదాకా వున్నారు. అంతా జట్లు జట్లుగా చీలి, ప్రయాణీకుల చేతులకున్న ఉంగరాలు, బంగారు రిస్ట్‌వాచ్‌లు, మెళ్ళోని బంగారం గొలుసులు వసూలు చెయ్యటం మొదలుపెట్టారు.

"మీదగ్గరున్నవి ఎదురు తిరగకుండా ఇవ్వండి. వీళ్ళలో ఎవరికి చిన్న దెబ్బ తగిలినా అందరినీ నిర్దయగా పొడిచి చంపేస్తారు. అలా ఎన్నో ఓడలని కాల్చి ముంచేసి వెళ్ళిపోయారు. వీళ్ళ క్రూరత్వం నాకు తెలుసు" హెచ్చరించాడు అమెరికన్.

కాళ్ళకి, చేతులకి ఇనుపగొలుసులు వేసికట్టి, బందీచేసిన అతన్ని అడిగాడు గ్లోరియా తండ్రి.

"వీళ్ళకి నువ్వు ఎలా చిక్కావ్?"

"రెండున్నర సంవత్సరాలక్రితం నన్ను పట్టుకున్నారు.

"సీకింగ్'లో వెళ్తూంటే."

"సీకింగా?"

"అవును, హేమిల్టన్ షిప్పింగ్ కంపెనీలో కెప్టెన్ని నేను."

"గోధుమ రవాణా చేసే 'సీకింగ్' మునిగిపోయిందని అనుకున్నారు అప్పుడు. నాకు గుర్తుంది ఇంకా ఆ సంఘటన. తుఫాన్లో చిక్కుకుందనుకుని రెండు నెలలు తర్వాత రెకేజ్ కోసం, మునిగిపోయిన శిధిలాలకోసం వెదికారు చాలామంది."

"మునిగిపోలేదు. ఆ గోధుమలు తీసుకుని ఓడని తగలబెట్టేసారు వీళ్ళు. వీళ్ళ భాష నేర్చి నన్ను ఇంటర్ప్రెటర్గా వుపయోగిస్తున్నారు."

"మీరు బందీ అన్నమాట అయితే."

"అవును. ఇంతదాకా ప్రాణాలతో వుంచారు నన్ను."

వాళ్ళలో ఒకడు అమెరికన్ దవడమీద చేత్తోకొట్టి ఏదో అన్నాడు గట్టిగా. అమెరికన్ మాట్లాడటం ఆపేసాడు ఠక్కున.

దాదాపు గంటదాకా వెదుకుతూనే వున్నారు వాళ్లు, ఓడలోని రెండువందల పైగా కేబిన్స్. తమకి నచ్చినవి తీసుకువచ్చి పరిచివున్న ఆ గుడ్డలో వేస్తున్నారు.

చేతిబొమ్మలు, బట్టలు, తెల్లకాగితాలు, వైన్ బాటిల్స్, కలాలు, నీళ్ళపీపాలు అనేకం తీసుకువచ్చి విడివిడిగా మూటలుగా కట్టి తమ పడవలోకి చేరవేస్తున్నారు.

రెండున్నర నెలలుదాకా సరిపోయే ఆహారం నిల్వచేసి వుంచారు ఓడలో అడుగుభాగాన. ఆ నిలవచేసిన గోధుమ బస్తాలు, టీ, కాఫీపొడి బస్తాలు, కేన్డ్ ఫుడ్, చేపలనిపట్టే వలలు, ఇతర దినుసులు అన్నీ గింజకూడా వుంచకుండా చేరవేసుకున్నారు తమ పడవలోకి.

ప్రయాణీకులు తిరగబడకుండా ఇద్దరిద్దరి ప్రక్కన తమ మనిషిని ఒకణ్ణి కాపలావుంచారు జాగ్రత్తకోసం. అంతా నిస్సహాయంగా చూస్తుండిపోయారు ఏంచేయలేక.

జలనిధి కేప్టెన్ అన్నాడు ఆ అమెరికన్‌తో.

"నీళ్ళు, ఆహారం మాకు వుంచకుండా తీసుకువెళ్ళిపోతే మలమలమాడి చచ్చిపోతాం."

అమెరికన్ చిన్నగానవ్వి అన్నాడు.

"నీళ్ళు ఇవ్వరు. మళ్ళీ వెనక్కి తిరిగి త్వరగా వచ్చిన చోటికి చేరండి. అదే నేను ఇవ్వగలిగే సలహా."

ఆఖరి బేచ్ కూడా వచ్చేసింది. వాళ్ళ నాయకుడు మరో అయిదుగురితో కలసి ఓడమొత్తం కలయతిరిగి చూసి, తామేమీ వదలలేదని నిర్ణయించుకున్న తర్వాత మళ్ళీ వాళ్ళని కలిసాడు.

రెండుచేతులూ పైకెత్తి, గాలిలోవుంచి, గట్టిగా ఏదో చెప్పాడు ప్రార్థిస్తున్నట్లుగా, కళ్ళు మూసుకుని.

తర్వాత కళ్లు తెరచి ప్రయాణీకు అందరినీ చూసాడు. కెప్టెన్, అతని సహాయకులు పెట్టుకున్న తెల్లరంగు టోపీలు అతని దృష్టి నాకర్షించాయి.

తన మనుషులతో ఏదో చెప్పాడు వాటివంక చూపించి. క్షణాల్లో అవి వాళ్ళ చేతుల్లోకి మారాయి.

నాయకుడు దీక్షగా చూసాడు అందరివంక. ఆడవాళ్ళ వంక దీక్షగా చూసాడు.

మొత్తం ముప్ఫైమంది వున్నారు ఆడవాళ్లు. అయిదుగురు ముసలివాళ్లు. ఏడుగురు మధ్యవయస్కులు. ఎనిమిది మంది చిన్నపిల్లలు. మిగతావాళ్ళు, పదిమందీ వయసులో వున్న వాళ్లు.

నాయకుడు వాళ్ళని పరిశీలనగాచూసి అమెరికన్‌తో

ఏదో చెప్పాడు,అమెరికన్ తిరిగి ఏదో చెప్పాడు నాయకుడితో వాళ్ళ భాషలో.

కోపంతో వూగిపోయాడు నాయకుడు అమెరికన్ చెప్పిన మాటలు వినగానే. ఛెళ్ళున అతని చెంపమీద కొట్టి గట్టిగా ఏదో అరచి చెప్పాడు.

అమెరికన్ కొద్దిగా, బాధగా చెప్పాడు గట్టిగా, అందరికీ వినపడేలా.

“అటువైపునుంచునివున్న ఆరుగురు అమ్మాయిలని తనతో పంపమంటున్నాడు.”

“ఏమిటీ?” అడిగారు ఎవరో.

“అవును. ఆ అమ్మాయిలని తనతో పంపమంటున్నాడు.”

“పంపం” అరిచాడు ఆ ఆరుగురిలో ఓ పిల్లతండ్రి.

“ఆ రాక్షసులు పంపకపోతే బలవంతంగా తీసుకువెళతారు.”

“ఈ అనాగరికుల చేతుల్లో వీళ్ళని వదలడంకంటె నరకం, మనసుకు రంపంకోత మరోటి వుండదు” అన్నారు మరొకరు.

“పంపం. పంపలేం” అరిచారు చాలామంది.

అమెరికన్ ఆ సంగతి చెప్పాడు ఆ అనాగరికుడితో.

తనవాళ్ళవైపు తిరిగి ఏదో చెప్పాడు నాయకుడు చేతులు వూపుతూ.

దాదాపు అరడజనుమంది కదిలారు ఆ అమ్మాయిలవైపు. తమవైపు వస్తున్న ఆ రాక్షసులని చూసి కెవ్వున అరిచారు ఆడపిల్లలు.

“ఇదన్యాయం” అరిచింది ఓ పిల్లతల్లి.

“ఇంతమందిచూస్తూ వూరుకుంటారే?” అరిచాడు ఓ ముసలాయన.

"మీరంతా మొగాళ్లు కాదా?" అరిచింది మరో పిల్ల తల్లి.

నిస్సహాయంగా చూస్తూండిపోయాడు అమెరికన్ వాళ్ళ వంక. ఆ పిల్లలని తీసుకెళ్ళి ఎంతమంది వంతుల ప్రకారం అమానుషంగా వాడుకుని తర్వాత ఏ విధంగా చంపుతారో ఆ అమెరికన్ కి తెలుసు. అందుకే జాలిగా చూస్తూండిపోయాడు.

కెప్టెన్ కి ఏంచెయ్యాలో తోచలేదు. అంతదాకా అంతా సక్రమంగా వుందికదా, త్వరలో వీళ్ళపీడ వదిలిపోతుంది కదా అని అనుకుంటున్న కెప్టెన్ కి ఏంచెయ్యాలో తోచలేదు.

వాళ్ళకి ఎదురు తిరిగితే అందరినీ చంపేస్తారు. ఎదురు తిరగకపోతే జరిగేది చూస్తూ వూరుకోవాల్సిందే.

అందరికన్నా కొద్దిగా ధైర్యవంతుడయిన ఓ ఆర్మీ అధికారి మాత్రం తన కూతురుని వాళ్ళకి వదిలి, చేతిలో ఆయుధం వుండికూడా చూస్తూ వూరుకోలేకపోయాడు.

జేబులోంచి తన సర్వీస్ రివాల్వర్ తీసి కాల్చాడు గబ గబా ఆడపిల్లలవైపు వెళ్తున్న వాళ్ళవంక.

ఆరుగురు నేలకూలారు అరుస్తూ. మిగతా అయిదుగురు భయంగా ఆగిపోయారు.

నాయకుడు ఆ ఆర్మీ ఆఫీసర్ చేతిలో పొగలు గక్కుతున్న రివాల్వర్ వంక, అతనివంక క్రోధంగా చూసాడు.

కీచుగా ఏదో అరిచి, చేతిలోని పదునయిన కత్తితో ఇద్దరి తలలు ఎగరకొట్టాడు. తమతోటి ప్రయాణీకుల తలలు ఎగరగనే అందరి గుండెలు ఘల్లుమన్నాయి.

ఆ ఆర్మీ ఆఫీసర్ దగ్గరకి వక్కదూకులో వెళ్ళి తన చేతిలోని కత్తితో రివాల్వర్ పట్టుకున్న అతని చేతిని తెగ కొట్టాడు. తర్వాత కత్తిని కంఠంలోకి దించాడు సూటిగా.

ఆ దృశ్యం చూడలేక కళ్ళుమూసుకున్నారు చాలామంది. మిగతావాళ్లుకూడా ప్రయాణీకులమీదకి దూకారు. తమని

చంపడానికి ప్రయత్నిస్తున్న ఆ అనాగరికులని ఎదుర్కొన్నారు మొగవాళ్ళు. కాని వాళ్ళ ఆయుధాలముందు, బలంముందు ఆగలేకపోయారు ఎవరూ.

సంకులసమరం సాగింది చాలాసేపు. రక్తం ఏరై ప్రవహించి సముద్రపు నీళ్ళలో కలిసిపోతోంది. తలలు తెగిపడుతున్నాయి. కొందరు పారిపోదామని డెక్ మీదనుంచి నీళ్ళలోకి దూకారు. కొందరు తమ కేబిన్స్‌లోకి పరిగెత్తారు దాక్కోడానికి.

జలనిధి కెప్టెన్ తన రివాల్వర్‌లోని ఆరుగుళ్ళూ అయిపోయేదాకా తన దగ్గరకి ఎవరినీ రానివ్వలేదు. తర్వాత ఓ కత్తి అతని గుండెల్లో గుచ్చుకుంది.

గంట అయింది. చాలామంది చచ్చిపోయారు. ఆ అనాగరికులు కేబిన్స్ అన్నీ వెదకి, దాక్కున్నవాళ్ళనికూడా చంపి, ముగ్గురు ఆడపిల్లలని తమ పడవలోకి చేర్చారు. మిగతా ముగ్గురిలో ఒక అమ్మాయి నీళ్ళలోకి దూకి ఆత్మహత్య చేసుకుంది. ఇద్దరు చంపబడ్డారు బాణాలతో పారిపోతుంటే.

గంటన్నర తర్వాత మిగిలిన ఎనభైమంది, రెండుపడవల్లో బయలుదేరారు. జలనిధిని వదలబోయేముందు కుర్చీలు, బల్లలు మొదలయినవి డెక్ మీదకి చేర్చి నిప్పు అంటించి మరీ వెళ్ళారు సముద్రపు దొంగలు.

మూడుగంటలక్రితం చక్కగా ప్రయాణంచేస్తున్న జలనిధి ఇప్పుడు మంటల్లో చిక్కుకుంది. మూడుగంటల క్రితం, కేబిన్స్‌లో, తమ పక్కలమీద నిశ్చింతగా నిద్రపోతున్న ప్రయాణీకులు ఇప్పుడు శాశ్వతంగా నిద్రిస్తున్నారు.

విజయగర్వంతో వెళ్ళిపోయారు సముద్రపు దొంగలు తమ ద్వీపంవైపు.

జలనిధిలో వాళ్ళు కుప్పగాపోసి అంటించిన నిప్పు,

క్రమంగా ఓడంతా పాకుతోంది డెక్ మీదనుంచి, నల్లటి పొగని విడుస్తూ.

## 3

వాళ్ళు చేస్తున్న చప్పుళ్ళు, అన్ని కేబిన్స్ వెదుకుతున్న చప్పుడు, ప్రయాణీకుల గుసగుసలూ అన్నీ వినపడుతున్నాయి. కెప్టెన్ పబ్లిక్ ఎడ్రస్ సిస్టమ్ద్వారా సముద్రపు దొంగల గురించి చెప్పిన సంగతి వినపడగానే, లోడింగ్ రూమ్లో వున్న కులకర్ణి గ్లోరియా కౌగిలిలోంచి విడివడ్డాడు.

“దొంగలట” అన్నది గ్లోరియా కొద్దిగా భయంగా.

“అవును” అన్నాడు కులకర్ణి చిన్నగా ఆవలిస్తూ.

“మన కేబిన్స్లోకి వెళ్ళిపోదాం అయితే.”

కులకర్ణి మళ్ళీ గ్లోరియాని మీదకి లాక్కుని అన్నాడు.

“వద్దు. ఇక్కడే వుందాం.”

“ఎందుకు?”

“ఇక్కడికి దొంగలురారు కాబట్టి.”

“నాకు భయం. మానాన్న దగ్గరకి వెళ్ళిపోతాను.”

“వద్దు. ఇక్కడేవుండు. నీకు తెలియదు.”

కులకర్ణి కూడా తన కేబిన్కి వెళ్ళదలచుకోలేదు. ఆ సముద్రపు దొంగలు వస్తే వాళ్ళు చేసే కార్యక్రమం, దోచుకునే పద్ధతి తెలుసు కులకర్ణికి. చాలాసార్లు విన్నాడు కెప్టెన్ చెప్పగా.

నిజానికి ఆ సమయంలో తన కేబిన్లోనే వుంటే, ఎక్కడికయినా వెళ్ళి దాక్కునేవాడుకాడు కులకర్ణి. కాని ఇప్పుడు గ్లోరియాతో బయటకివస్తే తమ నిద్దరినీ ఎవరయినా చూసే అవకాశంవుంది.

అప్పటికే తమగురించి అంతా చెప్పుకుంటున్నారు రహ

స్యంగా తమలోతాము. ఏపని చేయడానికిలేక, ఖాళీగా వున్న ప్రయాణీకులందరికీ స్కాండల్స్ మాట్లాడుకోవటం సరదా.

అంతా ఓచోట చేరాక తను ముందర గ్లోరియాని పంపి, వెనకాల ఓ అయిదు నిముషాలాగి వెళ్ళటం వుత్తమం అను కున్నాడు కులకర్ణి.

తర్వాత అక్కడేవుండి జాగ్రత్తగా జరిగేదంతా విన సాగాడు. గ్లోరియా అతుక్కుపోయింది కులకర్ణిని భయంగా.

"నువు ఇక్కడేవుండు. నేను ఎవరయినా వున్నారేమో చూసివస్తాను" అన్నాడు కులకర్ణి.

"నేనొక్కదాన్నే వుండలేను. నాకు భయం."

"అయితే నా వెనకే రా."

"వద్దు. అంతా అయేదాకా ఇక్కడే వుందాం."

"ఇక్కడేవుంటే ప్రమాదం. వెతికితే, మనం కనబడతాం. దాక్కున్నామని మనల్ని ఏమయినా చేయచ్చు."

గ్లోరియా వప్పుకుంది కులకర్ణి వత్తిడిమీద.

"నా వెనకే రా" అన్నాడు కులకర్ణి.

ఇద్దరూ నడిచారు తలుపువైపు. తలుపు తెరవకుండానే, బయట అడుగులసవ్వడి వినబడింది గబగబా, ఎవరో వస్తు న్నట్లుగా. లోపల గడియ చటుక్కున తీసి తలుపుప్రక్కన నక్కాడు కులకర్ణి.

గ్లోరియాని ప్రక్కకి జరగమని సౌంజ్ఞ చేసాడు కాని గ్లోరియా ఆ సౌంజ్ఞని అర్థంచేసుకునేలోపల తలుపు తెరచు కుంది.

గ్లోరియా కెవ్వున కేక వేసింది లోపలకి వచ్చినతన్ని చూసి. నల్లటి మొద్దుశరీరం. ఒంటిమీద గోచీతప్ప మరేంలేదు.

మెడలో మాత్రం తెల్లటి, ఎర్రటి పూసలతో చేర్చిన దండలు వేలాడుతున్నాయి. జడలు వేలాడుతున్నాయి భుజాలమీదకి.

భయంకరంగా వున్నాడు.

గ్లోరియా-హాట్ పేంట్, షర్ట్సలలోవున్న గులాబిరంగు గ్లోరియా-ఆకర్షించింది అతన్ని. వంకరగా నవ్వాడు వాడు గ్లోరియాని చూసి.

గ్లోరియా తన నాయకుడికంట పడితే ఇక తనకి దక్కదు. ఇలాంటి అందమయిన అమ్మాయి ఎప్పుడోగాని తటస్థపడదు. దొరికినప్పుడు అవకాశం వదులుకోకూడదు అనుకున్నాడు వాడు.

ఇక్కడే అనుభవించి, చంపి పారేస్తే ఎవరికీ తెలియదు తను చేసిన సంగతి. తనవాళ్ళకి తెలియనంతకాలం ఏమీ కాదు. ఈ ఓడని వదలగానే యిక ఎప్పటికీ తెలియదు.

గ్లోరియా చేతిని పట్టుకున్నాడు, కుడిచేతిలోని కత్తిని ఎడంచేతిలోకి మార్చుకుని.

మరోసారి కెవ్వున అరిచింది గ్లోరియా.

కులకర్ణి కదిలాడు. మెరుపులా కదిలాడు తలుపుప్రక్క నుంచి. తనచేతి పట్టుని విడిపించుకోవాలని ప్రయత్నిస్తున్న గ్లోరియా తలుపు ప్రక్కకి, ఎవరినో సహాయంకోసం చూస్తున్నట్లుగా చూడటం గుర్తించి, తల ప్రక్కకి తిప్పి చూశాడు ఆ అనాగరికుడు.

అప్పటికే మెరుపులా కదిలాడు కులకర్ణి. లోడింగ్ రూమ్‌లోవున్న చిన్న చెక్కపెట్టెని అందుకుని బలంగా వాడి తలమీద మోదాడు రెండుసార్లు.

కిందపడలేదు వాడు. తూలాడు ఓసారి. కులకర్ణి గ్రహిం

చాడు ఆ రెండు దెబ్బలు వాణ్ణి ఏంచేయలేదని. పెట్టెని వాడి పాదాలమీద పడేసి, ఎడం చేతిలోని కత్తిని అందుకుని బలంగా వాడిపక్కలో పొడిచాడు కత్తిని.

కిందపడ్డాడు వాడు కడుపుకి ఎడమవైపు గుచ్చుకున్న కత్తితో.

అరవకుండా గ్లోరియా నోరునొక్కి లోడింగ్ రూం తలుపు మూసేసి, లోపల గడియవేసాడు. అరవకుండా గ్లోరియా నోరునొక్కే వుంచి చెప్పాడు రహస్యంగా చెవిలో.

“అరవక. అరిస్తే అంతా వస్తారు. అరవక.”

గ్లోరియా ఆ షాక్ నుంచి తేరుకోడానికి రెండు నిముషాలు పట్టింది. ఆ రెండు నిముషాలు అలాగే గ్లోరియాని దగ్గరకి తీసుకుని అరవకుండా నోరునొక్కిపెట్టి వుంచి నిల్చుండి పోయాడు కులకర్ణి.

గ్లోరియా శరీరం భయంతో వణకటం స్పష్టంగా గమనించి అన్నాడు కులకర్ణి.

“అరవక. వాడు ఇంకా చావలేదు. కదులుతున్నాడు. జాగ్రత్త. అరవక.”

గ్లోరియానివదిలి బాధతో కదులుతూ, మెడలో వ్రేలాడుతున్న ఓ ఇనప తీగలాంటి తీగకివున్న చిన్న వరలోంచి కత్తి తీసిన ఆ సముద్రపు దొంగవంక చూశాడు కులకర్ణి.

కాలితో కత్తివున్న వాడిచేతిని తొక్కిపెట్టి, పక్కలో గుచ్చుకునివున్న కత్తిని బయటకి లాగాడు. లాగగానే మూల్గాడువాడు బాధగా. మరోసారి పొడిచాడు కత్తిని బలంగా వీపులోకి కులకర్ణి.

చెమటలు పట్టేశాయి కులకర్ణికి. గ్లోరియావంక చూశాడు. దూరంగా ఓమూలవెళ్ళి నిలబడింది భయాన్ని, ఏడుపును

ఆపుకోడానికి ప్రయత్నిస్తూ.

గ్లోరియా దగ్గరకి నడిచాడు కులకర్ణి.

"గ్లోరియా" పిల్చాడు మృదువుగా.

"నువు చంపేసావు. వాణ్ణి చంపేసావు" అన్నది వణుకుతున్న కంఠంతో.

"ఆమూల కూర్చో. మనం చంపిన సంగతి వాళ్ళకి తెలిస్తే బ్రతకనివ్వరు ఎవర్నీ."

కులకర్ణి ఆ శవాన్ని రెండు చేతులతో అతికష్టంమీద ఎత్తి, ఓ డ్రమ్ముచాటుకు తీసుకువెళ్ళి కూర్చోపెట్టాడు. కేన్వాస్ క్లాత్ ముక్కతో రక్తాన్ని తుడిచాడు శుభ్రంగా.

"ఇప్పుడు మనం బయటకి వెళ్ళకూడదు. ఇక్కడే వుండాలి. వాళ్ళు వెళ్ళిపోయేదాకా ఇక్కడే వుండాలి."

"వద్దు. నాకు భయం."

"డామిట్. నేను చెప్పినట్లు వినకపోతే మనిద్దరినీ చంపేస్తారు."

"నాకు భయంగావుంది ఇక్కడ ఉండటానికి."

"నీ ఇష్టం, వెళదామంటే నా కభ్యంతరంలేదు."

"వెళదాం."

"కాని ఒక్క సంగతి. నేను మొగవాణ్ణి. నన్ను మామూలుగా చంపుతారు నేను వాడిని చంపినట్లుగా. నువు ఆడదానివి. నిన్ను పుట్టినే ఇలా కత్తిదింపి చంపరు. అసలు చాలాకాలందాకా చంపరు."

భయంగా చూసింది కులకర్ణి కళ్ళలోకి.

"నిజంగానా?" అడిగింది.

"అవును."

"ఓ గాడ్."

"వాళ్ళు వెళ్ళేదాకా ఆగుదాం."

"అలాగే అయితే."

తిరిగి వెళ్ళేటప్పుడు, అందరూ వున్నారో, లేరో వాళ్ళు లెక్క చూసుకుంటే, ఒకడు తక్కువైనాడని తెలిసి పోతుంది. అప్పుడు ఓడంతా వెదికితే?

"వీడు ఎంతసేపటికీ తిరిగి రాకపోతే మిగతావాళ్లు వెదకరూ?" అడిగింది గ్లోరియా.

కులకర్ణి సమాధానం చెప్పలేదు. ఆ లోడింగ్ రూమ్‌లోని సామానువంక పరకాయించి చూశాడు, తనకి ఉపయోగ పడేవి ఏమైనా వున్నాయేమోనని.

అలా జరుగుతే ఏంచేయాలా అని ఆలోచిస్తున్నాడు. పోర్ట్ హోల్స్ లేవు ఆ గదికి, కేబిన్స్‌లోలాగా. ఉంటే శవాన్ని బయటకి, సముద్రంలోకి తోసెయ్యొచ్చు.

ఏ క్షణంలోనయినా తలుపు చప్పుడు వినబడొచ్చనే భయంతో ఇద్దరూ నిశ్శబ్దంగా వుండిపోయారు చెవులు రిక్కించి.

ఎంతసేపు గడిచిందో వాళ్ళకే తెలియదు. అకస్మాత్తుగా రివాల్వర్ షాట్స్ విన్నారు.

ఆరు.

వెంటనే కలవరం. ఏడుపులు. పెడబొబ్బలు. చాలామంది పరిగెత్తుతున్నట్లుగా అడుగులచప్పుడు. మరికొన్ని రివాల్వర్ పేల్పులు.

గ్లోరియా భయంగా వదిగిపోయింది కులకర్ణి మీదకి. వణుకు, భయం ఎక్కువయ్యాయి.

"భయపడక. భయపడక," అన్నాడు కులకర్ణి తనగుండె కొట్టుకునే చప్పుడు తనకే వినబడుతూంటే.

దబదబ ఎవరో బాదుతున్న చప్పుడు వినిపించింది. కదల లేదు ఇద్దరూ. అలాగే కూర్చుండి పోయారు.

చెవులు చిల్లులుపడేలా పెద్దకేక. ఆ కేకతోపాటు తలుపు కొట్టే చప్పుడు.

"చంపి వెళ్తున్నట్లున్నారు ఎవరినో" అన్నాడు కులకర్ణి.

ఎంతసేపు అలా ఒదిగి కూర్చున్నారో వాళ్ళకే తెలియదు. చాలాసేపటి తర్వాత, క్రమంగా హడావిడితగ్గి నిశ్శబ్దం తిరిగి వచ్చింది.

"వెళ్ళిపోయి నట్లున్నారు" అన్నాడు కులకర్ణి.

"అవును."

"బయటకి వెళ్దామా?"

"వద్దు. కాస్సేపు ఆగి వెళదాం."

పావుగంట తర్వాత తలుపు తెరిచారు బయటకి వెళ్దామని. నల్లటిపొగ ఒక్కసారిగా లోపలకి వచ్చింది గుప్పున.

చటుక్కున తలుపుమూసి అన్నాడు కులకర్ణి దగ్గుతూ.

"అంటుకుంది."

"ఓడా?"

"అవును. తగలబెట్టి వెళ్ళినట్లున్నారు."

"మనం బయట పడేదెట్లా?" ఖంగారుగా అడిగింది గ్లోరియా.

లోడింగ్ రూమ్‌లోంచి బయటపడటానికి మరోదారిలేదు, ఆ తలుపు తప్ప.

"నా వెనకరా. కళ్లు తెరవక. కళ్లు మూసుకుని నా వెనకేరా, నాచెయ్యి పట్టుకుని."

గ్లోరియా కులకర్ణిచేతిని పట్టుకుని తలుపు తెరవగానే కళ్లు మూసుకుంది.

ముందుకు కదిలాడు ఫలకర్ణి. కాళ్ళకింది మెత్తగా తగిలింది ఎవరిదో శరీరం. ఎవరో చూడటానికి ఆగకుండా ముందుకి కదిలాడు గబగబా.

చెక్క మెట్లు ఎక్కి పైకివచ్చాడు. వేడి వంటికి తగలక పోవడంవల్ల ఎక్కడో నుంచో పొగ వస్తోందని గ్రహించాడు. పైకివచ్చాక చూసాడు. డెక్ వైపునుంచి వస్తోంది నల్లటిపొగ పొరలు పొరలుగా.

ఎదురుగా పొడుగ్గా కారిడార్. కొన్ని తలుపులు తెరచి వున్నాయి. నలుగురయిదుగురు కారిడార్‌లో పడివున్నారు అచేతనంగా. వీపుల్లో, ఛాతీమీద ఈటెలు, బాణాలు దిగి వున్నాయి. నిర్ఘాంతపోయాడు ఆ దృశ్యం చూసి.

డెక్ మీదకి నడిచాడు. మొదటి అడుగు వేయగానే ఆగి పోయాడు. నేలంతా ఆకు పచ్చరంగులో లేదు ఎప్పటిలా. ఎర్రరంగు వేయబడివుంది.

రక్తంతో ఎర్రరంగు వేయబడివుంది. ఏభైమంది పైనే పడి వున్నారు నేలమీద, అవయవాలు తెగి.

గ్లోరియా కళ్ళు తెరిచి చూసి మళ్ళీ కళ్ళు మూసుకుంది వెంటనే గజగజ వణకిపోతూ.

వెర్రికేక వేసి జారిపోయింది నేలమీదకి. వంగిచూశాడు ఫలకర్ణి అదుర్దాగా గ్లోరియాని.

స్పృహతప్పింది అంతే. కడుపులో తిప్పినట్లుగా అయింది ఫలకర్ణికి. ఆపుకుందామని ప్రయత్నించాడు కాని ఆగలేదు.

ఆ దృశ్యాన్ని చూడగానే వాంతి అయింది. రెండు చేతులతో రెండు చెవులు మూసుకుని నేలమీద కూర్చుండి పోయాడు.

మాంసం కాలుతున్న వాసన భరించలేక గ్లోరియాని

రెండు చేతులతో ఎత్తుకుని డెక్ మీదనించి కిందకిదిగిపోయాడు. ఎవరూ బ్రతికి వున్నట్లు లేరు. ఓడ మొత్తానికి తామిద్దరమే బ్రతికి వున్నట్లుగా అనిపించింది కులకర్ణికి.

"ఎవరయినా బ్రతికి వున్నారా?" అరిచాడు కులకర్ణి గట్టిగా, నోటిదగ్గర రెండు చేతులూ అడ్డంపెట్టి స్పీకర్ లా చేసి.

సమాధానం లేదు.

మళ్ళీ అరిచాడు ఇంకోసారి.

అయినా సమాధానం లేదు.

ఓసారి గ్లోరియావంక చూసి కదిలాడు. గ్లోరియాకి స్పృహ వచ్చేలోపల, ఓడంతా తిరిగి ఎవరయినా తమలా బ్రతికి ఉన్నారేమో చూడాలని కదిలాడు కులకర్ణి.

ముందర కేబిన్స్ అన్నీ వెదికాడు. చిన్న పిల్లలనికూడా వదలకుండా చంపారు ఆ సముద్రపు దొంగలు. చాలా కేబిన్స్ ఖాళీగా వున్నాయి. దాక్కున్న వాళ్ళని తలుపులు బ్రద్దలుకొట్టి చంపారు.

చనిపోయిన అందరి మొహాల్లో భయం స్పష్టంగా కనపడు తోంది. మొహాలమీదనుంచి చావుకి దగ్గరయ్యామనే భీతి చెరిగిపోలేదు, చచ్చిపోయినా.

మొత్తం తిరిగిచూసాడు కాని ఎవరూ బ్రతికిలేరు. ఇంజన్ రూమ్ ఖాళీగావుంది. రేడియో రూంలోకి వెళ్ళాడు. ఏర్ కండిషన్డ్ మెషీన్ ఆగిపోవటంవల్ల లోపల చల్లగాలేదు.

రేడియోమేన్ తనకుర్చీలో కూర్చుని వున్నాడు. కదల కుండా తాళ్ళతో కట్టేసి వున్నాడు. మూలుగుతున్నాడు విపరీతమయిన బాధతో.

కులకర్ణి అలికిడివిని తల తిప్పిచూసాడు. మనిషి మొహం వెంటనే గుర్తుపట్టలేకపోయాడు కులకర్ణి. ఎర్రగావుంది.

నెత్తురుతో తడిసిపోయి ఎర్రగావుంది. చర్మం కనబడటం లేదు ఎక్కడా.

కనుగుడ్లుకానీ, కనురెప్పలుకానీ లేవు. కళ్ళు తెల్లగా వున్నాయి.

"ఎవరు చేసారిలా?" అడిగాడు ఫలకర్ణి.

"చంపు. నను చంపేయ్. ఈబాధ భరించలేను. నీకు పుణ్యం వుంటుంది. నన్ను చంపేయ్."

దీనంగా, నూతిలోంచి వచ్చినట్లుగా వచ్చాయా మాటలు.

అలాగే చూస్తూండిపోయాడు ఫలకర్ణి అతని శరీరంవంక. ముఖం మీదేకాదు. ఒంటిమీద ఎక్కడా చర్మంలేదు. బత్తాయి తొనమీది చర్మం వలిచి తీసేసినట్లుగా తీయబడివుంది అంతటా.

"ఎలా జరిగింది?" అడిగాడు ఫలకర్ణి.

"దయచేసి నన్ను చంపేయ్."

ఫలకర్ణి దగ్గరిలో చచ్చిపడివున్న ఒకవ్యక్తి గుండెలో దిగిన కత్తిని బలంగాలాగి రేడియోమేన్ గుండెల్లో దింపాడు రెండుసార్లు బలంగా.

అతను చావడం తథ్యం. ఒంటిమీద చర్మం అంతా పోయిన తర్వాత, డాక్టర్ సహాయం లేకుండా ఎక్కువ కాలం బ్రతకలేడు ఆ ఓడలో.

బ్రతికినన్ని గంటలు చిత్రవధ అనుభవిస్తూ చచ్చేకంటే తనే వెంటనే చంపేయటం మేలనే నిశ్చయంతో, అలా చంపటం అతనికి సహాయం చేయడమనే నమ్మకంతో చంపేసాడు ఫలకర్ణి.

చంపాక చూసాడు ఆ పురుగుని.

ఎర్రరంగులో ఉందాపురుగు. అంగుళంపొడవున, చూపుడు

వ్రేలంత లావుగా ఉందా పురుగు. ఒకవైపు ఆకుపచ్చరంగులో ఉంది గుండ్రంగా. కనుగుడ్డు అనుకున్నాడు ఫలకర్ణి ఆ గుడ్డుని చూసి.

నెమ్మదిగా, అతి నెమ్మదిగా కదులుతోందా పురుగు. చర్మం మీద కదులుతూ, చర్మాన్ని మాత్రమే వలిచి తింటూ నెమ్మదిగా కదులుతోందా పురుగు. పురుగు పాకినచోట గుర్తుగా చర్మంలేదు పొడవునా.

అలాంటివే మరో రెండు పురుగులు రెండు కాళ్ళమీదా పాకుతున్నాయి. ఫలకర్ణి కత్తితో ఆ పురుగుని అడ్డంగా మధ్యకి కోసాడు కసిగా.

రెండుగా విడిపడ్డా చావలేదా పురుగు. కొంచెంసేపు కదలకుండా ఆగిపోయింది భయంగా. తర్వాత కదిలింది. రెండు భాగాలు ఒకదాని వెనక ఒకటి కొంతదూరం కదిలాయి. రెండో భాగం మరోవైపు తిరిగింది కనుగుడ్డు లేక పోయినా.

కత్తితో మిగతా రెండు పురుగుల్ని కూడా కోసాడు ఫలకర్ణి అడ్డంగా. అదేవిధంగా జరిగింది కాని చావలేదు. కత్తితో ఆ మూడింటినీ చిన్నాభిన్నం చేసేసాడు ఫలకర్ణి అవి మరి కదల్లేనంతదాకా.

పూర్తిగా చచ్చిపోయాయని నిశ్చయించుకున్న తర్వాత కదిలాడు బయటకి.

గ్లోరియాకి ఇంకా స్పృహరాలేదు. అలాగే పడివుంది. గ్లోరియా ప్రక్కన మోకాళ్ళమీద కూర్చునున్న ఒకతను వంగి గ్లోరియావంక చూస్తున్నాడు.

ఫలకర్ణి చప్పుడు చేయకుండా కదిలాడు అతనివైపు. అతన్ని ఎప్పుడూ ఓడలో చూడలేదు ఫలకర్ణి అంతదాకా.

కొద్దిగా ఉలిక్కిపడ్డాడు అతను, అకస్మాత్తుగా కులకర్ణి ప్రత్యక్షం అవగానే. కులకర్ణివంక పరిశీలనగా చూసి స్నేహపూర్వకంగా నవ్వాడు అతను.

"ఎవరు నువ్వు?" అడిగాడు కులకర్ణి అతన్ని.

"నువ్వెలా తప్పించుకున్నావు?" అడిగాడు అతను కొద్దిగా ఆనందంకూడిన ఆశ్చర్యంతో.

"నా ప్రశ్నకి సమాధానం చెప్పనేలేదు" అన్నాడు కులకర్ణి, అతని చేతికున్న ఇనుప గొలుసులవంక చూస్తూ.

"నేను 'సీకింగ్' అనే ఓషన్ లైనర్ కెప్టెన్ ని. ఖర్మవశాత్తు ఆ మొంబాసాల చేతిలో చిక్కుకున్నాను."

"మొంబాసా?"

"మొంబాసా అనేది ఓ తెగ."

"ఎవరు వాళ్ళు?"

"ఇక్కడే దగ్గరలోవున్న ఓ ద్వీపంలో వుంటారు వాళ్లు. మొంబాసా అనేది ఓ తెగ. సముద్రంలో అక్కడక్కడ చిన్నచిన్న ద్వీపాలుంటాయి. కాని అవి వాసయోగ్యమయినవికావు. మైలులోపే ఉంటాయి విస్తీర్ణంలో."

"వాసయోగ్యం కాకపోతే ఎలావుంటారు మొంబాసా జాతివాళ్లు మరి?"

"వీళ్ళుంటున్న ద్వీపం వక్కటే దురదృష్టవశాత్తు మానవులు బ్రతికేందుకు అనువుగావుంది."

"నీకు తెలుసా ఎక్కడుందో అది?"

"తెలుసు. కాని సరిగ్గా ఫలానచోట అని తెలీదు. ఏభై మైళ్ళ లోపలో ఉంటుంది అది యించుమించుగా. ఇన్నాళ్లు నన్ను ఖైదీగా ఉంచారు అక్కడవాళ్లు."

"వాళ్ళేనా ఈ సముద్రపు దొంగలు?"

"అవును. వాళ్ళవృత్తే దొంగతనం తాతముత్తాతలనుంచి. ఇంతవరకూ వాళ్ళ ఉనికి ప్రపంచానికి పూర్తిగా తెలియక పోవడంవల్లనే వాళ్ళు అనాగరికులుగా, ఈ విధంగా దాడి చేసి, దొరికిన వస్తువులతో బ్రతుకుతున్నారు."

జేబులోంచి లక్కీస్ట్రైక్స్ తీసి వెలిగించి అన్నాడు కులకర్ణి.

"ఇప్పుడేం చెయ్యాలి?"

గ్లోరియా కొద్దిగా కదిలింది.

"గ్లోరియా" పిల్చాడు కులకర్ణి.

కళ్ళు తెరచి చూసింది గ్లోరియా ఇద్దరివంకా.

"ఎలావుంది?" అడిగాడు.

"మా నాన్నకి ఏమయింది? కనబడ్డాడా?" అడిగింది గ్లోరియా ఆదుర్దాగా.

సమాధానం చెప్పకుండా తలవంచుకున్నాడు కులకర్ణి. గ్లోరియా నాన్నని చూసాడు గుండెలో అయిన గాయంతో సహా. మరణించారు ఆయన.

"చెప్పు కర్ణి. బ్రతికే వున్నారా?"

"ఐయామ్ సారీ" అన్నాడు కులకర్ణి.

గ్లోరియా లేచి కూర్చుంది. మోకాళ్ళలో తలదూర్చి వెక్కి వెక్కి ఏడవసాగింది.

అమెరికన్ లేచి రేడియోరూంలోకి వెళ్ళాడు. కొన్ని క్షణాలు చూసాడు రేడియోమేన్ వంక. అతని కుర్చీని ఓ మూలకి తోసి, మైక్ స్విచ్ ఆన్ చేసి ట్రాన్స్‌మీటర్ వంక చూసాడు నిశితంగా.

గొడ్డళ్ళతో సెట్ పగలకొట్టారు అక్కడక్కడ. వైర్లు కోసేసారు. పనిచేస్తుందనే నమ్మకం లేకపోయినా ప్రయత్నించాడు అమెరికన్ పావుగంటదాకా.

విసిగి బయటకి నడిచాడు.

"లైఫ్ బోట్స్ రెండున్నాయి. చూసొచ్చాను. మనం కదలడం మంచిది" అన్నాడు కులకర్ణి.

"అవును. ఈ ఓడ ఇక కదలదు" అని పొగవంక, దూరంగా ఓమూల అంటుకుని మండుతున్న మంటలవంక చూసి అన్నాడు ఆ అమెరికన్. "మూడు రోజుల్లో ఓడంతా కాలిపోతుంది. బూడిద నీళ్ళలో కరిగి కలిసిపోతుంది. కాలని ఇనపసామానులాంటివి సముద్ర గర్భంలోకి చేరతాయి."

మరోసారి ఎవరయినా బ్రతికి వున్నారేమోనని చెక్ చేసుకుని తమకి ఉపయోగించే ముఖ్యమయిన సామాను కొంత సంపాదించారు మగవాళ్ళిద్దరూ ఓడంతా వెదకి.

దిక్సూచి, ట్రాన్సిస్టర్, ఫ్లేర్ గన్, రివాల్వర్స్, మరి కొంత నేవిగేషన్ ఎక్విప్ మెంట్, మేప్ బుక్, పెన్సిల్స్ ఇంకా ముఖ్యమనుకున్న సామానంత లైఫ్ బోట్ లోకి చేర్చాడు అమెరికన్.

వాళ్ళు చూడకుండా వదిలివెళ్ళిన కేన్డ్ ఫుడ్, బిస్కట్స్, రెండు విస్కీ సీసాలు, నాలుగు బ్రాందీ బాటిల్స్, సిగరెట్ పాకెట్స్, నాలుగయిదు కత్తులు, చచ్చిపోయిన మొంబాసా జాతివాళ్ళ ఒంటిమీద పూసలదండలు, బ్లాంకెట్స్, ఫస్ట్ ఎయిడ్ కిట్, పేపర్లు, కలాలు మొదలయిన వస్తువులని లైఫ్ బోట్ లోకి చేర్చాడు కులకర్ణి.

జలనిధి ఓడకి తాళ్ళతో కట్టివున్న లైఫ్ బోట్ ని జాగ్రత్తగా దింపారు నీళ్ళలోకి. గ్లోరియాని దింపారు ముందర తాళ్ళతో చేసిన నిచ్చెనద్వారా దాంట్లోకి.

తర్వాత ఆ అమెరికన్ పెట్రోల్ టిన్స్ లోంచి పెట్రోల్ అంతా తీసి ఓడలో చాలాచోట్ల చల్లాడు. పెద్దటవల్ ని

పెట్రోల్‌తో తడిపి దాంతో లైఫ్‌బోట్‌లోకి దిగాడు.

వెనకాల ఫలకర్ణి దిగాడు షిప్‌లోంచి లైఫ్‌బోట్‌లోకి జాగ్రత్తగా. జలనిధికి వేలాడుతున్న తాళ్ళని కోసి లైఫ్ బోట్లలో జాగ్రత్త చేశారు.

మగవాళ్లు ఇద్దరు గబగబా తెడ్లు వేయసాగారు. కొంత దూరం వెళ్ళాక అమెరికన్ ఓ ఖాళీ బాటిల్‌లోకి పెట్రోలితో నింపిన తువ్వాలని దూర్చి, కొనను అంటించి, బలంగా షిప్‌లోకి విసిరాడు ఆ మండుతున్న తువ్వాలవున్న సీసాని.

మళ్ళీ తెడ్లు వేయసాగారు. కొంచెందూరం పడవ వెళ్ళగానే పెద్దపెట్టున మంటలు లేచాయి, జలనిధిలో.

"ఎందుకు?" అడిగాడు ఫలకర్ణి.

"ఓడ తగలబడటానికి. మూడురోజుల్లో వర్షం వస్తేమంట ఆరిపోవచ్చు. ఇంకో పదిగంటల తర్వాత బూడిద తప్ప మరేమీ మిగలదు అక్కడ ఇప్పుడా మంటలకి."

గ్లోరియా ఏడుస్తోంది ఇంకా.

"టైం ఎంతయింది?" అడిగాడు ఫలకర్ణిని అమెరికన్.

రేడియండయల్ వంక చూసుకుని చెప్పాడు.

"మూడున్నర."

"తెల్లవారడానికి ఇంకా రెండుగంటలువుంది. అప్పటిదాకా కారుచీకటి తప్పదు" అన్నాడు అమెరికన్.

క్రమక్రమంగా దూరం అయిపోతున్న కాలిపోతున్నఓడ వంక చూస్తూ ఏడుస్తోంది గ్లోరియా.

ఒక్కసారిగా పేలింది జలనిధి పెద్దచప్పుడుతో. ఓడ లోంచి మంటలు పెద్దపెట్టున లేచి సముద్రంమీదకి కూడా పాకాయి. త్వరగా కాలిపోతోందా వోడ ఇప్పుడు.

"ఫ్లూయల్ టేంక్స్, రిజర్వ్ టేంక్స్ అంటుకుం

టున్నాయి'' అన్నాడు అమెరికన్.

నిశ్చలంగావున్న నీళ్ళవంక చూస్తూ ఆలోచిస్తున్నాడు అమెరికన్.

సిగరెట్ వెలిగించాడు ఫలకర్ణి.

# 4

సూర్యకిరణాలు చురుక్కుమని తగలగానే మెలకువ వచ్చింది ఫలకర్ణికి. బద్ధకంగా కళ్ళు తెరిచాడు. ఎదురుగా నీలంరంగు ఆకాశం నిర్మలంగా కనిపించింది.

చేతిగడియారంవంక చూసుకున్నాడు.

పదిన్నర దాటింది ఉదయం.

"అబ్బ చాలాసేపు పడుకున్నాను" అన్నాడు ఆవలిస్తూ లేచి కూర్చుని.

"నేనూ ఇప్పుడే లేచాను" అన్నది గ్లోరియా.

చుట్టూ చూసాడు. నీళ్లు. ఎక్కడ చూసిన నీళ్లు తప్ప మరేమీ కనపడటంలేదు. ఆగివున్నది పడవ. అమెరికన్ మేప్స్ చూస్తున్నాడు దీక్షగా.

"ఎక్కడ ఉన్నాం?" అడిగాడు.

"సముద్రంమీద" చెప్పింది గ్లోరియా చిన్నగా నవ్వి, బ్రష్‌తో తన బాబ్డ్ హేర్ దువ్వుకుంటూ.

"నా అంచనా సరయినదే అయితే 80 డిగ్రీల ప్రాంతంలో పెర్త్‌కి రెండువేల కిలోమీటర్ల దూరంలో వున్నాము. చుట్టు ప్రక్కల చిన్నచిన్న ద్వీపాలు నాలుగయిదు దాకా వుండాలి."

అమెరికన్ చేతికి; కాళ్ళకి ఉన్న ఇనుపగొలుసుల వంక చూసి అడిగాడు ఫలకర్ణి.

"ఆ గొలుసులు వాళ్ళే వేసారా?"

"అవును. తమజాతికి చెందనివా డెప్పుడైనా కనబడితే ముందర సంకెళ్ళు వేస్తారు ఈ విధంగా."

"తర్వాత చంపేస్తారా?"

"సాధారణంగా చంపేస్తారు. వాళ్ళలో చాలామంది నర మాంసానికి అలవాటు పడ్డవాళ్లు. తింటారు చంపి."

"నరమాంస భక్షకులా?"

"అవును. ముఖ్యంగా ఆడవాళ్ళంటే ఎక్కువ ఇష్టపడ తారు తినడానికి."

"రుచిగా ఉంటారనుకుంటాను మొగవాళ్ళకన్నా, చూపులకే కాకుండా, జిహ్వాకికూడా."

గ్లోరియాకి ఆ జోక్ నచ్చలేదు. సముద్రంకేసి చూస్తూండి పోయింది విసుగ్గా.

"మనం ఎంతకాలం ఇలా ఇక్కడ కాపరం చేయాలి?" అడిగాడు కులకర్ణి.

"దేముడు కరుణించేదాకా."

"ఎప్పుడు కరుణిస్తాడో?"

"ఏమో మరి. నావూహ నిజమయితే మనం ఓడలు తిరిగే అంతర్జాతీయ మార్గంలో ఉన్నాము. ఏ ఓడయినా మనల్ని చూసి పికప్ చేసుకోవచ్చు."

"రాత్రి అయితే గుర్తించలేం."

"ఓడ కనబడితే చాలు. ఫ్లేర్ గన్ వుంది మనదగ్గర. సిగ్నల్ గా పని చేస్తుంది అది."

గ్లోరియా నీళ్ల బాటిల్ అందించింది కులకర్ణికి. బిస్కట్స్ తింటూంటే అడిగాడు అమెరికన్ కులకర్ణిని, రివాల్వర్ అందించి.

"ఎలా పేల్చాలో తెలుసా?"

తల అడ్డంగా వూపాడు కులకర్ణి.

"దీన్ని సేఫ్టీ కేచ్ అంటారు. ఆఫ్‌లోవుంది. ఇటువైపు తీస్తే ఆన్‌లోకి వస్తుంది. ట్రిగర్ నొక్కాలి. మేగజైన్ ఛాంబర్ ఇది. కేట్రిజెస్ వుండేచోటు ఇది."

"బావుంది."

"నా చెయిన్స్‌కి గురిపెట్టి పేల్చు. వాటిని తెంచేసుకోవాలి."

"తెగుతాయా?"

"తప్పకుండా."

అమెరికన్ చేతులని ప్రక్కకిచాపి, గోలుసుని బోటు అంచుకు ఆనించాడు జాగ్రత్తగా.

కులకర్ణి రెండుసార్లు పేల్చాడు రివాల్వర్‌ని, బేరల్ చేయిన్‌కి రెండంగుళాల దూరంలోవుంచి.

చెయిన్ తెగింది. అమెరికన్ రివాల్వర్ అందుకుని, తన కాళ్ళకున్న చెయిన్‌నికూడా తెంపుకున్నాడు.

"సిగరెట్ కావాలా?"

సిగరెట్ అందుకుని, వాసనచూసి, వెలిగించాడు అమెరికన్.

"నేను రెండున్నర సంత్సరాలక్రితం చెయిన్ స్మోకర్‌ని. రోజుకి అరవై, డెబ్భై తక్కువ లేకుండా కాల్చేవాణ్ణి. వీళ్ళ చేతుల్లోపడ్డ కొత్తల్లో సిగరెట్ లేక ఎంతో అవస్థపడ్డాను. చచ్చిపోయేవాణ్ణి. ఇదే మొదటి సిగరెట్ రెండున్నర సంవత్సరాల తర్వాత వెలిగించేది."

"నీ పేరు?"

"జార్జ్ పెపర్డ్."

"జార్జ్ పెపర్డ్?"

"అవును. ఎందుకంత ఆశ్చర్యం?"

"హాలీవుడ్ ఏక్టర్ పేరుకూడా జార్జ్ పెపర్డ్."

"కావచ్చు. కాని నేను సినిమా ఎంచుకోలేదు నా కెరీర్‌గా. సముద్రయానం ఎంచుకున్నాను. పూర్తిగా గ్రహించాను నా కెరీర్ తప్పుగా ఎంచుకున్నానని. కాలేజీ రోజుల్లో నాకు నటన అంటే ఉత్సాహం వుండేది. ప్రయత్నించి వుంటే జార్జ్ పెపర్డ్ నేనే అయివుండేవాణ్ణి. ఏక్టర్ పెపర్డ్ కన్నా నేను పది సంవత్సరాలు పెద్ద."

గ్లోరియా నవ్వింది, ఈ పెపర్ మొహం తెరమీద కనబడితే ఎలా వుంటుందో వూహించుకుని.

"నువ్వేం చేస్తావ్?" అడిగాడు కులకర్ణిని అమెరికన్.

"నా పేరు కులకర్ణి."

"తెలుసు. నిద్రలేవకముందు గ్లోరియా చెప్పింది."

"మైసూర్ స్టేట్‌లో కాఫీ ఎస్టేట్ వుంది నాకు. కాఫీ ప్లాంటేషన్స్ చూస్తూంటాను ఇండియాలో."

"గుర్తుచేసావు. నాకు బెడ్ కాఫీ లేకపోతే ఉండలేను. తలకాయ నొప్పివస్తుంది" అన్నది గ్లోరియా.

"నాకూ అంతే. కాఫీ లేదా మన సామాన్లలో?" ప్రశ్నించాడు కులకర్ణి.

"లేదు."

"కాఫీ ఫ్లేవర్ వుండే చాక్‌లెట్స్ వుండాలి" అన్నాడు కులకర్ణి.

గ్లోరియా చాక్‌లెట్స్ డబ్బాతీసి కాఫీ డికాషన్ రంగు రేపర్ చుట్టివున్న చాక్‌లెట్స్ తీసి అందించింది ఇద్దరికీ, తను తీసుకుని.

"సముద్రపు దొంగల తెగ పేరు ఏదో చెప్పావు. ఏమి

టది గుర్తులేదు?" అడిగాడు వలకర్ణి.

"మొంబాసా."

"ఇంటర్నేషనల్ రూట్‌లో వెళ్ళే ఓడలని దోచుకునే వీళ్ళని ఏ ప్రభుత్వం ఇంతదాకా ఏం చెయ్యకుండా, తగిన చర్య తీసుకోకుండా ఉండటం విచిత్రంగావుంది" అన్నది గ్లోరియా.

"విచిత్రమే మరి. అసలింతవరకు మొంబాసాజాతి వుందని నాకు, మీకుతప్ప ఎవరికీ తెలియదు. తెలిసినవాళ్లు సముద్రంలో మునిగిపోతున్నారు. ఆ ద్వీపం ఎక్కడుందో ఎవరికీ తెలియదు."

"ఎంత ఉంటుందా ద్వీపం?"

"పాతిక మైళ్ళ విస్తీర్ణం ఉంటుంది. మైలు, అరమైలు కంటె సాధారణంగా ఎక్కువ విస్తీర్ణం వుండవు ఇక్కడ ద్వీపాలు. కాని మొంబాసా మాత్రం పాతిక మైళ్లు తక్కువ లేకుండా ఉంటుంది."

"ఎంతమంది వుంటారా జాతివాళ్ళు?"

"అయిదువందలమందికి తక్కువలేకుండా ఉంటారు. వాళ్ళలో తల్లి, సోదరి భావంవుండదు. పెళ్ళి అసలే లేదు. సంతానోత్పత్తే ప్రథమ కర్తవ్యం."

గ్లోరియా సముద్రంవైపు తల తిప్పింది ఆ సంభాషణ తనకి ఇష్టంలేదన్నట్టుగా.

"సంతానాన్ని కూడా లెక్క ప్రకారం ఉండేలా చూస్తారు. తమ ద్వీపం ఎంతమందికి సరిపోతుందో, అంత మందికంటెఎక్కువమంది అయితే చంపేస్తారు పుట్టగానే."

"ఆ ద్వీపంలో ఏం పండుతాయి?"

"తినడానికి పనికివచ్చేవి తక్కువ. పళ్ళు ఎక్కువగా

పండుతాయి. వాటిపేర్లు నాకు తెలియదు. ఆ ద్వీపంలో మాత్రం ప్రతీ అడుగు జాగ్రత్తగా వేయాలి.''

''అంత ప్రమాదమా?''

''అవును. అసలా ద్వీపవాసులు ఎలా తరతరాలుగా బ్రతక గలుగుతూ వచ్చారో నాకు అంతుపట్టదు ఎప్పటికీ. పాములు ఎక్కువ. తేళ్ళు ఎక్కువ. వాటివిషం భరింపరాని బాధ కలిగిస్తుంది.''

''ఎర్రరంగు పురుగులు గురించి తెలుసా?'' అడిగాడు కులకర్ణి.

''తెలుసు. ఆ ద్వీపంలోతప్ప మరెక్కడా చూడలేదు వాటిని. నీకెలా తెలుసు?''

''రేడియో రూంలో చూసాను.''

''అవును. తమతో తీసుకువస్తారు వాటిని దోపిడీ చేయడానికి వచ్చేటప్పుడు. మోస్ట్ పెయిన్‌ఫుల్ ఎండ్ డెడ్లీ. చావు తప్పదు. అయిదారు గంటలదాకా అది శరీరంమీద పాకుతూ చర్మాన్ని వలిచి తింటుంది.''

గ్లోరియా భయంగా చూసింది జార్జ్ వంక.

''ఆ ద్వీపంలోనే చాలా మూలికలున్నాయి. పాము కాటుకు పనిచేసే మూలికలు చాలావున్నాయి. ఆ ద్వీపం మధ్యలో చిన్నకొండవుంది.కొండకి అవతలివైపు మొంబాసా జాతి నివాసం. ఇవతలివైపు అంతా అడవి.''

''వాళ్లు దోపిడీచేసి తీసుకెళ్ళే సరుకంతా ఏంచేస్తారు?'' అడిగాడు కులకర్ణి కాస్సేపాగి.

''వాళ్లు దోపిడీకి రావడానికి ముఖ్యమయిన కారణం ఆహారం సంపాదించుకోడానికి. బంగారపు వస్తువులంటే ప్రీతి కాబట్టి వాటిని వదలరు. అంతా ఓ బిలంలో దాస్తారు.

మీరు చెప్తే నమ్మరేమోగాని,'' ఆగి అన్నాడు జార్జ్. ''వందల సంవత్సరాలనుంచి దోపిడీలో వాళ్ళు కొల్లగొట్టిన బంగారపు వస్తువులు, నాణాలు, వజ్రాలు, రాళ్ళు మొదలయినవన్నీ ఆ బిలంలో వేస్తున్నారు.''

చిన్నగా ఈలవేసి అన్నాడు కులకర్ణి.

''కొన్ని లక్షల ఖరీదుంటుదన్నమాట అదంతా కలిస్తే.''

''లక్షలా? కోట్ల ఖరీదుచేసే బంగారం, వజ్రాలు, రత్నాలు దొరుకుతాయి అక్కడ. వారికి వాటివిలువ తెలియక అలా పారేస్తున్నారు వాటిలో.''

''ఎలా తెలుసు ఈ సంగతి?'' అడిగాడు కులకర్ణి.

''చూసాను. కొండ ఎక్కితే చిన్న బిలం కనిపిస్తుంది. ఆ కొండకూడా సముద్రానికి ఆనుకునేవుంది.''

''ఆ ద్వీపవాసుల పేరేమిటన్నావ్?''

''మొంబాసా. పాముల్ని కూడా తింటారువాళ్లు. పూర్తిగా అనాగరికులు. మోటువాళ్లు. రాక్షసులు ఓ విధంగా. తమతో ముగ్గురు అమ్మాయిలని తీసుకు వెళ్ళారు.''

''తీసుకెళ్ళారా?'' గ్లోరియా అడిగింది వెంటనే.

''అవును. అమ్మాయిలని తీసుకెళ్తామంటేనే అసలుగొడవ ప్రారంభం అయింది.''

''ఏంచేస్తారు వాళ్ళని'' అడిగాడు కులకర్ణి.

''అనుభవించినంతకాలం అనుభవించి, నెల తప్పగానే చంపి తింటారు అంతాకలసి.''

గ్లోరియా మళ్ళీ సముద్రంవైపు తిప్పుకుంది తల.

చాలాసేపు మౌనంగా వుండిపోయారు ముగ్గురూ లైఫ్ బోట్‌లో, ఎవరి ఆలోచనలలో వాళ్లు.

చుట్టూ వేల కిలోమీటర్ల దూరంలో అంతా నీళ్ళే.

మధ్యలో, లైఫ్ బోట్‌లో తాము ముగ్గురూ వున్నారు. తమకు తెచ్చుకున్న తిండి సామానంతా కలిస్తే వారం రోజుల దాకా మాత్రమే సరిపోతుంది. తర్వాత మండి చావాలి.నీళ్లు రెండు మూడురోజుల తర్వాత అయిపోతాయి. ఆకలితోకన్నా దాహంతోనే ఎండి ఛావాలి. గ్లోరియా భవిష్యత్తు గురించి ఆలోచిస్తోంది నిస్పృహగా.

ఏ స్టీమరయినా తప్పక వస్తుంది. తము తప్పక రక్షింప బడతారు. తను త్వరలో అమెరికా చేరుకోగలడు. తనకి రావల్సిన జీతం మొదలయినదంతా తీసుకుని ఏదైనా వ్యాపారంతో కొత్త జీవితం ప్రారంభించవచ్చు. జార్జ్ పెప్పర్డ్ భవిష్యత్తు గురించి కలలు కంటున్నాడు.

దేముడు ఎంత వున్నతుడు? ఇన్నివేల మైళ్ళకి సరిపడే నీరు ఎలా సృష్టించగలిగాడు? ఈ నీటిని ఉప్పగా మార్చి ఎందుకూ పనికిరాకుండా మార్చేసాడు ఎందుకు? అసలీ నీరు ఎక్కడ వుప్పును కరగించుకుంటోంది? ఈ సముద్రంలో ఎన్నివేల రకాల చేపలు వుండివుంటాయి? వర్తమానంలో తనకి వుపయోగించని సంగతుల గురించి బుర్ర బద్దలు కొట్టు కుంటున్నాడు కులకర్ణి.

జార్ పెపర్డ్ అన్నాడు కాస్సేపాగి ఇద్దరితో.

"ఓ చెయ్యి వెయ్యి. మరికొంతదూరం పోనిద్దాం బోట్‌ని. గ్లోరియా. నువు ఈ బైనాక్యులర్స్‌తో ఏదైనా ఓడ కనబడు తుందేమో చూడు."

గ్లోరియా అరగంటసేపు చుట్టుప్రక్కల చూసి విసిగి పోయింది. ఎంతచూసినా నీళ్లుతప్ప మరేం కనబడటంలేదు.

అలవాటు లేకపోవడంవల్ల కులకర్ణికి చేతులు నొప్పిపుడు తున్నాయి తెడ్లు వేసివేసి.

"ఇక నా చేతకాదు" అన్నాడు ఆపేసి.

"కాస్సేపు రెస్ట్ తీసుకుని మళ్ళీ తెడ్లువేద్దాం. వూరికే కూర్చుంటే ప్రయోజనం వుండదు" అన్నాడు జార్జ్ పెపర్డ్.

టిన్ కేన్స్ తెరచి బీన్స్‌లోవుండే గింజలు, పచ్చిబఠాణీలు, వుడకబెట్టిన చేపలు తిన్నారు ముగ్గురూ. ఖాళీకేన్స్ నీళ్ళలోకి విసిరేసారు.

కెప్టెన్ జార్జ్ పెపర్డ్ కాగితం కలం తీసుకుని, మొంబాసా ద్వీపం గురించి, ఆ ద్వీపవాసుల గురించి, బంగారం గురించి తనకి తెలిసిన వివరాలన్నీ వ్రాసాడు నాలుగయిదు తెల్ల కాగితాలమీద.

ఆ కాగితాలని గ్లోరియాకి అందించి అన్నాడు, గ్లోరియా, కులకర్ణి చదివాక.

"మన దగ్గరున్న తెల్లకాగితాలన్నీ వుపయోగించి ఈ కాగితాలకి కాపీలు తీయండి."

"దేనికీ?" అడిగాడు కులకర్ణి.

"మీకు కాలం గడుస్తుంది, తర్వాత ముందు తరాలవారికి వుపయోగిస్తుంది."

"ముందు తరాల వాళ్ళకంటే?"

"ఎవరికయినా. ఈ కాగితాలని ఖాళీ సీసాలలోవుంచి, నీళ్లు లోపలకి చొరపడకుండా లక్కతో సీల్ చేసి సముద్రంలోకి విసిరేస్తాను అక్కడక్కడ. ఎవరికయినా, ఎప్పుడయినా తప్పక దొరుకుతుంది, ఒకటి కాకపోతే మరొకటయినా. అప్పటికింకా ఆ ద్వీపం మేప్‌లోకి రాకపోతే, కనుక్కోలేకపోతే వుపయోగిస్తుంది."

"ఇది మీరు వుపయోగించే పద్ధతా?"

"అవును. సముద్ర ప్రయాణం చేసే వాళ్లు చైనాలాంటి

కమ్యూనిస్ట్ దేశాల్లో వుండేవాళ్లు ఇతరులకి ఏదైనా తెలియ చేయాలనుకుని, అలా తెలియచేసే అవకాశం లేకపోతే సీసాల్లో ఆ సమాచారంవుంచి సముద్రాల్లో పడేస్తారు. ఒక్కొక్కసారి అవి కొన్నివందలమైళ్ళు ప్రయాణంచేసి ఒడ్డుకు కొట్టుకువెళ్ళి మనుషులకిచేరిన సందర్భాలున్నాయి."

"ఓ. కె. నాకూ ఏం తోచడంలేదు. వ్రాస్తాను" అన్నది గ్లోరియా.

"ఇంకో సిగరెట్ ఇవ్వు."

జార్జ్ పెపర్డ్ కులకర్ణి దగ్గర సిగరెట్ అడిగి తీసుకుని వెలిగించాడు. ప్రక్కనే సామానువున్న రెండో లైఫ్ బోట్‌లో పడుక్కుని సిగరెట్ తాగుతూ ఆలోచిస్తూండి పోయాడు.

అయిదు నిముషాల తర్వాత ట్రాన్సిస్టర్ సంగతి గుర్తుకు వచ్చింది పెపర్డ్‌కి. వెతికితీసి ఆన్ చేసి ట్యూన్ చేశాడు. పది నిముషాల ప్రోగ్రాం తర్వాత వినబడింది.

"దిసీజ్ రేడియో ఆస్ట్రేలియా..."

ముగ్గురూ రేడియో ఆస్ట్రేలియా ప్రసారంచేసే డ్రామాని వింటూ మౌనంగా వుండిపోయారు.

మధ్యలో అన్నది గ్లోరియా వ్రాయడం ఆపి.

"రేడియో ఎనౌన్సర్‌గా పనిచేసేవాళ్ళు, పాటలు పాడే వాళ్లు ఎంతో అదృష్టవంతులు. వాళ్ళరూపం తెలియక పోయినా వాళ్ళకంఠం తెలుస్తుంది అందరికీ. వాళ్ళు వెళ్ళని, వెళ్ళలేని ప్రదేశాలకికూడా వాళ్ళకంఠంవెళ్ళి శ్రోతలని ఆనందపరుస్తుంది."

"అవును. ఇట్సే చార్మింగ్ జాబ్" అన్నాడు కులకర్ణి.

"సముద్రంమీద తిరిగే ఓడల్లోకాని ఉద్యోగం ఏదయినా

చ్యారింగ్ జాబే" అన్నాడు పెపర్డ్.

"తిమింగలాలు తిరుగుతుంటాయా ఈ చుట్టుప్రక్కల?" అడిగింది గ్లోరియా కాస్సెపాగి అకస్మాత్తుగా.

"తిరగచ్చు. సొరచేపలు తప్పకుండా వుంటాయి."

ఎండవేడి ఎక్కువయింది మధ్యాహ్నం అయినకొద్దీ. సాయంత్రం ఎండ తగ్గు ముఖంపట్టింది. చల్లటి గాలి వీచ సాగింది ఆహ్లాదంగా.

ట్రాన్సిస్టర్ ఆర్పేసి నిద్రపోతున్న పెపర్డ్‌ని చూసి అన్నాడు గ్లోరియాతో కులకర్ణి.

"నిద్రపోతున్నాడు పెపర్డ్."

"అయితే."

"కమాన్ డియర్."

మీదకి లాక్కున్నాడు గ్లోరియాని.

"వద్దు. పెపర్డ్ లేస్తే బావుండదు."

"బ్రతికి బయట పడతామనే నమ్మకం నాకులేదు. చావ బోయే ముందయినా ఆనందంగా గడుపుదాం."

గ్లోరియా పెపర్డ్ లేచి తమని చూస్తాడనే సిగ్గుతోనే జరిగింది కులకర్ణి వేపు.

"మనం దీనికోసం ఆ లోడింగ్ రూమ్‌లో దాక్కుని వుండకపోయినట్లయితే చచ్చిపోయి వుండేవాళ్ళం ఈపాటికి ఆ కిరాతకుల చేతిలో."

"బ్రతికి బయటపడితే మనం పెళ్ళిచేసుకుందాం కులకర్ణి."

"మనకి హిందూశాస్త్రప్రకారం ఎప్పుడో వివాహం అయిపోయింది. గాంధర్వ వివాహం అంటారను కుంటాను దాన్ని."

"గాంధర్వ వివాహమంటే?"

"అంటే ఇది."

గ్లోరియాని కదలకుండా తన కౌగిలిలో బంధించి నలిపేస్తూ ఉక్కిరిబిక్కిరవుతున్న కులకర్ణికి వినబడింది.

"మిష్టర్ కులకర్ణి. మీరు కాపీ చేసిన కాగితాలు ఇటివ్వండి. నాకేం తోచడంలేదు చూస్తాను."

గ్లోరియాని చటుక్కున వదిలేసి పెపర్డ్ వంక చూసాడు కులకర్ణి. కళ్ళు మూసుకునే వున్నాడు.

"నిద్రపోలేదా?" అడిగాడు.

"మెలకువ వచ్చింది" అని కంఠం తగ్గించి అన్నాడు మెల్లిగా. "ఇది లోడింగ్ రూమ్ కాదు."

గ్లోరియా సముద్రంవైపు తల తిప్పింది.

## 5

ఆ రాత్రి వంతుల ప్రకారం నిద్రపోవాలనే నిశ్చయించుకున్నారు ముగ్గురూ. రాత్రివేళ ఏదయినా ఓడ వెళ్తూ కనిపించినా, పైన విమానం వెళుతూ కనిపించినా సహాయం కోరాలని, వాటికోసం నిద్రమేలుకుని ఎదురు చూడాలని నిశ్చయించుకున్నారు.

ముందర గ్లోరియా రాత్రి ఎనిమిదినుంచి పదకొండుదాకా మేలుకుని వుంటుంది. తర్వాత పదకొండునుంచి రెండుదాకా జార్జ్ పెపర్డ్ మేలుకుని వుంటాడు. రెండునుంచి ఉదయం ఆరుగంటలకి లేచేదాకా కులకర్ణి మేలుకుని ఉంటాడు.

ఓడకాని, విమానంకాని కనిపిస్తే ఫ్లేర్ గన్ ఉపయోగించి చీకట్లో ఆకాశంలోకి, సూటిగా పైకి పేల్చాలి గన్ని. ఏ విధంగా పేల్చాలో చూపించాడు జార్జ్ పెపర్డ్ ఇద్దరికీ.

"ఆకాశంనిండా కాంతి వ్యాపిస్తుంది. దాదాపు నిముషందాకా వుంటుందా కాంతి. ఎరుపురంగు ఫ్లేర్స్ కాని, నీలంరంగుకానీ వస్తుంది. వెలుగులో మనల్ని చూస్తారు."

రాత్రి మళ్ళీ బిస్కట్స్, కేన్డ్ ఫుడ్, కాఫీ ఫ్లేవర్డ్ చాక్లెట్స్ తీసుకుని, నీళ్ళు తాగారు. గేలంతో చిన్న చేపల కోసం ప్రయత్నించారుగాని దొరకలేదు.

రాత్రి గ్లోరియా పదకొండుదాకా మేలుకుని చూసింది చుట్టుప్రక్కల వెలుగుకోసం. కాని ఉపయోగం లేకపోయింది. పదిన్నరదాకా కబుర్లు చెప్తూ మేలుకునే వున్నాడు కులకర్ణి.

పదకొండు గంటలకి పెపర్డ్‌ని లేపింది గ్లోరియా. పెపర్డ్ బైనాక్యులర్‌తో దీక్షగా చూడసాగాడు అన్నివైపులా ప్రతీ అయిదు నిముషాలకి.

రెండు గంట్లకి అయిపోతుంది పెపర్డ్ డ్యూటీ. ఒంటి గంటన్నరకి, అర్ధరాత్రి దూరంగా చాలాదూరంగా లైట్ల వెలుగు కనిపించింది.

బైనాక్యులర్స్‌లోంచి చూస్తే తప్ప కనపడనంత దూరంలో వుందా స్టీమర్. ఫ్లేర్‌గన్‌ని గాల్లోకి ఎత్తి, ఆకాశం లోకి గురిపెట్టి పేల్చాడు.

క్లిక్‌మంది. ఫ్లేర్ బయటకి వెళ్ళలేదు. మళ్ళీ నొక్కాడు. అయినా ఏమీ కాలేదు. ఆరుసార్లు నొక్కాడు మళ్ళీ. ఏమీ కాలేదు.

మేగజైన్ తెరచిచూసాడు.

ఖాళీ.

ఖాళీ ఫ్లేర్‌గన్ అది. లోపల ఫ్లేర్స్ లేవు. ఫ్లేర్‌గన్ లోడ్ చేయబడివుందీ, లేనిదీ తను చూసుకోలేదని గుర్తుకు వచ్చింది పెపర్డ్‌కి.

ఫ్లేర్‌గన్ ఇంజన్ రూమ్‌లో చూసి, లోడ్ చేయబడి ఉంటుందని అనుకున్నాడు హడావిడిలో. ఫ్లేర్స్ విడిగా ఉండివుంటాయి. అంటే ఇక అది నిరుపయోగమే. ఎంతో

బాధవేసింది పెపర్డ్ కి.

కులకర్ణిని లేపాడు పెపర్డ్.

"ఏమిటీ" కలత నిద్రలోంచి ఉలిక్కిపడిలేచి అడిగాడు కులకర్ణి.

"త్వరగా తెడ్లు వెయ్యి. స్టీమర్ వెళ్తోంది అటువైపు" చెప్పాడు.

"ఫ్లేర్ గన్?"

"లోడ్ చేసిలేదు అది."

బైనాక్యులర్స్ అందుకుని పెపర్డ్ చూపించిన వైపు చూసాడు కులకర్ణి.

నిజమే. లైట్లు కదులుతూ కనబడ్డాయి.

"రివాల్వర్ పేలిస్తే చప్పుడు వినబడుతుందేమో?"

"ముందర దగ్గరగా వెళ్ళాలి. లేకపోతే లాభంవుండదు. త్వరగా తెడ్లు వెయ్యి."

లైఫ్ బోట్ ని అటువైపు పోనిచ్చారు ఇద్దరూ తెడ్లసహాయంతో చేతనయినంత వేగంగా. గ్లోరియాకి మెలకువ వచ్చింది పడవ కదలికకి.

"ఏమిటి?" అని అడిగింది కళ్ళు నులుముకుంటూ.

"టార్చ్ లైట్ తీసుకుని ఆవైపువుంచి వెలిగించి ఆర్పుతూండు నేను మానమనేదాకా. రివాల్వర్ తీసుకుని నేను కాల్చమని చెప్పినప్పుడు కాల్చు ఆరుసార్లు. ప్రతిషాట్ కి రెండు నిముషాల వ్యవధినివ్వు."

"స్టీమర్ వుందా అటువైపు?" అడిగింది.

"అవును. క్విక్. బైనాక్యులర్స్ తో చూసి స్టీమర్ ఎటువైపు వెళ్తోందో చెప్పు."

గ్లోరియా బైనాక్యులర్స్ లోంచి చూసి చెప్తూంటే వేగంగా

తెడ్లు వేస్తున్నారు ఇద్దరూ వూపిరికూడా పీల్చుకోకుండా.

"అయిదుమైళ్ళ దూరంలో వుందనుకుంటాను" అన్నది గ్లోరియా.

"మన పడవ ఆ ప్రాంతంలో ఆపినా బావుండేది" అన్నాడు కులకర్ణి.

"నేను ఫ్లేర్స్ వున్నాయా, లేవా నన్ను సంగతి చెక్ చేసుకున్నా బాగుండేది. టార్చ్‌లైట్ వెలిగించి వుంచు. వాళ్ళు ఎవరైనా బైనాక్యులర్స్‌తో చూస్తూంటే కనబడచ్చు మనలైట్."

"రివాల్వర్ పేలుస్తాను ఇక" అన్నది గ్లోరియా.

"పేల్చు."

"ఢాం."

సముద్రంమీదవున్న నిశ్శబ్దాన్ని చంపింది రివాల్వర్.

"వినపడివుంటుందా?" అడిగింది గ్లోరియా బైనాక్యులర్స్ లోంచి చూస్తూ.

"నా కళ్ళముందుంచు గ్లాసెస్‌ని. ఎంత దగ్గరో చూసి చెప్తాను."

బైనాక్యులర్స్‌ని పెపర్డ్ కళ్ళముందుంచింది గ్లోరియా. స్టీమర్‌లోని దీపాలవంక చూసి అదిరిపడి అన్నాడు పెపర్డ్.

"మైగాడ్. ఇందాక నేను చూసినదానికన్నా చాలా దూరం వెళ్ళిపోయింది."

"అయితే వినబడివుండదా?"

"ఇంకోసారి పేల్చు. వినబడివుండదు."

మరోసారి రివాల్వర్‌ని పేల్చి గ్లోరియా నిశ్శబ్దాన్ని చంపింది.

అయిదు నిముషాలు గ్లాసెస్‌లోంచి కదులుతున్న స్టీమర్

వంక చూసి నిట్టూర్చాడు పెపర్డ్ దీర్ఘంగా.

"ఏమయింది? ఆగిందా?" అడిగాడు కులకర్ణి.

"అసలు కనబడటంలేదు."

ముగ్గురూ ఒకరి తర్వాత మరొకరు మార్చిమార్చి చూసారు కాని ఇందాక కనపడ్డ దీపాలు కనపడలేదు మళ్ళీ.

"వి హేవ్ లాస్ట్ ఎ గోల్డెన్ అపర్చునిటీ" అన్నాడు పెపర్డ్ మరోసారి దీర్ఘంగా నిట్టూర్చి.

పడవని ఆపారు, ఇద్దరూ తెడ్లువేయడం ఆపి. అలసిపోయారు, అప్పటికే వేగంగా తెడ్లు కదపటంవల్ల.

"అంటే మనం ఇంటర్నేషనల్ ఓషన్ ట్రాఫిక్ రూట్ దగ్గరలోనే వున్నామన్నమాట" అన్నాడు కులకర్ణి.

బ్యాటరీ లైట్ కాంతిలో దిక్సూచి చూసి చెప్పాడు పెపర్డ్.

"నార్త్ వైపు వెళ్తోంది అది."

"కాస్సేపు ప్రయత్నిద్దామా మళ్ళీ?" అడిగాడు కులకర్ణి ఇంకా ఆశ చావక.

"లాభంవుండదు. థర్టీ నాట్స్ వేగంతో వెళ్ళే ఆ స్టీమర్ని అందుకోవడం మన తరంకాదు."

"అయితే నేను నిద్రపోతాను" అన్నాడు కులకర్ణి లైఫ్ బోటులోకి వాలి. క్రమంగా ముగ్గురూ నిద్రలోకి జారుకున్నారు అరగంట వ్యవధిలో.

## 6

"పేరిస్‌లో నువ్వేంచేస్తావ్?" అడిగాడు పెపర్డ్, గ్లోరియాని మర్నాడు వుదయం, బ్రేక్ ఫాస్ట్ తీసుకుంటూ.

"ఆర్కిటెక్చర్ చదువుతున్నాను" చెప్పింది గ్లోరియా.

"ఇంకా ఎంతకాలం సముద్రంమీద?" కోపం, విసుగు

నిండిన కంఠంతో నిస్పృహగా అన్నాడు కులకర్ణి.

"దేముడు చల్లగా చూసేదాకా."

"ఆ స్టీమర్ పగలు కనపడినా బావుండేది. మనల్ని చూసివుండేవారు" అన్నది గ్లోరియా.

నీళ్ళబాటిల్స్ వంక చూసి అన్నాడు పెపర్డ్.

"నీళ్ళు మరోరోజు దాటితే అయిపోతాయి. నీళ్లు లేక మలమలమాడి చావాలి."

"సముద్రంనీళ్ళు త్రాగుదాము."

"పనికిరావు. జబ్బుచేస్తుందికూడా."

మొంబాసాదీవి గురించి వ్రాసిన వివరాలుగల కాగితాలని పొడిగావున్న ఖాళీసీసాలలోవుంచి, బిరడా బిగించి, తనతో తెచ్చిన లక్కతో సీల్ చేసాడు పెపర్డ్ నైపుణ్యంగా.

అది పూర్తిగా వాటర్‌ప్రూఫ్ అని నిశ్చయించుకున్నాక సీసాలలో ఒకదాన్ని నీళ్ళలోకి జారవిడచారు.

ఉదయం అంతా లైఫ్‌బోట్స్‌ని నడుపుతూనే వున్నారు మగవాళ్ళిద్దరూ. అక్కడక్కడ సీసాలని జారవిడుస్తూనే వున్నాడు పెపర్డ్.

సాయంత్రం అయేసరికి అలసిపోయారు ఇద్దరూ పూర్తిగా. గ్లోరియాకి ఏడుపు ఆగలేదు. మళ్ళీ ఏడవసాగింది ఇక దాచుకోవడం చేతకాక.

"దేనికి?" అడిగాడు పెపర్డ్ అనునయంగా.

"నేను చెప్పగలను. తండ్రిపోయాడు. నడిసముద్రంలో దిక్కు తెలియనిచోట, ప్రాణాలతో బయట పడతామో లేదో కూడా తెలియని పరిస్థితులలో వుండే ఏ ఆడదయినా ఏడుస్తుంది" అన్నాడు కులకర్ణి.

గ్లోరియా భుజంమీద చెయ్యివేసి అన్నాడు.

"ఏడవక. మనం తప్పకుండా బ్రతికి బయటపడతాం. నాకా నమ్మకం వుంది."

గ్లోరియాకి విస్కీ బాటిల్ తెరచి, అందించి అన్నాడు పెపర్.

"తాగు, హాయిగా నిద్రపో. మనసు పాడుచేసుకోకు."

గ్లోరియా నీళ్ళు కొద్దిగా కలుపుకుని రెండు పెగ్స్‌దాకా తాగింది విస్కీ. తాగి పెపర్‌కి అందించింది బాటిల్‌ని. పెపర్ మూడు పెగ్స్‌దాకా తాగి, సీసాని కులకర్ణికి అందించాడు. కులకర్ణి కూడా కొంచెం తాగి మూత బిగించాడు.

ముగ్గురికీ మత్తు ఆవహించింది క్రమంగా. హాయిగావుంది వళ్ళు తేలిపోతున్నట్లుగా. కూర్చుని కూర్చుని అవయవాలలో కదలిక, వాటికి ఎక్సర్‌సైజు లేకపోవటంవల్ల కలిగిన నొప్పి మర్చిపోయేలా చేసింది విస్కీ.

గ్లోరియా ఓ ఫ్రెంచ్ పాట అందుకుంది. రెండుచరణాలు అయాక తప్పట్లు కొట్టడం ప్రారంభించింది పాడుతూ.

మిగతా ఇద్దరుకూడా పాటకి లయగా తప్పట్లు కొట్టడం ప్రారంభించారు.

ఆ లైఫ్‌బోట్‌లోకి ఎక్కిన తర్వాత, మొదటిసారిగా వాళ్లు ముగ్గురూ తమ కష్టాలని మరచిపోయారు.

# 7

అర్ధరాత్రి వంటిగంటకు మెలకువ వచ్చింది జార్జ్ పెపర్‌కి. మత్తుగా వున్నా లేచి కూర్చున్నాడు. చల్లటిగాలి వీస్తోంది. క్రితంరాత్రి వున్నంత వెలుగుకూడా ఆ రాత్రి లేకపోవటం గమనించాడు పెపర్.

చీకట్లోనే తడిమి టార్చ్‌లైట్ అందుకుని వెలిగించి చూసాడు. ప్రక్కనేవున్న సామానువుంచిన లైఫ్‌బోట్‌లో

పడుక్కుని వున్నారు గ్లోరియా, కులకర్ణి దగ్గరదగ్గరగా.

కులకర్ణి చేతిమీదికి లైట్ వేసి చూసాడు టైం.

ఒంటిగంటదాటి పదినిముషాలయింది.

ఆకాశంవంక చూసాడు. పైన, ఆకాశంనిండా నల్లటి దుప్పటి అడ్డం కట్టినట్లుగా మబ్బులు. దట్టంగా అలుముకుని వున్నాయి మబ్బులు. ఎటుచూసినా, చూపు ఆనినంతదూరం నల్లటి మబ్బులు.

కులకర్ణిని తట్టిలేపాడు జార్జ్ పెపర్డ్.

"ఏమిటి?" అడిగాడు కులకర్ణి.

"మనం బయలుదేరాలి వెంటనే" చెప్పాడు.

"ఎక్కడికి?"

"ఆకాశంవంక చూడు."

కులకర్ణి ఆకాశంవంక చూసి చెప్పాడు.

"వర్షం కురిసేలా వుంది."

"అందుకే మనం త్వరగా కదలాలి."

"ఎక్కడికి ఇంతరాత్రి? రేపు వుదయం కదులుదాం ఎక్కడికయినా సరే."

"సముద్రంమీద వర్షం అంటే మాటలుకాదు. పెద్ద పెట్టున గాలివీస్తుంది. మెలు ఎత్తు అలలు లేస్తాయి. వర్షం కురిసేచోట చిక్కుకుంటే ఈ లైఫ్‌బోట్ ఎందుకూ పనికి రాదు. బోట్‌తోసహా మునిగి చచ్చిపోతాం."

"నిజంగా?" అడిగింది గ్లోరియా లేచి భయంగా.

"నిజంగానే."

"ఎటువైపు వెళ్ళాలి అయితే?" అడిగాడు కులకర్ణి కొంచెంసేపాగి.

ఒక టవల్‌ని బయటకితీసి, బోట్‌మీద నుంచుని గాలిలో

ఎగరేసి పట్టుకున్నాడు పెపర్డ్.

"అటువైపు" అన్నాడు గాలి ఏవైపు వీస్తోందో గ్రహించి.

లైఫ్‌బోట్‌కున్న చిన్న చుక్కానివైపు వీస్తోంది గాలి.

"అటు దేనికి?" అడిగింది గ్లోరియా.

"గాలితోపాటే మేఘాలుకూడా ప్రయాణంచేస్తాయి. గాలికి ఎదురుగా వెళ్తే, మేఘాలకి దూరం అవుతాము."

ఇద్దరూ గబగబా నడపసాగారు లైఫ్ బోట్‌ని గాలికి ఎదురుగా. గ్లోరియాకూడా సహాయంచేసింది వాళ్ళకి మరో తెడ్డు అందుకుని.

అరగంటదాకా మాట్లాడకుండా ముగ్గురూ తెడ్లువేసి బోట్ నడుపుతూండిపోయారు రొప్పుతూ.

సరిగ్గా ముప్పావుగంట తర్వాత గాలి వీచేవేగం అధికమయింది. బోట్ వేగం తగ్గిపోయింది ఎదురుగాలి అవటంచేత.

చల్లటిగాలి మరింత చల్లబడింది. ఉరుములు, మెరుపులు ఆకాశం గాఢాంధకారం అయిపోయింది.

"లాభంలేదు. ఇది తుఫానే" అన్నాడు పెపర్డ్. మొట్ట మొదటిసారిగా పెపర్డ్ కంఠంలో భయం ధ్వనించింది. లైఫ్ బోట్ వాళ్ళమాట వినలేదు. గాలిమాట విని వెనక్కి పోసాగింది, గాలిచేత తొయ్యబడి క్రమక్రమంగా అలా వెళ్ళే వేగంకూడా అధికమవసాగింది.

అంతదాకా నిశ్చలంగావున్న సముద్రపుటలలు వుప్పెత్తున లేవసాగాయి.

చినుకులు పడసాగాయి. వర్షం ప్రారంభం అయింది. కుంభవృష్టిగా వర్షం ప్రారంభం అయింది, పెద్దపెద్ద వడగళ్ళతో.

గాలితీవ్రత ఎక్కువయింది కాబట్టి గట్టిగా అరచి మాట్లా

డితేకాని ఒకరిమాట మరొకరికి వినపడటం గగనం అయి పోయింది.

పెపర్డ్ గట్టిగా అరచి చెప్పాడు ఇద్దరికి.

"ఈ తుఫాను తగ్గదు. ఎక్కువసేపు వుండదీ బోట్. మునిగిపోతుంది. జాగ్రత్తపడి లైఫ్ జాకెట్స్ తెచ్చాను ముందరే. తొడుక్కోండి వెంటనే."

తను లైఫ్‌జాకెట్ తొడుక్కుని మిగతా ఇద్దరికీ సహాయం చేసాడు పెపర్డ్.

"మామూలు పరిస్థితులలో అవుతే ఈ లైఫ్ జాకెట్‌లో వున్నంతకాలం మునిగిపోం.మన అదృష్టం ఎలావుందో ప్రయత్నిద్దాం. మన సామానుని ముగ్గురం పంచుకుని దగ్గర వుంచుకుందాం. అదృష్టవశాత్తు బ్రతికితే పనికివస్తాయి తర్వాత."

ముగ్గురూ విస్కీబాటిల్స్, నీళ్ళసీసాలు, ఆహారం టిన్స్ టవల్స్, కత్తులు, టార్చిలైట్ మొదలయినవి పంచుకున్నారు తమలోతాము. వాటిని వంటికి కట్టుకున్నారు పడిపోకుండా.

ఓ విస్కీసీసా ఓపెన్‌చేసి సగందాకా త్రాగి అన్నాడు పెపర్డ్.

"మీరూ త్రాగండి. చావటం తప్పనిసరయితే, ఏబాధా లేకుండా చచ్చిపోతాం మత్తులో. బ్రతికి బయటపడితే, అప్పటిదాకా ఈ భీభత్సం చూస్తూ గడపక్కరలేదు."

"నీళ్ళలో మునిగిపోతే, వుక్కిరిబిక్కిరయి చచ్చిపోతామా?" అడిగింది గ్లోరియా వణుకుతూ, సీసాని అందుకుని.

"మరింకెలా చస్తాం నీళ్ళలో చావాల్సివస్తే?" అన్నాడు కులకర్ణి విసుగ్గా.

"సొరచేపలు, తిమింగిలాలు, నీటిపాములు, మరికొన్ని విషంవుండే చేపలు. వీటి చేతనయినా చంపబడచ్చు" అన్నాడు పెపర్డ్.

గటగటా త్రాగేసింది గ్లోరియా సీసాలోని విస్కీని.

తమతో తెచ్చిన త్రాడుతో గ్లోరియాని తన నడుంకికట్టుకున్నాడు కులకర్ణి, విశ్వప్రయత్నంచేసి. అప్పటికే నిలువెత్తు లేచిన ఓ పెద్ద అలకి బోటునిండా నీళ్ళు చేరాయి.

క్రమంగా బోటు మునిగిపోతూంటే కొవ్వున అరుస్తున్న తన నడుంకి బలంగా త్రాడుతో బంధించాడు కులకర్ణి. రెండో కొనని పెపర్డ్ కాలికి కట్టాడు గట్టిగా, కాలు చిక్కితే.

బోట్ పూర్తిగా మునికిపోయింది తిరగబడి. ముగ్గురూ నీటిమీద, లైఫ్ జాకెట్‌లో తేలుతున్నారు ఇప్పుడు, నిలువెత్తునలేచే ఆ సముద్రంలోని అలలమీద.

కటిక చీకట్లో మెరుపు మెరిసింది. ఆ మెరుపు వెలుగులో చూశాడు కులకర్ణి ఎదురుగా, చాలా దూరంగా.

తెర.

నీటి తెర.

నిలువెత్తు_ఆకాశమంత ఎత్తు నీటి తెర.

చాలా పెద్ద కెరటం దూరంనుంచి తమవైపు వస్తోంది. కెరటం దగ్గరవుతున్నకొద్దీ దానిహోరు ఎక్కువవుతోంది.

ఆ క్షణంలో కదిలిపోయాడు కులకర్ణి. ఎంతో భయం వేసింది. సముద్రంలో, నిర్మానుష్యంగా వున్నచోటు, ఘోరమయిన తుఫానులో తను చిక్కుకున్నానన్న ఆలోచన కులకర్ణికి ఎంతో భయాన్ని కలగజేసింది.

కరటం తనని పూర్తిగా చేరుకునే లోపలే విస్కీ సీసా తెరచాడు జివ్ లాగి, జేబులోంచి.

# 8

ఉదయం ఎనిమిది గంటలయింది.

సూర్యకిరణాలు లోకంలోని సకల జీవరాసులమీద పక్షపాతం లేకుండా పడుతున్నాయి. సూర్యుడు అందరినీ మరోసారి పలకరిస్తున్నాడు పెద్ద, చిన్న తారతమ్యం లేకుండా.

ఆ సకల జీవరాసులలో గ్లోరియా, కులకర్ణి కూడా ఉన్నారు.

సూర్యకిరణాల తీక్షణత ఎక్కువవగానే మెలకువ వచ్చింది కులకర్ణికి, ఎవరో గిచ్చి లేపినట్లుగా.

లేచి కూర్చుంటే వళ్ళంతా భరింపలేని బాధగా అనిపించింది. వంటినిండా తెల్లతెల్లగా, స్ఫటికాల్లాగా ఉన్నాయి ఏమిటో.

చేత్తో దులుపుకోడానికి ప్రయత్నిస్తే రాలలేదు. వంటికున్న రోమాలకి అతుక్కుని ఉన్నాయి కొన్ని.

అది ఉప్పుగా అవగాహన చేసుకున్నాడు. లేవబోయాడుగాని నడుంచుట్టూ ఎవరో చేతులువేసి ఆపినట్లుగా అనిపించింది.

ప్రక్కనేవుంది గ్లోరియా బోర్లా పడుకుని. గ్లోరియా నడుంకున్న త్రాడు తనని ఆపింది లేవనివ్వకుండా.

కదలికలేని గ్లోరియానిచూస్తే చచ్చిపోయిందేమోనన్న అనుమానం వేసింది కులకర్ణికి.

వెల్లకితలా చేశాడు గ్లోరియాని. మత్తుగా మూలిగింది గ్లోరియా.

అమ్మయ్య. బ్రతికేవుంది.

అంటే తామిద్దరూ చావలేదు. బ్రతికేవున్నారు. రాత్రి తుఫాన్‌లోంచి బ్రతికి బయటపడ్డారు.

మరి జార్జ్ పెపర్డ్?

తలతిప్పి చూసాడు. పెపర్డ్‌ని కూడా త్రాడుతో కట్టినట్లు గుర్తు.

ఉలిక్కిపడ్డాడు తాడుకి చివరవున్న కాలినిచూసి. తను పెపర్డ్ కాలికి కట్టాడు త్రాడుని. ఇప్పుడు కాలుమాత్రమే వుంది. పడికాలు తొడ క్రిందిభాగందాకానే వుంది. మిగతా శరీరం ఎంతమాత్రంలేదు.

అంటే?

ఏదయినా సముద్రంలో వుండేజీవి; ఏ సొరచేపో, తిమింగలమో తినేసి వుంటుంది జార్జ్‌ని. కాలు మిగిలిపోయి వుంటుంది బహుశ.

గుండె ఝల్లుమంది కులకర్ణికి ఆ కాలుని చూస్తూంటే. కళ్ళలో నీళ్ళు తిరిగాయి అప్రయత్నంగా. నడుంకి వున్న కత్తి వుందో లేదో తడిమి చూసుకున్నాడు.

ఉంది.

కత్తితో ఆ కాలికి కట్టివున్న త్రాడుని కోసేసాడు కులకర్ణి. తర్వాత తనకీ, గ్లోరియాకి కట్టివున్న త్రాటిని విప్పాడు.

ఎదురుగా సముద్రంవంక చూసాడు. నిశ్చలంగా ప్రశాంతంగా వుంది. ఏమీ ఎరగనట్లు గంభీరంగావుంది. రాత్రి భీభత్సం తాలూకు ఛాయలు కొంచెంకూడా లేవు.

లేచి నిలబడ్డాడు కులకర్ణి. ఓసారి సముద్రం అలలు పాడుగూతా చూసాడు. ఇసకవుంది బంగారం రంగులో, సూర్యకిరణాలకి మెరుస్తూ. ఎవరూలేరు.

కొంచెందూరంలో తెల్లటి లైఫ్ జాకెట్ పడివుంది ఒడ్డు

మీద. దానివంక ఆప్యాయంగా చూసాడు కులకర్ణి. అదే తనని కాపాడి ఒడ్డుకి చేర్చింది.

దాన్ని కట్టిన పెపర్డ్ గుర్తుకువచ్చాడు. గుండెలో కలుక్కుమన్నట్లయింది కులకర్ణికి.

ఏ జలచరం నోట్లో పడ్డాడో? లేకపోతే బ్రతికి ఎక్కడయినా అవస్థపడుతున్నాడేమో?

నాలుగయిదుసార్లు కూర్చుని, లేచి బస్కీలు తీసాడు కులకర్ణి అవయవాలన్నిటినీ స్వాధీనంలోకి తెచ్చుకోవడానికి. వంటిమీద అంటుకునివున్న ఉప్పు ఇబ్బంది పెడుతోంది కులకర్ణిని. నీళ్ళు ఆరిపోయి వుప్పు మిగిలిపోయింది.

ఓసారి వెనక్కి తిరిగిచూసాడు తనున్న ప్రదేశం ఎలా వుంటుందో తెల్సుకోడానికి.

సముద్రంనుంచి వందడుగులదూరందాకా అంతా ఇసుక. ఆ తర్వాత చిన్నచిన్న పొదలు, చెట్లు. వెయ్యిగజాలదూరం నుంచి పెద్దపెద్ద చెట్లు. దట్టంగా అడవిలావుంది లోపలంతా.

నీరసంగా, ఆకలిగావుంది కులకర్ణికి, సరయిన భోజనం చేసి నాలుగయిదు రోజులవడంవల్ల. లోపలకి వెళితే ఏవైనా కాయలు, పళ్ళు తినేందుకు దొరకచ్చనే ఆలోచన వచ్చింది కులకర్ణికి.

వంగి గ్లోరియాని తట్టిలేపాడు.

గ్లోరియా కళ్ళు విప్పింది.

"గుడ్ మార్నింగ్" అన్నాడు నవ్వుతూ.

గ్లోరియా లేవడానికి సహాయపడ్డాడు కులకర్ణి. గ్లోరియా చేతకూడా ఎక్సర్ సైజ్ చేయించాడు రెండునిముషాలు, బద్ధకం పోవడానికి.

"మనం బ్రతికేవున్నాం" అన్నది గ్లోరియా ఆనందంగా

చేతులు చాపుతూ.

గ్లోరియాని కౌగిలిలోకి లాక్కొని, పెదవులమీద, భుజాల కిందా ముద్దుపెట్టుకున్నాడు కులకర్ణి.

"పెపర్డ్ ఏడీ?" అడిగింది గుర్తుకువచ్చి అకస్మాత్తుగా.

"అదుగో."

కవ్వన అరిచింది గ్లోరియా కాలుని చూసి.

"చచ్చిపోయాడా?" అడిగింది.

"చచ్చిపోతేనే మంచిది, కాలులేకుండా బ్రతికే బదులు. అలా అనుకుందాం."

"ఆకలి వేస్తోంది నాకు."

"పద. వెతుకుదాం తినడానికి ఇక్కడ దేముడు మన కోసం ఏం సృష్టించి వుంచాడో?"

రెండడుగులు వేసి ఆగి అన్నాడు కులకర్ణి.

"ఒక్క నిమిషం."

ఒడ్డున పడివున్న లైఫ్ జాకెట్స్ రెంటినీ అందుకుని, వాటిల్లో పెపర్డ్ కాలుచుట్టాడు. పైన ఇసకపోసి కప్పెట్టాడు.

"పద" అన్నాడు భుజంమీద చెయ్యివేసి.

## 9

మధ్యాహ్నం నిద్రపోయి, సాయంత్రం లేచారు. ఎర్రటి పళ్లు కోసుకుని తిన్నారు. ఆ పళ్ళపేరే తెలియదు వాళ్ళకి. ఎప్పుడూ చూడలేదు అలాంటి పళ్లు.

చాలా రుచిగా వున్నాయి. పళ్ళుతిని, దగ్గరలోనేవున్న సరస్సులో నీళ్ళు తాగారు. ఆ సరస్సులోనే స్నానంచేసారు ఇద్దరూ, వంటిమీద అంటుకున్న మట్టి, ఇసక, ఉప్పు వదిలే దాకా.

తర్వాత పడుక్కున్నారు ఇద్దరూ ఓ చెట్టునీడలో.

సాయంత్రం లేచారు ఇద్దరూ. ఇంకో గంటలో చీకటి పడు తుందనగా అన్నది గ్లోరియా.

"చీకటిపడ్డాక రాత్రి ఇక్కడ, ఈ చెట్లమధ్య గడపడం ప్రమాదం. మళ్ళీ సముద్రం వద్దుకి వెళ్ళిపోదాం."

"నిజమే. పాములులాంటి వాటివల్ల ఇక్కడ ప్రమాదం ఉంటుంది."

ఇద్దరూ వెనక్కి నడిచారు. చీకటి పడుతూండగా చేరు కున్నారు సముద్రం వద్దుకి.

"మన లైఫ్ జాకెట్స్ పరచుకుని పడుక్కుందాం" సలహా చెప్పింది గ్లోరియా, దూరంగా ఇసకలో కనపడుతున్న తెల్లటి లైఫ్ జాకెట్స్‌వంక చూసి.

కులకర్ణి భృకుటి ముడివడింది ఇసకలో తను ఉదయం కప్పిపెట్టిన లైఫ్ జాకెట్స్ రెండూ బయట కనపడగానే. దగ్గరకివెళ్ళి చూసాడు. లోపల ఉండాల్సిన పెపర్డ్ కాలులేదు. ఖాళీగావున్నాయి లైఫ్ జాకెట్స్ రెండు.

"మైగాడ్. ఇక్కడ ప్రమాదం" అన్నాడు. చుట్టూ పరకాయించి చూసి, ఎవరూ లేరని రూఢిచేసుకుని, గ్లోరియా చేతిని పట్టుకుని పరిగెత్తాడు చెట్లవైపు.

"ఏమిటి? ఎందుకు అక్కడ ప్రమాదం?" అడిగింది గ్లోరియా రొప్పుతూ.

"పెపర్డ్ కాలులేదు" చెప్పాడు కులకర్ణి.

"ఏమయింది?"

వూపిరి పీల్చడంకూడా మర్చిపోయి అడిగింది గ్లోరియా.

"పెపర్డ్ వచ్చివుంటాడా?"

"డోంట్ బి ఎస్టుపిడ్. ఎవరో తీసుకెళ్ళారు కావాలని."

"ఎవరు? జంతువులేమయినా తినేసి వుంటాయేమో?"

“జంతువులు తింటే కనీసం ఎముకలయినా మిగిలి వుండాలిగదా. ఎవరో మనుషులే తీసుకెళ్ళి వుండాలి.”

“అంటే ఈ నేలమీద మరెవరోకూడా వున్నారనే మాట.”

“అవును.”

“అయితే మనకి ప్రమాదం వుండదు. తేలికగా వాళ్ళ సహాయంతో బయటపడచ్చు.”

“వాళ్లు ఎవరో, ఎలాంటి వాళ్ళో తెలియకుండా మనం ప్రమాదంవుందీ, లేనిదీ నిశ్చయంగా చెప్పలేం.”

“ఏం చేద్దాం ఈరాత్రి మరి?”

“నువు పడుకో. నాకు ఈరాత్రి నిద్రపట్టదు.”

రాత్రంతా మేలుకునే వున్నాడు కలకర్ణి. గ్లోరియాకూడా ఎక్కువసేపు నిద్రపోలేకపోయింది. దోమలుకుట్టి చంపాయి ఇద్దరినీ, నిద్రపోనివ్వకుండా.

కలకర్ణి ఆలోచిస్తూండి పోయాడు ఏంచేయాలా అని. మర్నాడు ఉదయం ఇంకా ్స లోపలికివెళ్ళి ఎవరయినా కనబడతారేమో చూడాలనుకున్నాడు. కొద్దిగా జ్వరం వచ్చినట్లుగావుంది గ్లోరియాకి.

సూర్యుడు ఉదయిస్తూండగానే ఇద్దరూ బయలుదేరారు ఆ అడవిలోపలకి, పళ్లు కడుపునిండాతిని, కొన్ని కోసుకుని మూటకట్టుకుని.

సరయిన దారిలేదు. ముళ్ళు, రాళ్లు, పొదలు, దట్టంగా పెరిగిన తీగలు, లతలు, చెట్లూ మార్గంలేకుండా ఆటంక పరుస్తున్నాయి.

కొంత దూరంవెళ్ళి, గ్లోరియా కెవ్వున అరిచింది చేతిని విదిలిస్తూ.

"ఏమయింది?" అడిగాడు కులకర్ణి కంగారుగా.

"కుడుతోంది. ఏదో పురుగు."

గ్లోరియా చేతిని అందుకుని చూసాడు. గులాబిరంగు చర్మంమీద ఎర్రటి పురుగు.

చూపుడు వ్రేలంత లావున, ఎర్రగా అంగుళం అంతవున్న ఆ పురుగుని గుర్తుపట్టాడు కులకర్ణి.

చేత్తో లాగడానికి ప్రయత్నించాడు కాని వూడిరాలేదు చేతికి. తుమ్మ జిగురుతో అంటించినట్లుగా చర్మాన్ని అంటి పెట్టుకుని వుంది. గట్టిగా షెల్ లావుంది పైభాగం.

కొద్దికొద్దిగా కదులుతోందా పురుగు. పురుగు కదిలినచోట గుర్తుగా, సన్నగా ఎర్రటిచార, చర్మంపోయిన గుర్తు కనపడుతోంది. రక్తం కారుతోంది.

కులకర్ణి ఆ చేతిని ప్రక్కనేవున్న గుంటలో ముంచి వుంచాడు నీళ్ళల్లోనే, అయిదు నిముషాలు. తర్వాత చేతిని పైకితీసాడు.

పురుగులేదు ఇప్పుడు చేతిమీద. చర్మం తినేసిన కాస్త భాగంలో నెత్తురు వూరుతోంది పల్చగా.

"నెప్పిగా వుందా?" అడిగాడు.

"అవును. మండుతోంది."

ఆ పురుగు ఎలా చేతిమీదకి వచ్చి వుంటుందానని చుట్టూ చూసాడు. కొద్దిదూరంలో చెట్టు ఆకులనిండా ఆ పురుగులే. నాలుగడుగులు వెడల్పున్న ఆ చెట్టు ఆకులు చాలా పెద్దవి. ఆ ఆకులమీద కదులుతున్నాయి పురుగులు వందలకొద్దీ.

అలాంటి చెట్లు అక్కడక్కడా చూసాడుకాని, కులకర్ణి పురుగులనంత దీక్షగా చూడలేదు.

"ఆ చెట్లకి దూరంగా వుందాం" చెట్టువంక, చెట్టు ఆకుల, పురుగులవంకా చూపించాడు.

మరో మైలుదూరం వెళ్ళేలోపల చెట్లకొమ్మలకి చుట్టుకుని వదలకుండావున్న పాములని చూశారు చాలా. దాదాపు ప్రతీ పదడుగులకీ రెండు, మూడు పాములు వున్నాయి. ఒక్కొక్కసారి వాటి కిందనుంచే తలవంచుకుని వెళ్ళాల్సి వచ్చింది.

గ్లోరియా ఫులకర్ణిని వదలలేదు క్షణంకూడా. అతుక్కుపోయినట్లుగా ఆనుకుని నడిచింది. ఫులకర్ణి నేలమీద పరీక్షగా చూసి మరీ అడుగులు వేస్తున్నాడు.

నలుపు, తెలుపు, బూడిదరంగు, గోధుమ రంగు – అనేక రంగులలో వున్నాయా పాములు పెద్దవి, చిన్నవి.

ఫులకర్ణికి అప్పటికే అనుమానం కలిగింది ఆ దీవి ఏమయి వుండొచ్చో. దూరంగా కనబడుతున్న చిన్నకొండని చూడగానే మరింత ధృవపడింది అనుమానం.

నడుస్తూ చటుక్కున ఆగిపోయాడు ఏదో అలికిడి విని. కొంచం దూరంలో వినిపించింది అలికిడి. గ్లోరియాకి కత్తిని అందించి, తను సిద్ధంగా రెండు చేతులతో రెండు కత్తులు పట్టుకుని, నిశ్శబ్దంగా వుండమన్నట్లుగా సౌంజ్ఞ చేసాడు.

చాలా సేపు ఇద్దరూ మౌనంగా నిలబడ్డారుగాని మళ్ళీ అలికిడి వినపడలేదు. ఫులకర్ణి అలికిడి వినపడినవైపు కదిలాడు చేతిలో కత్తులతో.

ఎవరూ కనపడలేదు.

కొండవైపున నడిచారు. మధ్యాహ్నానికల్లా చేరుకున్నారు కొండ మొదలుకి. అక్కడ కొద్దిగా బావుందనిపించింది ఇద్దరికీ. పాములుకానీ, ఆ పురుగులుండే చెట్లుకానీ కనిపించ

లేదు ఎక్కడా. గ్లోరియాకి జ్వరం ఎక్కువయింది.

కొండ రాళ్ళమీద కూర్చుని విశ్రాంతి తీసుకున్నారు అరగంటసేపు, కూడా తెచ్చిన పళ్ళుతిని. నీళ్ళెక్కడా కనబడలేదు దాహంవేసి తాగుదామని చూస్తే.

గ్లోరియా మొంబాసా జాతివాళ్ళ గురించి, వాళ్ళు తమతో తీసుకువెళ్ళిన ముగ్గురు అమ్మాయిల గురించి ఆలోచిస్తోంది. ఏం చేస్తారు వాళ్ళని? అసలింకా బ్రతికే వుండివుంటారా?

"ఇదే మొంబాసా దీవి" తుపాకి పేల్చినట్లుగా చెప్పాడు ఫులకర్రి.

వులిక్కిపడి అడిగింది గ్లోరియా.

"నీకెలా తెలుసు?"

"పెపర్ ఈ దీవిగురించి చెప్పేటప్పుడు వినలేదా నువ్వు: పాములు, ఎర్రపురుగులు, ఈ కొండ..."

"అయితే మనం త్వరగా పారిపోవాలి" అన్నది గ్లోరియా లేచి నిలబడి.

దిగులుగా నవ్వి ఫులకర్రి అడిగాడు

"ఎక్కడికి?"

"ఇంకెక్కడికయినా."

"ఈ దీవి వదిలా?"

"అవును."

"మనకి పడవలేదు. ఈ దీవిలో అరెస్ట్ అయాం, దేముడు మనల్ని ఖైదుచేసాడు ఇక్కడ. బహుశ ఆ సముద్రపు దొంగల చేతిలో చావడానికేనేమో?"

"ఆత్మహత్యయినా చేసుకుంటాను కాని ఆ కిరాతకులకు ప్రాణాలతో చిక్కను," అన్నది గ్లోరియా.

సిగరెట్ తాగాలనిపించింది ఫులకర్రికి. కాని సిగరెట్స

లేవు. ఎక్కడో జారిపోయాయి.

"నాకో సహాయంచేస్తావా?" అడిగింది గ్లోరియా.

"చెప్పు. నీళ్లా?"

"కాదు. నాకు తెలియకుండా నిద్రపోతున్నప్పుడు నన్ను పొడిచి చంపెయ్యి."

"దేనికి?" బిత్తరపోతూ అడిగాడు కులకర్ణి.

"నాకు వాళ్ళంటే భయం. లోడింగ్ రూంలో వాడు నా కళ్ళలోకి చూసినచూపు నేను జీవితంలో మరచిపోలేను. వీళ్ళచేతుల్లో చిక్కి బాధలు అనుభవించే కంటె చచ్చి పోవడమే మేలు" వణుకుతూ అన్నది.

చిన్నగా నవ్వి అన్నాడు కులకర్ణి.

"తప్పుగా ఆలోచిస్తున్నావు."

"ఎంత మాత్రంకాదు. నువు నాకీ సహాయం తప్పక చెయ్యాలి. ఐ నీడ్ యువర్ హెల్ప్."

కులకర్ణి మాట్లాడలేదు.

"ఏమంటావు?"

"నువు లేకుండా నేను బ్రతకలేను బయట ప్రపంచం లోనే, ఇక్కడయితే అసలు బ్రతకలేను."

మౌనంగా ఉండిపోయింది గ్లోరియా.

"పద. రాత్రి ఎక్కడ తలదాచుకోవచ్చో చూద్దాం."

ఇద్దరూ మళ్ళీ లేచి, బయలుదేరారు. ఆ కొండలోనే ఓ చిన్న గుహలాంటిది వుంది. సహజంగా ఏర్పడిన కేవిటీ అది. ఇద్దరికంటె ఎక్కువమంది పట్టరు లోపల.

"ఇక్కడ బావుంటుంది" చెప్పాడు. దుమ్ముగావుంది లోపల. చెట్లకొమ్మల విరచి లోపల శుభ్రంగా వూడిచారు. అయినా దుమ్ముపోలేదు అట్టే.

"కొండమీదకి వెళ్దాం పద. జార్జ్ చెప్పిన బంగారం సంగతి ఎంతవరకు నిజమో చూద్దాం."

"నేనింక నడవలేను" అన్నది గ్లోరియా నీరసంగా.

"ఒంటరిగా వుండగలవా అయితే?"

"ఊహూ. వస్తాను నీ వెంట."

ఇద్దరూ కొండమీదకి ఎక్కారు. వెయ్యి అడుగుల ఎత్తు వుంటుంది. అంతే. పదినిముషాలలో ఎక్కారు ఇద్దరూ.

కొండమీదినుంచి రెండువైపులా దూరంగా సముద్రం, సముద్రానికీ, కొండకీ మధ్యవున్న చిట్టడవి, అటువైపు దూరంగా కనిపించే చెట్లు, మొక్కలు. మనుష్య సంచారం వున్న సూచనలేమీ కనపడలేదు. రెండు పడవలు కనపడ్డాయి కొండకి అనుకుని సముద్రం దగ్గర.

బిలంకోసం వెదికారు ఇద్దరూ. కనపడలేదు. జార్జ్ పెపర్డ్ అబద్ధం చెప్పి వుంటాడనుకున్నారు ఇద్దరూ. అయినా కులకర్ణికి నమ్మకం కలగలేదు, జార్జ్ అబద్ధం చెప్పి వుంటాడంటే. అలా అబద్ధం చెప్పాల్సిన అవసరం లేదతనికి ఎంతమాత్రం.

ఈసారి జాగ్రత్తగా వెదికారు ఇద్దరూ. కులకర్ణి రాళ్ళని కదిలించి చూసాడు చాలావాటిని, బిలాన్ని కొండరాయితో మూసేయవచ్చు అనే ఆలోచన రావడంవల్ల.

ఓ రాయి కొద్దిగా కదిలింది.

ఇద్దరూ బలంగా తోసారు రాతిని.

పూర్తిగా పక్కకి కదిలింది.

లోపలకి చూసారు ఆత్రంగా.

# 10

కొండదిగి కిందకి వచ్చారు ఇద్దరూ. చీకటి పడుతోంది కొద్దికొద్దిగా. ఇంకో గంట తర్వాత సూర్యుడు పూర్తిగా

అ సమిస్తాడు.

"మనం నిజంగా అదృష్టవంతులం" అన్నాడు కులకర్ణి సంతోషంగా.

ఇద్దరి చేతుల్లో రెండు మూటలున్నాయి. లైఫ్ జాకెట్ల నిండా బంగారం మూటకట్టారు.

పెపర్ చెప్పింది నిజమే. రాయి తొలగించి చూడగానే కళ్ళు మిరుమిట్లు గొలిపేలా బంగారం వస్తువులు కనపడ్డాయి.

లెక్కలేనన్ని.

నిర్లక్ష్యంగా దాంట్లోకి విసిరివేయబడ్డాయి తరతరాల నుంచి, వాటివిలువ తెలియక. ఆ బిలం ఎంతలోతో తెలియదు గాని, లోపల ఎంత బంగారం వుందో తెలియదుగాని, పైన చాలా కనపడుతున్నాయి.

"ఖచ్చితంగా ఆస్ట్రేలియాని కొనేయవచ్చు ఈ బంగారంతో" అన్నాడు ఆనందంగా పూగిపోతూ.

"ఎలా తీయటం?" అడిగింది గ్లోరియా.

గ్లోరియా నడుంచుట్టూ తాడు గట్టిగాకట్టి, నెమ్మదిగా గ్లోరియాని లోపలకి వదిలాడు కులకర్ణి, బావిలోకి బొక్కెనని వదిలినట్లుగా.

విలువయినవి ఏరిమూట కట్టింది గ్లోరియా. రెండుగంటల సేపు ఆ బిలంలోనే వుంది గ్లోరియా బంగారంమీద కూర్చుని వస్తువులు ఏరుతూ.

అక్కడక్కడ పాములు వదిలిన కుబుసాలని చూసినా భయపడలేదు గ్లోరియా. ఆ బంగారం పొందడంలోవున్న ఆనందం ముందు భయం చచ్చిపోయింది.

బంగారం, విలువైన వజ్రాలతో బయటపడ్డారు బిలానికి పైన మళ్ళీ రాయి యథాప్రకారం మూసేసి.

కొండదిగి కిందకి వచ్చారు సంతోషంగా కబుర్లు చెప్పు కుంటూ. జ్వరం మరీ ఎక్కువయింది గ్లోరియాకి.

అకస్మాత్తుగా చూసింది గ్లోరియా, కొంచెం దూరంలో, చేతిలో బాణం ఎక్కుపెట్టి నిల్చుని విస్మయంగా వింతగా చూస్తున్న ఆ అనాగరికుడిని.

భుజాలమీదికి వేలాడుతున్న జుట్టు. నల్లటి మొద్దు శరీరం. పెరిగిన గడ్డం. గోచీకూడా లేదు. పోతపోసిన విగ్రహంలా, మెరుస్తున్న కళ్ళతో చూస్తున్నాడు చిరిగిపోయిన గ్లోరియా గౌనులోంచి కనబడుతున్న వక్షోజాలవంక.

కులకర్ణి మూటని కిందపడేసి చేతిలోని కత్తిని బలంగా, అతిబలంగా విసిరాడు.

ఆ దేక్షణంలో రివ్వునవచ్చి భుజంలో గుచ్చుకుంది బాణం కులకర్ణికి.

గ్లోరియా తన చేతిలోని కత్తినికూడావిసిరింది ఆ మొంబాసా జాతివాడిమీదకి.

"వాడిని తప్పించుకోనివ్వకూడదు. వెళ్ళి అందరినీ పిలుచుకు వస్తాడు" బాధగా పళ్ళునొక్కిపెట్టి చెప్పాడు కులకర్ణి.

వెనక్కితిరిగి పరిగెత్తుతున్న వాడిమీదకి మరోకత్తి విసిరింది గ్లోరియా. మూడోకత్తి తగలగానే నేలకూలాడువాడు చిన్నగా అరుస్తూ.

"బాణాన్నిలాగు" అన్నాడు కులకర్ణి.

"అమ్మో నాకు భయం."

"కళ్ళుమూసుకుని త్వరగాలాగు. విషం ఎక్కుతుంది."

గ్లోరియా బాణాన్ని బయటకి లాగింది.

"విషమా?" అడిగింది.

"అవును. బాణం చివర పూసినట్లున్నాడు."

రక్తం కారకుండా ఆపి వాడి దగ్గరికి వెళ్ళాడు కులకర్ణి.

స్పృహ తప్పింది వాడికి. పదిహేడేళ్ళుంటాయి. చిన్న వాడే. అయినా దారుఢ్యంగా వున్నాడు.

వాడి భుజాన వ్రేలాడుతున్న తోలుసంచీలోంచి కుమ్మరించాడు కులకర్ణి. అనేక మూలికలు, ఆకులు, చెట్లవేళ్ళు బయటపడ్డాయి.

"దీంట్లోనే ఒకటి విరుగుడు. ఏదో మనకి తెలియదు. జార్జ్ చెప్పాడు, విషానికి విరుగుడు వీళ్ళదగ్గర వుంటుందని. ఆ మూలికలన్నీ కలిపి నా గాయానికి కట్టుకట్టు త్వరగా."

గ్లోరియా కులకర్ణి గాయంచుట్టూ ఆ వేళ్ళని, మూలికలని అమర్చి కట్టుకట్టింది రక్తం కారకుండా.

"విషం తగ్గుతుందా ఇప్పుడు?" అడిగింది.

"ఏమో? నేను చావకపోతే విరుగుడు పనిచేసినట్లే. చూడాలి" అన్నాడు.

భయంగా చూసింది గ్లోరియా.

"పెపర్డ్ చెప్పిన మాటలు మర్చిపోయ్యావా? దేముడు ఎంతకాలం మనకి ఆయుర్దాయం వ్రాస్తే అంతకాలం బ్రతుకుతాం."

"నొప్పిగా వుందా?"

"కొద్దిగా."

"వీడిని ఏంచేద్దాం?"

"చంపేయాలి."

"పాపం."

గ్లోరియా కళ్లు మూసుకుంది చూడలేక.

దూరంగా చప్పుడు వినిపించింది. శ్రద్ధగా విన్నారు ఇద్దరూ. చాలామంది పరిగెత్తుకొస్తున్న చప్పుడు, అరుపులు

కూడా వినపడుతున్నాయి.

"క్విక్. వీడిని సాయంపట్టు."

ఇద్దరూ కలసి మోసుకువెళ్ళి ఓ కొండరాయిప్రక్కన దాచారు వాడి శవాన్ని కనబడకుండా.

"ఇందాక అటువైపు రెండు పడవలు చూసాను. పోదాం పద" తొందరచేసాడు వులకర్ణి.

ఇద్దరూ చేతిలో మూటలతో పరిగెత్తారు కొంతదూరం. ఏటవాలుగావున్న కొండఎక్కారు పైకి పదినిముషాల్లో. ఇద్దరూ కొండఎక్కిన తర్వాత చూసారు.

కింద చాలామంది గుమిగూడివున్నారు. "బోర్లాపడుకో" గ్లోరియా భుజంమీద చిన్నగా తట్టి చెప్పాడు వులకర్ణి. గ్లోరియాకి జ్వరంతో వళ్లు వేడిగావుంది.

గ్లోరియా, వులకర్ణి కొండమీద బోర్లా పడుక్కున్నారు. కిందనుంచి చూసేవాళ్ళకి కనపడకుండా. కింద జరిగే సంబరం చూడసాగారు.

గుంపుగా కూర్చునివున్నారు పాతికమందిదాకా. మరో పాతికమంది గుండ్రంగా నిల్చునివున్నారు. అందరిచేతుల్లో కత్తులు, బాణాలు వున్నాయి.

ఆ గుంపు మధ్యలో ముగ్గురు ఆడపిల్లలు.

"గుడ్ గాడ్ వాళ్ళు" గుర్తుపట్టి అన్నది గ్లోరియా.

తలపంకించాడు వులకర్ణి.

"ఆ అమ్మాయిలని ఇంకా బ్రతికే వుంచినట్లున్నారు."

"చంపేస్తారనుకుంటాను ఇప్పుడు."

"చంపి తింటారా?"

"నరమాంస భక్షకులు వాళ్లు."

"వాళ్ళలో చలనం వుండదు ఎప్పటికీ."

"దేముడు అలా సృష్టించాడు మరి. నాగరికత పొందక పూర్వం మనంకూడా అంతేమరి. చంద్రలోకంలోకి వెళ్లారు గాని, ఈ ఐలెండ్ ని ఇంతకాలం గుర్తించలేకపోయారు."

డప్పులు మోగిస్తూ వాళ్ళు చేసే నృత్యాన్ని కాసేపు చూసారు. డప్పులమోత మధ్య అన్నది గ్లోరియా.

"ఆ ముగ్గురినీ కట్టేసారు. అరుస్తున్నారు బాధగా."

కళ్ళు చికిలించి చూసాడు వులకర్ణి.

నిజమే. బాధగా అరుస్తూ కదులుతున్నారు ఆ ముగ్గురూ. పూర్తిగా నగ్నంగా వున్నారు.

"దేనికి అలా బాధపడుతున్నారు?"

"ఏమో? కనపడటంలేదు."

"వంగి చూస్తున్నారు. ఆ పురుగుల్ని వదిలారేమో మీద?"

"చర్మాన్ని తినే ఆ ఎర్రపురుగుల్నా?"

"అవును వాటిని వదిలి, బాధపడుతూంటే తమాషా చూస్తున్నట్లున్నారు" చెప్పాడు వులకర్ణి. ఇక ఆ తర్వాత జరిగేది చూడలేకపోయారు ఇరువురూ.

"నేను తాడు కడతాను అవతలివైపుకి. తాడు పట్టుకుని కిందకి జారు. సరిగ్గా ఒడ్డుదగ్గర దిగుతావు. పడవలున్నాయి అక్కడ. ఓ పడవ తీసుకుని పారిపోదాం. ఈ రాక్షసుల ద్వీపానికి దూరంగా."

వులకర్ణి తనతో తెచ్చిన త్రాళ్ళని కలిపి గట్టిగా ముడి వేసి, ఓ కొసని ఓ పెద్ద బండరాయికి కట్టాడు. మరో కొసని, సరిగ్గా కిందకి వదిలాడు. సముద్రం వడ్డున ఇసుకని తాకుతోంది రెండో కొస.

"క్విక్. కమాన్."

తాడుపట్టుకుని గబగబా కిందకి జారారు ఇద్దరూ. అల వాటులేనిపని. కాళ్లు, చేతులూ దోక్కుపోయాయి. ఇసక మీద కాలు మోపగానే పరిగెత్తారు పడవలవైపు, నడుంకి కట్టుకున్న బంగారపు వస్తువుల మూటలతోసహా.

ఓ పడవని గబగబ నీళ్ళలోకి తోసాడు వులకర్ణి. ఖాళీగా వున్న మరో పడవలోని తెడ్లుకూడాతీసి తన పడవలో వేసు కుని గ్లోరియాని పడవలో కూర్చోబెట్టి, తను నడుందాకా మునిగేదాకా పడవని నీళ్ళలో తీసుకువెళ్ళాడు అతివేగంగా.

తర్వాత ఎక్కి, గబగబా తెడ్లు వేయసాగాడు. పడవ కదులుతోంది వేగంగానే.

"తెడ్లుతీసి మంచిపనిచేసావు. ఎవరైనా మనల్నిచూస్తే ఆ పడవతో మనవెనక పడేవాళ్ళు," అన్నది గ్లోరియా.

"మన ప్రమాదం ఇంకా తప్పలేదు. ఏథైమందిదాకా ప్రయాణం చెయ్యగలిగే పెద్దపడవవుంది వాళ్ళకి. ఒకటి కాదు రెండు. మనల్ని ఎవరైనా గమనిస్తే మనలను వెదక డానికి రావచ్చు వాటిమీద."

"ఆ పెద్ద పడవ వేగంముందు ఇదెందుకూ పనికిరాదు," అన్నది గ్లోరియా నిరుత్సాహంగా.

"అవును. రాత్రంతా పడవని నడుపుతూనే వుంటాను."

"మనదగ్గర కొన్ని కోట్లు ఖరీదుచేసే బంగారం, రాళ్ళు వున్నాయి. కాని వుపయోగం ఏమిటి? అన్నీ వుండీ దరిద్రు లమే."

"ఆహారం, నీళ్లు లేకుండా ఎక్కువకాలం బ్రతకలేము. రెండురోజుల్లోగా మనం రక్షింపబడకపోతే చావు తథ్యం."

"అసలు రెండురోజుల్లోపలే ఆ మొంబాసా జాతివారు మళ్ళీ మనల్ని పట్టుకోవచ్చు."

"వాళ్ళచేతిలో చిక్కేకంటె చావడం ఉత్తమం."

గ్లోరియా అడిగింది వలకరిణిని.

"ఎలావుంది నీ గాయం?"

"లోపల బాధగానేవుంది. ఔషధాలు పనిచేసాయో లేదోగాని, రేపువుదయం చచ్చిపడివుంటాను, విషం పని చేస్తే."

"వీళ్లు బాణాల చివర విషం పూస్తారా?"

"అవును."

"మనంకూడా జార్జిలాగా అప్పుడే చచ్చిపోతే బాగుండేది."

"దేముడు మనకెంతకాలం ఆయుర్దాయం పెడితే అంతకాలం జీవించివుండక తప్పదు."

"నిజమే. ఆయుర్దాయం లేకపోతే పడవతోసహా తిమింగలానికి ఆహారం అవుతాం. ఆయుర్దాయం వుంటేమరో మంచి దీవి తగలకపోదు. లేదా మనం రక్షింపబడకపోము."

"సింద్‌బాద్ సముద్రయానంచేసి, ఎన్నిసార్లు మృత్యుముఖంలోంచి తప్పించుకోలేదు?"

"సింద్‌బాద్ ఎవరు?"

"తెలియదా సింద్‌బాద్ నావికుడి కథ?"

"ఉహు."

"అయితే చెప్తాను విను. ఓసారి బాగ్దాద్ నగరంలో సింద్‌బాద్ అనే వర్తకుడు..." అంటూ చెప్పబోయినవాడల్లా చటుక్కున ఆగాడు.

ఎదురుగా దూరంగా ఒక స్టీమర్ రావటం కనిపించింది.

దానిని చూస్తూనే ఎగిరి గంతు వేసాడు పులకర్ణి. గ్లోరియా ఆనందంతో కేకలు పెట్టసాగింది. ఇరువురూ కలిసి గట్టిగా అరుస్తూ చేతులు వూపసాగారు.

స్టీమర్ మరింత దగ్గరైంది. దానిలోనివారు పులకర్ణిని, గ్లోరియాను గమనించారు. స్టీమర్ ఆపివేయబడింది. స్టీమర్‌లోని ప్రయాణీకులు, సిబ్బంది వీరిరువురిని ఆశ్చర్యంతో చూడసాగారు.

పులకర్ణి ఉత్సాహంగా గ్లోరియా చేతిని తన చేతిలోకి తీసుకొని నిమిరాడు.

—: ఐపోయింది :—

# చావుకోసం ఎదురుచూడు!!

ఏ. వీ. మోహన్‌రావ్

రైలు బయలుదేరింది.

ఆనంద్ వచ్చి లోయర్ బెర్త్ పైన కూర్చున్నాడు. ఆకలి అతన్ని తినేలా గుంజడంతో, ప్లాట్‌ఫామ్ పైన కొని తెచ్చుకొన్న సాంబార్, లెమన్, కర్డ్ బాత్ పొట్లాలను విప్పి, ఒకదాని ప్రక్క నొకటి పెట్టుకొన్నాడు.

నాలుగు బెర్త్‌లున్న ఫస్ట్ క్లాస్ కంపార్టుమెంటులో తనొక్కడే వున్నాడు. ఎవ్వరూ రాకుంటే హాయిగా పడుకొందామనిపించిం దతనికి. లేచి కిటికీకున్న అద్దాన్ని పైకెత్తాడు. చల్లగాలి లోనికి తోసుకొచ్చింది. గాలి తాకిడి అతని మొహాన్ని చల్లబరచింది.

సాంబార్ బాత్ ముద్ద తీసుకొని నోట్లో పెట్టుకొన్నాడు.

ఖాకీ యూనిఫాంలో వున్న కోచ్ అటెండెంటు, తలుపు నెట్టి లోనికి తొంగిచూశాడు.

"సార్! మీరొక్కరేనా వుంది?" అడిగాడు.

అవునన్నట్లు తలూపాడు ఆనంద్.

"మరో ఇద్దరు పాసెంజర్సు ఆఖరి నిముషంలో వచ్చి ఎక్కారు. వాళ్ళకు ఈ రెండు బెర్తులు యిస్తాను. మీకేం అభ్యంతరం లేదుగా?" అడిగాడు అటెండెంటు.

అతని అతివినయం ఆనంద్‌ను ఆశ్చర్యంలో ముంచింది. బెర్తులు ఖాళీగా వున్నప్పుడు తన్ను అడగవలసిన అవసరమేమిటో అతనికి అర్థంగాలేదు.

"నీ యిష్టమొచ్చినవాళ్ళకు ఇచ్చుకో!" తింటూనే అన్నాడు.

"విజయవాడలో దిగిపోతారు" మళ్లీ అన్నాడు.

"వాళ్ళిష్టం! ఇంకా పైకి పోనీ..." అంటూండగానే, ఒక యువకుడు లోనికొచ్చాడు. అతని చేతిలో ఖరీదైన సూట్‌కేస్ వుంది. దాన్ని పై బెర్తుపైన పెట్టి ఆనంద్‌కేసి చూసి నవ్వాడు.

ఆనంద్‌కు నవ్వాలనిపించలేదు. తినడంలో నిమగ్నమయినాడు. మరో రెండు నిముషాలకు పొడవుపాటి అమ్మాయిని వెంటబెట్టుకొచ్చాడు కండక్టరు.

ఆ అమ్మాయి తిన్నగా వచ్చి ఆనంద్ కెదురుగా బెర్తుపైన కిటికీ వారగా కూర్చుంది. చేతిలో సిగరెట్ కాలుతూంది.

"నేను తినేదాకా మీరు అవతలకన్నా వెళ్ళండి. లేదా సిగరెట్ పారెయ్యండి!" అన్నాడు ఆనంద్.

ఒక క్షణం విసుగ్గా చూచి సిగరెట్ వెలుపలకు విసరి కొట్టింది. ఆమె వెంటవున్న యువకుడు వచ్చి, ఆనుకుని

కూర్చున్నాడు. "తిండిపోతులాగున్నాడు. అన్ని పొట్లాలు తెరచిపెట్టుకొని ఆవురావురుమని తింటున్నాడు" హిందీలో చెప్పాడు అమ్మాయికి మెల్లగా.

ఆనంద్ కు హిందీ తెలుసు. వాణ్ని పట్టుకుని తందామనిపించింది. ఇంకా తనను గురించి వాళ్ళేం మాట్లాడుకొంటారో విని, ఓపికున్నంతదాకా వినోదిద్దామనీ, మరీ శృతిమించితే నాలుగు వాయిద్దామని నిశ్చయించుకున్నాడు.

"అవును" అందామ్మాయి.

ఆనంద్ వాళ్ళకేసి చూడకుండా తన పనిలో నిమగ్నమయినాడు.

"నువ్వింటికి తిరిగి వెళ్ళకుంటే మీవాళ్ళు వెతుక్కుని పోలీస్ రిపోర్టిస్తారేమో?" అడిగాడతను.

"ఇవ్వరు. అసలు నేను యింటికి రావటంలేదని తెలుసుకోనేందుకు మా అమ్మకు, నాన్నకు ఆర్నెల్లు పడుతుంది. ఇద్దరూ ఒక్కసారి ఏ టయిమ్‌లోనూ ఇంట్లో వుండరు" అంది ఆ అమ్మాయి నవ్వుతూ.

ముత్యాల్లా తీర్చిదిద్దినట్టున్న తెల్లని పళ్ళను అప్పుడు చూశాడు ఆనంద్. స్ట్రెచ్ పాంటు వేసుకుంది. నైలాన్ బనీను తొడుక్కుంది. బాబ్డు చేసిన నల్లటి నొక్కుల జుట్టును రెండు చేతుల్తో సర్దుకుంటూంటే ఎత్తిన చేతుల మహత్యంతో, పైపైకెత్తుకొచ్చిన లావుపాటి గుండ్రటి బలమైన రొమ్ములు కనుపించాయి ఆనంద్ కు.

ముద్ద నోట్లోపెట్టుకొని అచేతనంగా వాటికేసి చూశాడు. తను వాటిని చూడటం ఆమె గమనించలేదు. కానీ అతను గమనించినట్లు తోచి తల ప్రక్కకు తిప్పుకున్నాడు.

తినడం పూర్తయింది.

ఆకులన్నీ చుట్టచుట్టి కిటికీలోంచి పారేశాడు. లేచివెళ్ళి చేతులు కడుక్కొని వచ్చాడు.

ఇద్దరూ విరగబడి నవ్వుతున్నారు. ఎందుకయింది ఆనంద్ కు అర్థంగాలేదు. తను వెళ్ళాక ఏదైనా చిలిపిపని చేశాడేమో ననుకుంటూ వెళ్ళి కూర్చున్నాడు.

“నీళ్లు తెచ్చుకున్నట్లు లేదు, ఏం త్రాగుతాడో” అందా అమ్మాయి.

“లెట్రిన్ లో పట్టుకొని త్రాగుతాడేమో! డర్టీ క్రీచర్” అన్నాడతను.

బాండ్ కేస్ తెరచాడు ఆనంద్. అందులో ఒకవైపు నల్లటి రివాల్వరు మిలమిల మెరసింది. దానిప్రక్కనే అమ్యూనిషన్ వుంది. వరుసగా పేర్చిన మూడు విస్కీ క్వార్టరు బాటిల్స్ వున్నాయి. వాటిప్రక్కనే వందరూపాయల నోట్లకట్ట వుంది.

ఎదురుగావున్న ఇద్దరూ బాండ్ కేస్ లోని వస్తువుల్ని చూసి, భయం, ఆశ్చర్యం, అసూయలతో అవాక్కయి పోయారు.

ఆనంద్ క్వార్టరు బాటిల్ తీసి వెలుపలపెట్టి కేస్ మూసి తలవేపు పెట్టుకొన్నాడు.

“ఈ డర్టీ క్రీచర్ నీళ్లు త్రాగడు. వాటి బదులు దప్పికయినప్పుడల్లా విస్కీ త్రాగుతాడు” అన్నాడు హిందీలో, బాటిల్ మూతను పళ్ళసందున బట్టి గట్టిగా తిప్పుతూ.

ఆ అమ్మాయి చటుక్కున ఆ యువకుడి వెనక్కి వెళ్ళి కూచుంది. అతను వణికిపోతూ, “సారీ సార్! ఏదో తమాషాకలా అన్నాను. క్షమించండి” అన్నాడు.

మూతతీసి వెలుపల పారేసి ఒక గ్రుక్కలో బాటిల్ ఖాళీచేశాడు ఆనంద్. ఖాళీసీసా విసరి పారేయబోయాడు.

అంతలో అతను ఆనంద్ చెయ్యి పట్టుకుని "పారెయ్యకండి సార్! మాకివ్వండి. వచ్చే స్టేషనులో నీళ్లు తెచ్చుకుంటాము" అన్నాడు.

బాటిల్ అతనికిచ్చేసి కూర్చున్నాడు.

రైలు వేగంగా పోతూంది. అప్పుడప్పుడూ చెవులు చిల్లులుపడేలా అరుస్తూంది. ఎక్కడా ఆగే పని లేకపోవడంతో విసుక్కుంటూ ముందుకు నడుస్తున్నట్లు కీచుకీచుమంటూంది అప్పుడప్పుడు చక్రాలు జాయింట్లపైన పడ్డప్పుడల్లా.

"ఆమెను లేవదీసుకొచ్చావా?" అడిగాడు ఆనంద్ చేత్తో మూతి తుడుచుకుంటూ.

"లేదు! ఆమె నన్ను ప్రేమించి వచ్చేసింది!" అన్నాడతను.

"నీ పేరేమిటి?"

"పతి" అన్నాడతను.

"ఏం చేస్తుంటావ్?"

"ఇంపీరియల్ హోటల్లో బ్యాండ్ వాయించేవాణ్ణి."

"ఆమె!"

"చదువుకొంటూందిట!" అన్నాడతను.

"ఏం చదువుకుంటూంది. సెక్స్ నవలలా?" అడిగాడు ఆనంద్.

"లేదు! ఏదో కాలేజీలో..."

"ఎలా పట్టావ్!"

"ఓమారు హోటల్కొచ్చి నా బ్యాండ్ వినింది. నన్ను కలుసుకొంది. ఆమె అందం నన్ను పిచ్చివాణ్ణి చేసింది. ఆ రోజంతా నాతోనే వుంది. ఇద్దరం పెళ్ళాడుదామను

తున్నాం. వాళ్ళ అమ్మకూ, నాన్నకూ ఇష్టముండదట. అందుకు ఇలా వెళ్ళిపోతున్నాం" అన్నాడతను.

"మిస్టర్ పతీ! ఆమె చాలా అమాయకురాలులా వుంది. నువ్వామెను పోషించగలవా?" అడిగాడు ఆనంద్.

"ప్రయత్నిస్తాను."

"పోషించలేని నాడు నువ్వేంచేస్తావో ఆమెకు తెలుసా? నీలాంటివాళ్లు ఆమె అందాన్ని అమ్ముకుని తింటారు. అందరికీ సుఖాన్ని పంచియిచ్చి, సుఖరోగాలు వంటికెక్కించుకొని, కుష్ఠురోగిగానో, లేదా కాన్సరు వ్యాధిగ్రస్తురాలిగానో మాడిపోయి దిక్కులేనిచావు చచ్చేట్లు చేస్తారు" అన్నాడు ఆనంద్.

"నో! నేనలాంటివాణ్ణి గాదు" అన్నాడు పతి.

"నీ సంగతి త్వరలోనే ఆమెకు తెలిసొస్తుంది. నిజానికి నేను ఇద్దరమ్మాయిల్ని నాశనం చేశాను, ఇంతదాకా" అన్నాడు ఆనంద్.

ఆ అమ్మాయి భయంగా ఇద్దరివంకా చూసింది. పతి భుజంమీద చెయ్యివేసి ఘట్టిగా నొక్కాడు ధైర్యం చెప్తున్నట్లు.

"అమ్మాయ్? నీ పేరేమిటి?"

"రేఖ!" అంది మెల్లగా.

"నీ జీవితరేఖ ఎలా వుందో? నాకు మత్తుగా నిద్ర వస్తూంది. పడుకుంటాను. మీరు విజయవాడలో దిగి పోతారా?" అడిగాడు ఆనంద్.

"ఆఁ!" అన్నాడతను.

"దిగేప్పుడు నన్ను లేపండి!"

"అలాగే!"

ఆనంద్ బాండ్ కేస్ తలక్రింద పెట్టుకొని, కాళ్లు జాపుకుని పడుకున్నాడు. రెండు నిముషాలకల్లా అతను గాఢ నిద్రలో మునిగిపోయినట్లు, అతను పెడుతున్న గురక ద్వారా నిర్ణయించుకున్నారు రేఖా, పతీ.

## 2

రేఖ లోయర్ బెర్త్ పైన పడుకుంది.

ఎంత ప్రయత్నించినా ఆమెకు నిద్దర రాలేదు. ఆనంద్ అన్న మాటలే ఆమె మెదడులో గిర్రున తిరుగసాగాయి. తను తొందరపడినట్లు తోచింది. ఎంతోమంది మగవాళ్లు తన్ను ప్రేమించారు. వెంటబడ్డారు. తను లొంగలేదు. అలాంటిది పతికెలా లొంగిపోయింది.

ఆరాత్రి అతన్ని లాన్ లో కలుసుకుంది. అతని బ్యాండ్ వాయిద్యం చాలా బాగుందని మెచ్చుకుంది. వాయించడంలో తనకు అన్ని రంగాల్లోనూ చాలా అనుభవం, నేర్పు వుందని చెప్పి నవ్వాడు. తనూ నవ్వింది. అంతే! అతను చటుక్కున కౌగలించుకుని పెదాలు జుర్రుకుంటూ ముద్దు పెట్టుకున్నాడు. తను వివశురాలై పోయింది. అతని స్పర్శకు తనలో ఏదో కరెంటు ప్రవహించింది.

పతికి బాగా అనుభవం వుండడంతో ఆమెను మెల్లగా హోటల్ లోని తన గదికి నడిపించుకెళ్ళాడు. బ్రాందీ త్రాగించాడు. బట్ట లూడదీయించి, లైటార్పాడు.

ఆ తర్వాత జరిగిందంతా ఆమెకు మసకగా తెలుసు. కాని మత్తెక్కిన వొంటికి మంచి కసరత్తు దొరికిం దనిపించింది. మగతగా నిద్రపోయింది.

అదిమొదలు పతంటే రేఖకు పిచ్చిపట్టిపోయింది.

రోజూ రావడం మొదలెట్టింది. ప్రేమ ముదిరింది.

వెళ్ళేదువుందా మనుషనేదాకా వచ్చేశాక, ఇద్దరూ అక్క డ్నుంచి పారిపోవాలనుకున్నారు.

రేఖకు తల్లి గుర్తొచ్చింది. చాలా అందంగా వుంటుంది. తండ్రి సంపాదన చాలదు ఆమె అలంకరణలకు. అందుకే చిరుతిండ్లు ప్రారంభించింది. తండ్రికి ఆమె సంగతి తెలిసినా పట్టించుకోవడం మానేశాడు. పిల్లలకోసం, ఆమెను అంటి పెట్టుకుని వుండడం అలవాటు చేసుకొన్నాడు.

తన వెనుక ఇద్దరు తమ్ముళ్లు, ఒక చెల్లెలు వున్నారు. ఇంట్లోంచి వచ్చేప్పుడు డబ్బు తెద్దామనుకుంది. ఎక్కడ వెతికినా కనుపించలేదు.

పతి స్టేషనుకు రాగానే "డబ్బెంత తెచ్చావ్?" అని అడిగాడు.

తను ఏమీ తీసుకురాలేదని చెప్పగానే అతని మొహం వివర్ణమైంది. అంతలోనే అతను "నా దగ్గరకూడా ఎక్కువ లేదు" అన్నాడు.

విజయవాడలో దిగాక ఏం చెయ్యాలో,ఎలా బ్రతకాలో, ఎక్కడుండాలో, ఆమెకు అర్థంగాలేదు. అవన్నీ ఆలో చించడం పతి వంతనుకుని, తను పడుకుంది కళ్లు మూసుకుని. నిద్రొచ్చింది.

ఎవ్వరో చెయ్యేసినట్లు తోచి కళ్లు తెరచింది రేఖ.

బ్లూ బల్బ కాంతిలో కనుపించాడు పతి.

చేతులు రెండూ ఛాతీకి అడ్డంగా పెట్టుకొని "ఇప్పు డొద్దు!" అంది.

"అందుకాక్కాదు!" అన్నాడు మెల్లగా.

రైలు స్లోగా పోతూంది. స్టేషను రాబోతూందని గ్రహిం చాడు పతి.

"మరెందుకు?" రహస్యంగానే అడిగింది రేఖ.

"అతను గాఢనిద్రలో వున్నాడు. బాగా త్రాగి పడుకున్నాడు. బ్రాండ్ కేస్‌లో డబ్బుంది. రివాల్వరుగూడా వుంది. నా దగ్గర డబ్బులేదు. దాన్ని చిన్నగా లాక్కొని మనం దిగి వెళ్ళిపోదాం. మనం సంపాదించుకునేందుకు మరో మార్గం వెతుక్కునేదాకా మనకది ఆదరువుగా వుంటుంది!" అన్నాడు పతి ఆనందంగా.

"అతను నిద్రలేస్తే..."

"త్రాగుడు మైకంలో వున్నాడు."

"దొంగతనం నేరం!"

"విధి లేనప్పుడు నేరం కాదు. నువ్వు సూట్ కేస్ తీసుకొని వెలుపలకు వెళ్ళి గుమ్మందగ్గర నిలబడు. నేను చిన్నగా కేస్ లాక్కొని వచ్చేస్తాను" అన్నాడు పతి.

"తప్పదా?" అడిగింది రేఖ.

తప్పదన్నట్లు చూశాడు పతి.

రేఖ సూట్ కేసందుకుని మెల్లగా వెలుపల కెళ్ళిపోయింది. ఆమెతోపాటు పతికూడా వెళ్ళాడు. డోర్ తెరచి, వాచీ చూశాడు. ఒంటిగంట కావస్తూంది. నెల్లూరు స్టేషను రాబోతూందని తెలుసుకున్నాడు.

డోర్ ప్రక్కనేవున్న మేడవ్ స్టూలుపైన కూర్చున్న అటెండెంటు కళ్ళు నులుముకుని చూస్తూ "ఇక్కడ దిగిపోతారా?" అడిగాడు.

"ఆఁ! వచ్చేది నెల్లూరే గదూ?" అడిగాడు పతి.

"అవును. ఇంకో ఐదు నిముషాల్లో స్టేషను వస్తుంది. విజయవాడ వెళ్ళాలన్నారుగా?" అడిగాడు అటెండెంటు.

"ఆవిడకు కడుపులో నొప్పిగా వుందట. ఇక్కడే

దిగేద్దామంది" అన్నాడు పతి.

రైలు నెల్లూరు స్టేషనులో ఆగే ప్రయత్నంలో వుంది.

"రేఖా! చిన్న సూట్ కేస్ ఎక్కడ?" అడిగాడు పతి.

"లోనే వుంది. మరచిపోయినట్లున్నాను. త్వరగా తీసుకు రండి!" అంది.

పతి లోనికి వెళ్ళాడు.

ఆనంద్ కేసి క్షణం చూశాడు.

"మిస్టర్! మిస్టర్!" అని రెండుసార్లు పిలిచాడు.

ఆనంద్ లో కదలిక లేదు.

వంగి తలక్రిందున్న బాండ్ కేస్ మెల్లగా లాగాడు. సులభంగానే వచ్చేసింది. ఒక్క ఉదుటున కంపార్టుమెంటు లోంచి వెలుపలికొచ్చి, బండి మోషన్ లో వుండగానే క్రిందకు దూకాడు. రేఖ ఆగాక దిగుదామన్నట్లు చూస్తూ నిల్చుంది. త్వరగా దూకమన్నాడు. ఆమె కూడా దూకింది. రైలు వాళ్ళను దాటి ముందుకుపోయింది. ఇద్దరు వెనక్కు పరుగెత్తుకొని పోయి, లైన్లు దాటి గూడ్స్ షెడ్ వైపు వెళ్లి పోయారు.

"అతనొస్తున్నాడేమో చూడు!" అంది రేఖ.

గూడ్సుబండి చాటు చేసుకొని, చక్రాల మధ్యగా వంగి చూశాడు. ఎవ్వరూ కనుపించలేదు పతికి.

"అమ్మయ్య!" అనుకొని నిట్టూర్చాడు.

పెద్దగా రైలుకూత వినిపించింది.

"బండి వెళ్ళిపోయినట్లుంది" అన్నాడు పతి.

"ఆఁ! అలాగే వుంది. అయినా ఇదేం పాడు పని. నాకు దొంగలంటే అసహ్యం! నువ్వింత నీచానికి పాల్పడతావని నేననుకోలేదు!" అంది రేఖ.

"నాక్కూడా అసహ్యమే! కానీ నీకోసం చేశాను. ఆకలికి ఇద్దరం తట్టుకోలేక చావడం ఇష్టంలేక ఈ పని చేశాను" అన్నాడు పతి.

ఇద్దరూ గూడ్స్ షెడ్ దాటి, పెట్రోలు బంకు ప్రక్క నుండి మెయిన్ రోడ్ పైకి వచ్చారు. బస్ స్టాండ్ ముందు కాకా హోటళ్ళలో రిక్షావారు టీలు త్రాగుతున్నారు. రోడ్ చీకట్లో దయ్యంలావుంది.

పతినీ, రేఖనూ చూడగానే రిక్షావాళ్ళిద్దరు పరుగెత్తుకొచ్చారు.

ఒక రిక్షాలో ఎక్కి కూర్చుని "లాడ్జింగ్ హవుస్ కు పోనీ!" అన్నాడు పతి.

రిక్షా కదిలించి "అన్నపూర్ణా హోటల్ కు తీసుకెళ్తాను" అన్నాడు రిక్షావాలా.

"హోటల్ బాగుంటుందా?" అడిగాడు పతి.

"ఓ బ్రహ్మాండంగా వుంటుంది" రిక్షావాలా సమాధానం చెప్పాడు.

## 3

రైలు ప్లాట్ ఫామ్ దాటబోయేలోగా ఆనంద్ సామాను సర్దుకున్నాడు. బాండ్ కేస్ పతి దొంగిలించుకుపోయాక అతనికి మిగిలింది చిన్న హేండ్ బ్యాగ్ మాత్రమే. దాన్ని చేత్తో పుచ్చుకుని, క్రిందకు దూకాడు.

అంటెండెంటుకి అతను అమాంతంగా, అలా అమాంతంగా దూకేయటం అంతుపట్టలేదు.

ఆనంద్ స్టేషనులోంచి వెలుపలకొచ్చాడు.

రిక్షావాళ్ళు ఈగల్లా మూగారు.

"దొరా! నేను మిమ్మల్ని మంచి హోటల్లో దిగబెడ

తాను. ఎక్కండి!" అన్నాడొకడు.

మారుమాట్లాడకుండా ఎక్కి కూర్చున్నాడు ఆనంద్. అతనికి పతిమీద కోపం కళ్ళదాకావుంది. పట్టుకుని ఎముకలుసి విరిగేలా తన్నాలని తీర్మానించుకున్నాడు. అతనెప్పుడూ నెల్లూరురాలేదు. అయితే వూరిగురించి విన్నాడు. అదేం పెద్ద సిటీగాదనీ, వాళ్ళిద్దరినీ పట్టుకోవడం అంతకష్టం కాదనీ ఊహించుకున్నాడు.

బృందావనంలోవున్న అన్నపూర్ణ హోటల్ ముందాగింది రిక్షా. ఆనంద్ దిగి వాడికి రెండురూపాయల కాగితం అందించాడు. బ్యాగ్ పట్టుకొని రిసెప్షను కౌంటరు దాకా వచ్చాడు ఇచ్చిన బాడుగకు మురిసిపోతూ రిక్షావాడు.

"లేచొచ్చిన జంటలాగుంది. గదిలో కెళ్ళగానే నన్ను వెళ్ళిపొమ్మన్నారు. ఠక్కున తలుపులు మూసుకున్నారు. మంచినీళ్లుకూడా పెట్టనివ్వలేదు" చెప్తున్నాడు బాయ్ కౌంటర్లోనున్న వ్యక్తితో. ఆ మాటలు విన్నాడు ఆనంద్.

కొంపదీసి పతి రేఖకూడా ఆ హోటల్లోనే దిగారాన్న అనుమానం కలిగింది.

"రూం కావాలి!" అన్నాడు ఆనంద్.

"చక్కటిగది వుండింది. ఇంతకుముందే ఇచ్చేశాం. సారీ సార్!" అన్నాడు కౌంటర్లోని వ్యక్తి.

"అర్ధరాత్రి! ఇప్పుడెక్కడికని వెళ్ళేది. ఎలాగోలా ట్రై చెయ్యండి. రూం ఎలాగున్నా ఫర్వాలేదు" అన్నాడు ఆనంద్.

"అయితే ఒకపని చెయ్యండి. మీలగేజి ఇక్కడ పెట్టుకొని, ఈ రాత్రికి పైన టెర్రెస్‌లో పడుకోండి. అక్కడ మీకు మంచం పరుపు వేయిస్తాను. తెల్లారగానే ఏదో

ఒక రూం ఇస్తాను" అన్నాడు కౌంటరువాలా.

"అలాగే!" అంటూ తన హాండ్ బ్యాగ్ అక్కడే పడేశాడు.

అక్కడ నిలిచున్న బాయ్‌ని, ఆనంద్‌కు పక్క ఏర్పాట్లు చూడమని పురమాయించాడు కౌంటర్ వాలా.

బాయ్ ముందు, ఆనంద్ వెనుక నడవసాగారు. నడవకటూ ఇటూ రూంలున్నాయ్. సీసాల కదలికలు, గాజుల చప్పుళ్ళు, ఉస్సురుస్సులంటూ ఊపిరి పీల్చుకుంటున్న సవ్వడులు వినవచ్చాయి.

"ఏమోయ్? మీ హోటల్లో అన్నిరకాల సరుకూ దొరుకుతుందా?" అడిగాడు ఆనంద్.

"చిత్తం బాబూ! కానీ ఇప్పుడు అర్ధరాత్రయిందిగా. అమ్మాయిలు దొరకరు. మందుమాత్రం చిక్కుతుంది. తెమ్మంటారా?" అడిగాడు బాయ్.

"వద్దు! నాదగ్గరేవుంది. అమ్మాయికావాలి!" అన్నాడు.

"రేపుగూడా వుండండి. హైక్లాస్ సరుకు తెస్తాను" అన్నాడు బాయ్.

ఇద్దరూ మేడపైకి వచ్చేశారప్పటికే.

ఒక్కనిముషంలో మంచం వేసి, పరుపు పరచి దానిపైన తెల్లటి దుప్పటి వేశాడు బాయ్.

"ఇంతకుముందు ఎవరికన్నా రూం ఇచ్చావా?" అడిగాడు కూర్చుంటూ.

"అవును సార్! డబుల్ రూం ఇచ్చాం. లేచొచ్చిన జంటలాగుంది. మైల్లోదిగి వచ్చినట్లుంది" అన్నాడు బాయ్.

"ఆ అమ్మాయి బాగుంటుందా?"

"మంచి పొడుగు సార్. పాంటు చొక్కా వేసుకుంది

అబ్బాయిలా, బొమ్మలు బలేవున్నాయి. వాట్ని చూసి ఆడ పిల్లని తెలుసుకున్నాను. లేకుంటే మగాడనుకోవలసిందే!" అన్నాడు.

"వాళ్ళదగ్గర నల్లటి సూట్ కేస్, చిన్న బాండ్ కేస్ వున్నాయికదూ!" అడిగాడు ఆనంద్.

"అవును సార్! మీకెలా తెలుసు."

"నేను వాళ్ళను వెంటాడుతూవచ్చాను. ఆపిల్లని నేను పెళ్ళాడాలి. మా అక్కకూతురు. మాకు చెప్పకుండా వచ్చేసింది' అన్నాడు ఆనంద్.

"అలాగా!" అంటూ బుర్ర ఊపాడు బాయ్.

"నువ్వు నేను ఇక్కడున్న విషయం వాళ్ళకు తెలియకుండా చూడాలి" అన్నాడు ఆనంద్.

"అలాగేసార్! మీరేం చెప్పినా చేస్తాను. నాపేరు బాబు" అన్నాడు బాయ్. ఆ తర్వాత అతను వెళ్ళిపోయాడు.

ఆనంద్ మంచంపైన పడుకొన్నాడు. ఆకాశంలో చంద్రుడు, చుట్టూ నక్షత్రాలు కనుపించాయి. వాటిని చూస్తూ, సిగరెట్ కాలుస్తూ, ఆలోచించసాగాడు.

తను బయలుదేరినపని గుర్తొచ్చింది. విజయవాడ వెళ్ళాక తనకు సాయం వుండేందుకు ఎవరినన్నా సంపాదించాలని ఆలోచించాడు బయలుదేరేముందు. పతి, రేఖ తన్ను రైల్లో కలసింది మొదలు, ఎలాగైనా వాళ్ళను తన ఉచ్చులో చిక్కించుకోవాలని తీర్మానించుకున్నాడు. దానికి తోడు వాళ్ళు తన సూట్ కేసును దొంగిలించడం, పలాయనం చిత్తగించడంతో, పతి, రేఖా తన చేతిలో చిక్కినట్లే భావించాడు.

పతి చూపులు, మాటలు, నడకా గుర్తొచ్చాయి. అతను పెద్ద క్రిమినల్ అని తెలిసికొనడం పెద్దవిషయంగాదెవరికైనా. అలాంటివాడితోనే తనకు అవసరముంది. ఎలా వల్లో చిక్కించుకొనడమాని ఆలోచిస్తూ కూర్చున్నాడు. సిగరెట్లు ఒకదాని వెంట ఒకటి తగలబడిపోతున్నాయి.

## 4

బాయ్‌ను వెలుపలకు పంపి తలుపులు మూశాడు టక్కున పతి. రేఖ మంచంపైన కూర్చుంది.

“మన ప్రేమప్రయాణం వండరఫుల్ గా ప్రారంభమైంది. భగవంతుడే మనపైన కరుణించి, ఆవాజమ్మను మనకు అందించాడు. మడ్డి వెధవ. తాగి నిద్రపోయాడు. మెలకువరాగానే చూసుకుని ఏడుస్తాడు” అన్నాడు పతి బాండ్ కేస్ తెరుస్తూ.

“ఏమో? మనల్ని వెతుక్కుంటూవస్తే” అనుమానంగా అంది రేఖ.

సూట్ కేస్ తెరచుకుంది.

లోపల ఖాళీగావుంది.

చూడగానే పతికి కళ్ళు బైర్లుకమ్మాయి. తల దిమ్మెక్కిపోయింది. “రేఖా! ఇందులో ఏమీ లేదు!” అన్నాడు పతి.

రేఖ ఒక్క వుదుటున అతని దగ్గరకెళ్ళి చూసింది. సూట్ కేస్ బోసిగావుంది. తమ ప్లాను తల్లక్రిందులయినందుకు తల్లడిల్లిపోయారిద్దరూ.

“ఇందులో డబ్బుందిగదాన్న ధైర్యంతో వున్న యాభై రూపాయలూ, హోటల్ వాడికిచ్చాను” అన్నాడు పతి.

“మనగతేమిటి?” అడిగింది రేఖ.

“అతను మధ్యలో నిద్రలేచాడా?”

“ఏమో నేను గమనించలేదు. నేనుకూడా కాసేపు నిద్ర

పోయాను."

"వాడు మనల్ని అనుమానించి ముందే జాగ్రత్తపడ్డాడు. ఇప్పుడు మనం అన్నిటికీ చెడ్డాం. ఇక్కడ్నుంచి ఎలా వెళ్ళాలి?" తనలోతనే పెద్దగా అనుకున్నాడు పతి.

"పోనీ మద్రాసు వెళ్ళిపోదాం!" అంది రేఖ.

"దానికయినా నడవాల్సిందే! నా దగ్గర రూపాయిగూడా లేదు."

"నా దగ్గర పాతిక రూపాయ లున్నాయి."

"ముందే ఎందుకు చెప్పలేదు. ఇప్పుడిక మనం చేసేదేమీ లేదు. నిద్రపోదాం! తెల్లారి లేచాక ఏంచెయ్యవలసిందీ ఆలోచించుకుందాం!"మంచంమీద నడుంవాలుస్తూ అన్నాడు పతి.

రేఖకు భయంగావుంది. రైల్లో అతనన్నట్లు, అవసరమొస్తే తనను బజార్లో పెట్టి అమ్మేందుకయినా పతి వెనుకాడడేమో ననిపించింది.

తను కాలు జారిపోయింది. శీలం పోగొట్టుకుంది. వెనక్కి వెళ్ళి అందరిచేత అవమానం పాలుగావడంకన్నా ధైర్యంగా ముందుకు వెళ్ళడమే మంచిదనిపించింది.

ఆ కేస్‌లో డబ్బు, రివాల్వరు, బ్రాందీసీసాలు ఎలా మాయమయ్యాయో ఆమెకు ఎంత ఆలోచించినా అర్థం గాలేదు. తను నిద్రపోనేలేదు. మేల్కొనే వుంది. ఆనంద్ లేవలేదు. మరి అతను ఎప్పుడు జాగ్రత్తపడి వుంటాడు?,

రైలు దిగబోయే ముందు తామిద్దరూ వెలుపల కొచ్చారు. ఆ తర్వాత పతి తిరిగి లోనికి వెళ్ళాడు కేస్ తెచ్చేందుకు. ఆలోగా ఆనంద్ తనసామాన్లు తీసేసుకుని వుంటాడనుకుంది రేఖ.

ఆలోచిస్తూనే నిద్రపోయింది. పతిగూడా నిద్రపోయాడు.

ఎవరో తలుపులు దబదబ బాదిన శబ్దమైంది. పతి చటుక్కున లేచి కూర్చున్నాడు. రేఖగూడా లేచింది. వాచీ చూసింది. ఐదుగంటలయింది. కిటికీ కవతల చీకటి దట్టంగా పేరుకు పోయుంది ఇంకా.

"ఎవరండీ?"

"హోటల్ బాయ్ వచ్చాడేమో?" అంటూ లేచివెళ్ళి తలుపుతీశాడు పతి.

తెరచిన తలుపుల మధ్యనుండి గాల్లో కెగిరిన బూటుకాలు పతి ముక్కుకి తగిలింది. దిమ్మ తిరిగిపోయింది. వెనక్కి వెళ్ళి కిందపడిపోయాడు.

ఆనంద్ లోనికొచ్చి తలుపులుమూసి గొళ్ళెంపెట్టాడు. రేఖ మంచంపైన మూలగా వెళ్ళి నిలుచుంది భయంతో అదిరిపోతూ.

క్రిందపడ్డ పతి చొక్కాకాలరు పట్టుకొని ఎడంచేత్తో పైకెత్తి కుడిచేత్తో ఆ చెంపా, ఈ చెంపా వాయించేశాడు ఆనంద్. దెబ్బ తగిలినప్పుడల్లా 'ఛెళ్ ఛెళ్'మని శబ్దం వేసింది.

పతికి ముక్కు అదిరి, రక్తం కారడం మొదలెట్టింది.

"మిస్టర్! ఇంక కొట్టకు. అతను ఛస్తాడు" అంది రేఖ ధైర్యం తెచ్చుకొని.

"చాలనీ! లోగ్. నా బ్రాండ్ కేస్ దొంగిలించుకొని పోతాడా? నే నెవరనుకున్నాడు?" అన్నాడు ఆనంద్ గర్వంగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

"నేను చెప్పాను. వినలేదు. అయినా అందులో సామానంతా తీసేసుకున్నావుగా? మళ్ళీ ఇలా వచ్చి అతన్ని తన్నట మెందుకు?" అడిగింది రేఖ.

"మీ సంభాషణ విన్నాను గాబట్టి బ్రతికిపోయాను. లేకుంటే, నా జీవితలక్ష్యం, నా కర్తవ్యం, నా పట్టుదల, పని, మొత్తం సర్వనాశనమయ్యేవి. ఆ డబ్బును నేను ఎంతో కష్టపడి సంపాదించాను. ఆ రివాల్వరు దొంగిలించేందుకు ఒక పోలీసు ఆఫీసరు యింట్లో ఆరునెలలు పనిచేశాను. తెలుసా?" అన్నాడు ఆనంద్.

"మమ్మల్ని క్షమించు. ఇక నీ జోలికిరాము. మా దారిన మేం పోతాం!" అంది రేఖ.

"అలా వీలుకాదు! మీరు నా దారికి రావాలి! నాకు మీ సాయంకావాలి. నాసాయం మీకుంటుంది. డబ్బుకు ఏవిధమైన లోటులేకుండా చేస్తాను" అన్నాడు ఆనంద్.

"నువ్వు ఏం చెప్పినా చేస్తాను. మాకు డబ్బుకావాలి, అంతే!" అన్నాడు మెల్లగా లేచి నిలుచుంటూ.

"మళ్ళీ పిచ్చిపిచ్చి వేషాలువేస్తేఇద్దర్నీ కాల్చిపారేస్తాను. నమ్మకద్రోహం నేను సహించను" అన్నాడు ఆనంద్.

"అలాంటిది జరగదు" అన్నాడు పతి.

"అయితే ఈ క్షణంనుండి మనం ముగ్గురం ఒకటి. ఇవాళ ఇక్కడ్నుంచి విజయవాడ వెళ్ళిపోదాం. అక్కడ మీరు మంచి హోటల్‌లో గది తీసుకోండి. మీకు రెండువేలిస్తాను. రేపు మధ్యాహ్నం క్రిష్ణాబారేజిపైకి రండి. అక్కడ కలుసుకుందాం. అప్పుడు మీరు ఏ హోటల్‌లో ఏ రూంలో దిగిందీ చెప్పండి. ఆ తర్వాత మీరేం చెయ్యవలసిందీ చెప్తాను" అన్నాడు ఆనంద్.

"హత్యలు మాత్రం చేయించవద్దు నాచేత" అన్నాడు పతి అనుమానంగా.

"అలాంటి అవసరం వుండదు. ధైర్యంగా వుండండి.

మీరు భార్యాభర్తలుగా రిజిస్టరు చేసుకోండి. దర్జాగా వుండేందుకు ప్రయత్నించండి," అన్నాడు ఆనంద్ జేబు లోంచి డబ్బుతీసియిస్తూ.

## 5

కంట్రాక్టరు మాధవరావు ఆఫీసు గదిలో కూర్చున్నాడు. ఇద్దరు ఇంజనీర్లు ఆయన కెదురుగా ఆసీనులై వున్నారు. వాళ్ల చేతుల్లో కట్ గ్లాసులనిండా పసుపుపచ్చరంగు ద్రవంవుంది. దాన్ని అమృతంలా అప్పుడప్పుడు చప్పరిస్తున్నారు.

"మీ కోపరేషన్ వల్ల వర్కు పూర్తయింది. మీ కిస్తా నన్నది మొత్తం లక్షరూపాయలు. అందులో యాభై వేలు మీకు ముట్టాయి. మిగిలిన యాభై వేలు ఇస్తాను పట్టుకు పోండి!" అన్నాడు మాధవరావు.

"మీలాంటి నీతిపరులు కావాలి దేశానికి" అన్నారిద్దరూ ముక్తకంఠంతో, తమ అవినీతికి ఆయన అణాపైసలతో లెఖ్ఖ గట్టి ఇస్తున్నందుకు ఆనందిస్తూ.

ఇంటినౌఖరువచ్చి ఉత్తరాలబొత్తి తెచ్చిపెట్టాడు.

డబ్బు వాళ్ళకందించాడు. అందుకుని కరచాలనంచేసి వెళ్ళిపోయారిద్దరూ.

ఒక్కొక్క ఉత్తరం చదివి ప్రక్కన పెట్టసాగాడు.

నీలంరంగు కవరొకటి చించిలోనున్న తెల్లకాగితం తీశాడు. దానిపైన ఎర్రసిరాతో గుండ్రంగా రాసిన అక్షరాలు కనిపించాయి. అన్నింటినీ కలిపి చదివాడు. అతని ముఖంలోకి నెత్తురు తన్నుకొచ్చింది. అందులోవున్న అక్షరాల్ని మళ్ళీ మననం చేసుకొన్నాడు.

"ఈ రాత్రి తొమ్మిది గంటలకు నీ చావు మూడింది. ఎదురుచూడు" అని రాసివుందా కాగితంపై.

క్రింద సంతకంలేదు. తనకలాంటి హెచ్చరిక ఎవరు పంపివుంటారు? ఎంత ఆలోచించినా పసిగట్టలేకపోయాడు. వ్యాపారరీత్యా ఎందరో విరోధులున్నారు. ఎంత శత్రుత్వమున్నా తన్ను చంపేందుకు ఎవ్వరూ సాహసించరు. అందులోనూ ముందు హెచ్చరించి మరీ చంపడం అసాధ్యం. అతనికి మతిపోయింది.

అల్మైరా తెరచి విస్కీసీసా తీసుకున్నాడు. గ్లాసునిండా వొంచుకుని, ఒక్క గుక్కలో త్రాగాడు.

పోలీస్ సూపరింటెండెంటు తనకు ఫ్రెండు. ఈ ఉత్తరం గురించి అతనికి చెప్దామనిపించింది. అయినా ఇష్టంలేకపోయింది. తన్నుతనే పదిమందిముందూ అల్లరిపెట్టుకొన్నట్లవుతుందేమోననిపించింది.

తొమ్మిది గంటలు.

ఆ టైములో తనెక్కడుంటాడని హంతకుడు అంతఖచ్చితంగా తన్ను చంపుతానని బెదిరించాడు. అతనికి వెంటనే రజని గుర్తుకు వచ్చింది. ప్రతిరోజూ వూళ్లో వున్నప్పుడల్లా తొమ్మిది గంటల్లోపునే ఆమెఇల్లుచేరుకోవడం తనకలవాటు. బహుశా ఈ విషయం తెలుసుకొని తన్ను అక్కడ చంపాలనుకున్నాడేమో?

ఎలా సాధ్యం? తనివాళ ఆమెదగ్గర పోకుంటే ఏమవుతుంది? ఒకవేళ ఆమే ఎవరినన్నా తన్ను చంపేందుకు వినియోగించదలచుకుందాం. రజనిని తను పదహారేళ్ళనుండి వుంచుకుని వున్నాడు. భార్యకన్నా ఎక్కువ అంకితమైపోయింది తనకామె. అలాంటామె తన్ను చంపించేందుకు పాల్పడుతుందా?

తను చనిపోయినందువల్ల ఆమెకు లాభించేదేమీ లేదు.

ఆ స్త్రిలో ఆవగింజంత వాటారాదు. రజినిని అనుమానించడంలో అర్థంలేదనిపించింది మాధవరావుకు. ఆ ఉత్తరాన్ని మడచి లాల్చీ జేబులో పెట్టుకున్నాడు.

రజినికి తనా రాత్రికి రావటంలేదని ఫోన్ చేశాడు.

భార్యను పిలిచి రాత్రి పదింటికి కార్లో హైద్రాబాద్ వెళ్తున్నానని చెప్పాడు. ఆఫీసుకు ఫోన్ చేసి మధ్యాహ్నం మద్రాసు పోవాలనుకుంటున్నానని కబురుచేశాడు.

అలా ఒక్కొక్కరికి ఒక్కోరకంగా చెప్పడంలో అతని ఉద్దేశ్యం? ఆ రోజురాత్రి తొమ్మిది గంటలకు తనేంచేద్దామనుకుంటున్నాడో! ఎవ్వరికీ తెలియకూడదన్న తపన తప్ప మరేంలేదు. నిజానికి ఆ టైమ్‌కు ఎక్కడుండాలో ఏం చెయ్యాలో తనకే అర్థంగాలేదు.

తాగుతూనే కూర్చున్నాడు సాయంత్రం దాకా. మధ్యలో ఒక్కమారు లోనికివెళ్ళి అన్నంతిని వచ్చాడు.

ఐదుగంటల ప్రాంతంలో ఫోన్ మ్రోగింది.

రిసీవరు పైకెత్తాడు. "హాలో" అని అరిచాడు.

"నేనండీ విమలాదేవిని మాట్లాడుతున్నాను. మావార్ని ఎవరో హత్యచేశారు?" అంది.

"రామ్మూర్తిగారివా?" అడిగాడు ఆతృతగా మాధవరావు.

"అవునండీ!"

"నేను వస్తున్నాను" అంటూ ఫోన్ కట్ చేశాడు.

రామ్మూర్తి పెద్ద ఇంజనీరు. గవర్నమెంటు సర్వీసులో వుండేవాడు. మాధవరావు కంట్రాక్టులు ప్రారంభించిన కొత్తలో ఇద్దరూ స్నేహితులైనారు. ఆ తర్వాత కొన్ని సంవత్సరాలకు రామ్మూర్తి ఉద్యోగం మానేసి మాధవ

రావుతో భాగం పెట్టాడు.

మాధవరావు ఎక్కివచ్చిన కారు రామ్మూర్తి ఇంటిముందాగింది. కాంపౌండ్ నిండా జనం వున్నారు. పోలీస్ వాన్ వెలుపలేవుంది. జనాన్ని త్రోసుకుని లోనికి వెళ్ళాడు.

రామ్మూర్తి శరీరం రక్తంతో తడిసివుంది.

"ఏం జరిగింది?" అడిగాడు ఇన్స్పెక్టర్ను.

"ఏముంది? ఎవడో కాంపౌండ్ వెలుపలనుండి పోర్టికోలో కారు దిగుతున్న రామ్మూర్తిగారిని రివాల్వరుతో కాల్చిచంపాడు."

"అతన్నెవరూ చూడలేదా?"

"లేదు! నల్ల అంబాసిడర్ కారులో వెళ్ళిపోయాడని కొందరంటున్నారు."

మాధవరావు రామ్మూర్తి పైకివంగి చూశాడు. గుండెకు పైగా, రివాల్వరుగుండు దూసుకుపోయిన గాయం కనుపించింది. పోలీసులు ఫోటోలు తీయటం ముగించాక, శవాన్ని పోస్ట్మార్టం చేసేందుకు, అంబులెన్సుకు తరలించారు.

మాధవరావు లోనికి వెళ్లాడు. విమలాదేవి విచారిస్తూ కూర్చునుంది. "అన్నయ్యా!" అంటూ బావురుమని ఏడ్చింది.

"ధైర్యం తెచ్చుకో అమ్మా! ఆయనకు చావు ఇంతత్వరగా ఈ రూపంలో వస్తుందని నాకు తెలీదు" అన్నాడు కళ్లు తుడుచుకుంటూ.

ఇన్స్పెక్టర్ లోనికొచ్చాడు. విమలాదేవి ఏడుస్తూనే ఆయనకు నమస్కారం చేసింది.

"అమ్మా! మీకు జరిగిన అన్యాయం తలచుకొంటే నాకు విచారంగావుంది. మీవారికి ఎవరన్నా విరోధులున్నారా?" అడిగాడు.

"వాడికి విరోధులేమిటండి! చాలా మంచివాడు!" అన్నాడు మాధవరావు.

"సారీ! మీరిద్దరూ స్నేహితులుకదూ! వారిగురించి మీకే ఎక్కువ తెలిసుండాలి. చెప్పండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"తెలిసేందుకేముంది. పనితప్ప మరో ప్రాపకంలేనివ్యక్తి. నమ్మకస్తుడు. అందరితోనూ మంచిగావుంటాడు" అన్నాడు మాధవరావు.

"కానీ అతని కెవరో విరోధులున్నారన్నది సత్యం. ఈ కవరు చూడండి" అంటూ జేబులోంచి నీలంరంగు కవరు తీసి చూపించాడు.

దాన్ని చూడగానే మాధవరావు కళ్ళు పైకెక్కమ్మాయి. శరీరం స్వాస్థత్వం తప్పిపోయింది. తూలిపడబోయాడు.

ఇన్‌స్పెక్టర్ పడకుండా పట్టుకున్నాడు.

మాధవరావు తమాయించుకుని నిలబడ్డాడు.

"ఏమిటలాగయిపోయారు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"రామ్మూర్తి చావు నన్ను కాస్త కలవరపెట్టింది" అన్నాడు తన భయం బయట పడనీయకుండా జాగ్రత్తపడు తున్నట్లు.

"ఈ కవరులో ఉత్తరం వుంది" అంటూ చిన్న తెల్ల కాగితం వెలుపలకు లాగాడు. దాన్ని పెద్దగా చదివాడు. అందులోనూ "ఈ మధ్యాహ్నం మూడుగంటలకు నీ చావు మూడింది కాచుకో" అని వుంది.

రామ్మూర్తిని చంపినవ్యక్తే తన్ను చంపుతానని బెదిరించా డన్న విషయం మాధవరావుకు అర్థంకాగానే సగంప్రాణం పోయింది.

"మీరింతకుముందిలాంటి కవరు చూశారా?" అడిగాడు

ఇన్‌స్పెక్టర్.

"చూశానండీ!" అంటూ జేబులోంచి కవరు తీసి అందిస్తూ "నాకు రాత్రికి ముహూర్తం పెట్టాడు. ఎలాగైనా మీరే కాపాడాలి!" అన్నాడు ఏడుస్తూ మాధవరావు.

ఇన్‌స్పెక్టర్ ఉత్తరం పూర్తిగా చదివి "ఈ ఉత్తరాల్ని బట్టి చూస్తే అతనెవరో మీ ఇద్దరికీ విరోధిలా వున్నాడు. అందుకే ఇద్దర్నీ బెదిరించాడు" అన్నాడు.

"వాడెవరయివుంటాడాని ఎంతో ఆలోచించాను. తల బ్రద్దలు కొట్టుకున్నాను ఇప్పటిదాకా. నాకెవ్వరూ తోచడం లేదు. ఈ రాత్రికి ఊరొదిలి వెళ్ళిపోవాలనుకుంటున్నాను."

"అలాంటి పిచ్చిపని చెయ్యకండి. హంతకుడు తన పని సులభంగా నెరవేర్చుకునేందుకు మీరే వీలు కల్పించినట్లవుతుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అయితే నన్నేం చెయ్యమంటారు?"

"ఇంట్లోనే వుండండి. ఎక్కడికీ వెళ్ళకండి. మీకు సాయంగా వుండేందుకు నలుగురు పోలీసుల్ని పంపుతాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"మీరెలాగైనా వాడెవడో పట్టుకుని ఉరికంబ మెక్కించాలి" అన్నాడు మాధవరావు.

"అలాగే! మీరు ధైర్యంగా వుండండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

మాధవరావు విమలాదేవికి ధైర్యంచెప్పి, తనకుతనే ధైర్యం తెచ్చుకొని, తిన్నగా కారెక్కి ఇంటికి వెళ్ళాడు.

## 6

ఆనంద్ హోటల్‌లో కూర్చున్నాడు. తెల్లటి గుడ్డతో రివాల్వర్ శుభ్రంగా తుడిచి పెట్టుకున్నాడు. ఫోన్‌కాల్ కోసం ఎదురుచూస్తూ, గ్లాసు తర్వాత గ్లాసు బ్రాంది

త్రాగడం మొదలెట్టాడు.

ఫోన్ గణగణమంటూ మ్రోగింది.

రిసీవరు తీశాడు. "హల్లో!" అన్నాడు ఆనంద్.

అవతలవేపునుండి "నేనే!" నంటూ పతి కంఠం వినిపించింది.

"ఏమిటి విశేషాలు?" అడిగాడు ఆనంద్.

"అంతా అనుకున్నట్లుగానే జరిగింది. నిన్నెవరూ గుర్తుపట్టలేదు. కానీ కారును మాత్రం గుర్తుపట్టారు" అన్నాడు పతి.

"ఫరవాలేదు. ఆ కారు మనదిగాదు" అన్నాడు ఆనంద్.

"మీరు చూపించిన ఫోటోలోవున్న మనిషిలాంటి మనిషి రామ్మూర్తిగారింటికి వచ్చాడు. అతనూ, ఇన్‌స్పెక్టర్ ఇంట్లోకి వెళ్ళి చాలాసేపు తర్వాత తిరిగొచ్చారు. కారెక్కుతూ, ఇన్‌స్పెక్టర్‌తో ఇంట్లోనే వుంటాననీ, తనకు రక్షణగా నలుగురు పోలీసుల్ని పంపమని పురమాయించడం నేను విన్నాను" అన్నాడు పతి.

"గుడ్ వర్క్! నువ్వు సాయంత్రం ఏడింటికి స్టేషనుకిరా. నాలుగో ప్లాట్‌ఫామ్‌పైన నీకోసం కాచుకు వుంటాను— బైదిబై ఈ విషయాలు రేఖకు చెప్పావా?"

"లేదు!"

"చెప్పొద్దు. ఆడవాళ్ళ నోట్లో రహస్యం దాగదు."

"యస్ బాస్. మన తర్వాత కార్యక్రమం చెప్పలేదు" అన్నాడు పతి.

"అందుకే నిన్ను రమ్మంది" అంటూ ఫోన్ కట్ చేశాడు.

బ్రాందీ మరోగ్లాసు పుచ్చుకున్నాడు.

జేబులోంచి లావుపాటి కవరు వెలుపలకు లాగాడు.

అందులో ఐదు ఫోటోలున్నాయి. రామ్మూర్తి ఫోటోపైన ఎర్ర సిరాతో పెద్ద 'ఇంటూ' మార్కు పెట్టాడు.

బాత్ రూంకివెళ్ళి స్నానంచేసి, శుభ్రంగా డ్రస్ చేసుకున్నాడు. రివాల్వరును చంకలో అమర్చుకున్న గ్లవ్ లో బిగించాడు. పైన కోటు తొడుక్కుని, చకచక క్రిందికి దిగొచ్చాడు.

రెస్టారెంటులో టిఫిను చేద్దామని వెళ్ళాడు.

అందరూ అప్పుడే రామ్మూర్తి హత్యగురించి చర్చిస్తున్నారు. హంతకుడి ధైర్యానికీ, సాహసానికీ, అచ్చెరువు చెందుపోతున్నట్లు మాట్లాడసాగారు.

వాళ్ళ మాటలు విని నవ్వుకున్నాడు. బేరరు రాగానే దోసె, కాఫీ తెమ్మని చెప్పాడు.

ఐదు నిముషాల్లో టిఫిన్ ప్లేటు తెచ్చి ముందు పెట్టాడు. మెల్లగా స్పూనుతో తినటం ప్రారంభించాడు.

మాధవరావును ఎలా చంపడమాని ఆలోచించసాగాడు. ప్రతిరోజూ తొమ్మిదిగంటలకల్లా రజిని ఇంటికి వస్తాడని తను సేకరించిన సమాచారంవల్ల తెలిసింది. అతన్ని సులభంగా చంపొచ్చను కున్నాడు. అందుకే తొమ్మిది గంటలకు ముహూర్తం పెట్టాడు.

కాని రామ్మూర్తి చావునుచూచి బెదిరిపోయి, ఇంట్లోనే వుండేందుకు తీర్మానించుకున్నాడతను. అందుకు తోడు పోలీసుల్ని తనకు రక్షణగా పిలిపించుకుంటున్నాడు.

కాఫీ త్రాగడం పూర్తిచేశాడు. బిల్లు చెల్లించి, హోటలు నుండి బైటపడ్డాడు.

రిక్షాఎక్కి "రైలుస్టేషను" అన్నాడు. హత్యచేసిగూడా రాజులా తిరగగల ధైర్యం వున్నందుకు తన్ను తనే అభినం

రించుకున్నాడు ఆనంద్. స్టేషనుముందు దిగి డబ్బులిచ్చి లోనికెళ్ళాడు.

నాలుగో నెంబరు ఫ్లాట్ ఫాం చివరికంటా నడిచివెళ్ళాడు. వచ్చేపోయే రైళ్ళేవి లేకపోవడంతో జనమెవ్వరూలేరు. పతి కూర్చుని సిగరెట్ కాలుస్తున్నాడు. ఆనంద్‌ను చూడగానే లేచి ఎదురువచ్చాడు.

"రేఖ నిన్నడిగిందా ఎక్కడికి వెళ్తున్నావని?" అడిగాడు ఆనంద్.

"అడిగింది. అలా తిరిగి వస్తానని చెప్పాను."

"నన్ను గురించి అడిగిందా?"

"ఎక్కడున్నావనీ, ఏంచేస్తున్నావనీ అడిగింది. తెలీదన్నాను."

"గుడ్! ఈ రాత్రికి మాధవరావును చంపాలి! ఏదైనా మార్గం చెప్పు."

"నాకేం తోచడంలేదు. నువ్వే ఆలోచించు. హత్య చెయ్యడంతప్ప మరేపనయినా చేసేందుకు నాకు అభ్యంతరం లేదు!"

"అయితే నువ్వు రజినిని ఎనిమిదిన్నరకల్లా కలుసుకో. ఆమెను భయపెట్టి మాధవరావును అక్కడికి రప్పించేందుకు ఒప్పించు. మిగిలింది నేను చూసుకుంటాను" అన్నాడు.

"ఆమె ఒప్పుకోకపోతే!"

"చంపుతానని బెదిరించు. దెబ్బతో మాధవరావుకు రమ్మని ఫోన్ చేస్తుంది."

"అంతా అయ్యాక నా గుర్తులన్నీ పూస గుచ్చినట్లు పోలీసులకు చెపితే క్షణాలమీద వేటాడి పట్టుకోరూ నన్ను" తన అనుమానం వ్యక్తంచేశాడు పతి.

ఆనంద్ కు అతను చెప్పిందికూడా సబబుగానే తోచింది. పతి పట్టుబడకుండా ఉండాలంటే రజనినికూడా చంపాలి. అనవసరంగా అమాయకురాలి ప్రాణాలు తీసేందుకు మనసొప్పలేదు.

ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతనికి మెరుపులా ఏదో ఆలోచన తట్టింది. సంతోషంగా ఈలవేశాడు. తన ప్లాను పతికి చెప్పాడు.

"ఓ. కే!" అన్నాడు పతి.

"ఒక హత్య పూర్తయింది. మరి ఇస్తానన్న రెండువేలు ఇచ్చేస్తారా?" అడిగాడు.

జేబులోనుండి డబ్బుతీసి ఇచ్చాడు. అందుకుని భద్రం చేసుకున్నాడు పతి. ఇద్దరూ అక్కడనుండి విడిపోయారు. పతి రైలుపట్టాలుదాటి రెండో ప్లాట్ ఫామ్ పైకెక్కి అటుగా వెలుపలికొచ్చేశాడు.

# 7

రేఖకు పతి ఏంచేస్తున్నాడో అర్థంగాలేదు. ఏమడిగినా విసుక్కోవడం మొదలెట్టాడు. మరీ ఘట్టిగా అడిగితే 'అడదానివి నీకెందుకు?' అంటున్నాడు. నెల్లూరులో బయలుదేరింద మొదలు, తను ఆనంద్ తో మనకు సంబంధంవద్దని పోరాడింది.

ఆనంద్ ను చూస్తేనే రేఖకు భయం పుట్టుకొచ్చింది. అతని కళ్ళల్లో క్రూరత్వం అతన్నో బెబ్బులిలా చిత్రించ సాగింది తన కళ్ళకు.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు అన్నంతిని వెళ్ళాడు పతి. తిరిగి నాలుగింటికి వచ్చాడు. గంటసేపు గదిలో వున్నాడు. ఉన్నగంటా, చీమ చిటుక్కుమన్నా కంగారు పడిపోసాగాడు.

ఇద్దరూ ఏదైనా ఘోరం చేశారేమోననిపించింది. తనపైన తనకే అసహ్యం వేసింది. నీచుడ్ని నమ్ముకుని లేచివచ్చి నందుకు. ఇల్లొదిలాక మొదటిసారిగా విచారించింది.

పతి ఏలాగైనా ఆ పాడు స్నేహంనుండి కాపాడాలి. అందుకు తనేం చెయ్యాలో ఆలోచించసాగింది.

పతి వెళ్ళబోయేముందు అడిగింది. అతను చెప్పలేదు. తనూ వస్తానంది. వద్దన్నాడు. మొండికేసింది. కసురుకున్నాడు.

అతను వెళ్ళాక రేఖకూడా హోటల్ తలుపులు తాళం బెట్టి వెళ్ళింది క్రిందకు. పతి రిక్షా ఎక్కుతూ కనిపించాడు. రేఖకూడా రిక్షా ఎక్కి పోనిమ్మంది.

పతి ఎక్కిన రిక్షా వెనుకాలనే రేఖ రిక్షా వెళ్ళింది. అతను దిగి స్టేషనులో కెళ్ళటం రేఖ గమనించింది.

పది నిముషాలు అక్కడే నిలబడింది.పతి తిరిగొస్తాడేమో నని చూడసాగింది. రాలేదు.

ఇంతలో మరో రిక్షాలోంచి దిగుతున్న ఆనంద్ కనుపించాడు. ఆమెకు అసలు సంగతి అర్థమయింది. ఇద్దరూ ఏదో గూడుపుఠాణీ చేస్తున్నారన్నమాట.

ఆనంద్ కూడా స్టేషనులోకి వెళ్ళిపోయాడు.

అరగంటసేపు అక్కడే తచ్చాడుతూ నిలబడింది.

"గిరాకీ కావాలా?" అంటూ రిక్షావాళ్ళు చుట్టూ ముట్టారు. నాలుగుతిట్టి ఇంకాస్త దూరంగా వెళ్ళి నిలుచుంది. ఒంటరిగా ఆడది నిలబడితే చాలు, విటుడికోసం వేటాడు తుందనుకుంటారు వెధవలు.

నలుగురైదుగురు నాగరికంగావున్న స్టూడెంట్సు తన ప్రక్కనే వెళ్తూ ఈలవేశారు. తల త్రిప్పిచూసింది.

"వస్తావా?" అడిగాడొకడు.

"పంచిస్తాం! నలుగురికీ!" అన్నాడు మరొకడు.

చెప్పు విప్పింది విసిరి కొట్టేందుకు. నలుగురూ ఉడాయించారు.

ఇంతలో స్టేషనులోనుండి ఆనంద్ రావటం గమనించింది. అతనువచ్చి హోటల్ డ్రీమ్‌లాండ్‌కు రిక్షా మాట్లాడుకోవటం దూరంనించే వింది. అతని రిక్షా కదిలిపోయాక తనుకూడా అదే హోటల్‌కు రిక్షా మాట్లాడుకుంది.

డ్రీమ్‌లాండ్ ముందు దిగి లోనికివెళ్ళింది. ఆనంద్ ఏ గదిలో వుంటాడో ఎలా తెలుసుకోవాలో అర్థంగాలేదు. అతను తన స్వంత పేరుపైన రూంతీసుకొని వుండడు. పతిగూడా మారు పేరుమీదే రూం తీసుకున్నాడు.

ఒక్కొక్క అంతస్తే ఆనంద్‌ను వెతుక్కుంటూ తిరిగింది. మూడో అంతస్తులోని ముప్ఫయి ఆరవరూం ఒక్కటి తెరచి వుంది. మిగిలిన అన్నింటికీ తాళాలువేసి వున్నాయి. ఆనంద్ ఆ గదిలోనే ఉండివుండాలని ఊహించింది.

మెల్లగా తలుపు తట్టింది. లోపలునుంచి ఏ విధమైన సమాధానం రాలేదు. ఇంకొంత పెద్దగా తట్టింది. తలుపులు తెరచుకున్నాయి. ఎదురుగా ఆనంద్ కనుపించాడు.

"మే! ఐ కమిన్!" అడిగింది.

"నువ్వా! రా!" ఆశ్చర్యం, కంగారు ధ్వనించాయి అతని కంఠంలో.

ఆమె చెయ్యిపట్టుకుని ఒక్కలాగు లాగి, తలుపులు మూశాడు. బోల్ట్ పెట్టాడు.

"ఇక్కడికెందుకొచ్చావ్? నేనిక్కడున్నానని పతి చెప్పాడా?"

"పతి పిరికిపంద. ఆడవాళ్ళంటే అతనికి గౌరవంలేదు.

నా కతను చెప్పలేదు. నేనే వెతుక్కుంటూ వచ్చాను" అంది రేఖ.

"ఎందుకు?"

"నీతో మాట్లాడాలని."

"నాతోనా? నీకేం మాటలు?"

"పతిని నేను ప్రేమించాను. నాకు అమరసుఖాలు అవసరంలేదు. కానీ మా ప్రేమ కలకాలం వర్ధిల్లాలి. అతనితో నేను జీవించాలి. కూలిచేసుకోనయినా బ్రతుకుతాం. అతన్ని నువ్వు లేనిపోని వ్యవహారాల్లో లాగి అన్యాయం చెయ్యవద్దు. అతన్నొదిలెయ్" అంది రేఖ.

"నాకు అతనికీ ఏం సంబంధంలేదు. మేమేం ఘోరాలు చెయ్యడంలేదు" అన్నాడు ఆనంద్.

"నాకు తెలుసు మధ్యాహ్నం జరిగిన హత్య నువ్వే చేశావని. అందుకు నీకు పతి సాయంగా వున్నాడనిగూడా తెలుసు" అంది రేఖ నిదానంగా.

"నో! నో! అంతా అబద్ధం!" అన్నాడు పెద్దగా.

"అబద్ధం కావాలనే కోరుకుంటున్నాను. పతిని వదిలేసినందుకు ప్రతిఫలంగా నీకేం కావాలన్నా ఇస్తాను. ఇష్టముంటే ఇప్పుడే, ఇక్కడే అనుభవించు. అంతకన్నా నేను నీకు ఇవ్వగలిగిందికూడా లేదు" అంది రేఖ.

"నాన్సెన్స్! నోటికొచ్చినట్లల్లా వాగకు" అన్నాడు ఆనంద్.

"నా మాట వినకుంటే, నేను చెప్పిన వివరాలు ఎక్కడ వాగకూడదో అక్కడికే వెళ్ళి వివరంగా వాగుతాను. అప్పుడేమవుతుందో తెలుసా?" అడిగింది రేఖ చెక్కు చెదరని గుండె ధైర్యంలో.

"అంటే పోలీసులతో చెప్తావా?"

"చెప్తాను!"

"అలాచేస్తే పతినిగూడా తోస్తారు నాతోబాటు జైల్లోకి."

"కనీసం అక్కడ ప్రాణాలతోనన్నా ఉంటాడు. నీతో వుంటే అవిగూడా దక్కవని తెలుసు" అంది రేఖ.

ఆనంద్ కు మతిపోయింది. అనుకోని విధంగా సంఘటనలు మలుపు తిరుగుతున్నాయి. ఒక అబల తననూ, తన ప్లానునూ పెద్ద ఆపదలా అడ్డురావడం సహించలేకపోయాడు.

ముందుకి దూకి రేఖ జుట్టుపట్టుకున్నాడు. క్రిందికివంచి వెడల్పాటి ప్లాస్టరుతీసి నోటికి అతికించాడు. కర్టెన్ త్రాడు లాగి కాళ్ళు చేతులు కట్టి, మంచం కిందకు తోశాడు. ఆమె నెలా వదిలించుకోవాలాని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

# 8

ఎనిమిదిగంటలా నలభై అయిదు నిముషాలయింది.

మాధవరావు ఆఫీసు రూంలోనే కూర్చున్నాడు. ఎదురుగా వున్న గోడగడియారంకేసి చూడసాగాడు. కిటికీ తలుపులన్నీ మూసివున్నాయి. గుమ్మం వెలుపల పోలీస్ కానిస్టేబుల్ వున్నాడు. కాంపౌండ్ లో మరో నలుగురు జవాన్లు కాపలా వున్నారు. ఆయనకు కొంత ధైర్యంగావున్నా, భయంగా మాత్రం వుంది.

హంతకుడు అఖండుడు. మిట్ట మధ్యాహ్నం, నట్టనడి వీధిలో నిల్చుని రామ్మూర్తిని కాల్చి చంపిన కర్కోటకుడు. వాడికి తన్ను చంపడం అసాధ్యం కాదేమోననిపించింది.

ఫోన్ మ్రోగింది. రిసీవరు పైకెత్తి "హల్లో! మాధవరావు స్పీకింగ్!" అన్నాడు పెద్దగా.

"నేను యస్. పి. ఆదిత్యన్‌ను మాట్లాడుతున్నాను," అన్నాడు అవతలవైపునుండి అధికారం వుట్టిపడే గొంతుకతో.

"చెప్పండి సార్! మీ వాళ్ళు కాపలావున్నారు. నాకేం భయంలేదనుకుంటాను" అన్నాడు.

"అమాటే చెప్పాలని ఫోన్ చేశాను. రామ్మూర్తిని చంపిన హంతకుడు చిక్కాడు. ఇంతకుముందే అరెస్టుచేసి తీసుకొచ్చాం. మా వాళ్ళను స్టేషనుకి వెళ్ళమని చెప్పండి. మీరు వెంటనే పోలీస్ హెడ్ క్వార్టర్సుకు రండి. వాడిని చూద్దురు" అన్నాడు ఎస్. పి.

"నన్ను హత్య చేస్తానన్నదిగూడా అతనేనా?" అడిగాడు మాధవరావు ఆతృత, భయం చావక.

"అఁ! అతనే. మీరు త్వరగా రావాలి. వచ్చేప్పుడు ఆ కవరుకూడా పట్టుకురండి" అన్నాడు యస్. పి.

"అలాగే! వస్తున్నాను" అంటూ ఫోన్ కట్ చేసి తలుపులు తెరచి, కానిస్టేబుల్స్‌తో జరిగిన విషయం చెప్పాడు. వాళ్ళు వెంటనే వెళ్ళిపోయేందుకు సిద్ధమైనారు.

మాధవరావు బట్టలు మార్చుకుని, నీలం రంగు కవరు జేబులో పెట్టుకొని, భార్యకు తను విన్న శుభవార్త చెప్పాడు. ఆమె గుండెలమీద కుంపటి దిగిపోయినట్లు తేలికపడింది.

వెలుపలికొచ్చి కారెక్కాడు. గంట రెండు నిముషాలు తక్కువగా తొమ్మిదయింది.

కాంపౌండ్ గేటు దాటుతుండగా కుడికణత చురుక్కుమంది. తల త్రిప్పాడు మాధవరావు. గుండెల్లో ఏదో లోహపు ముక్క గుచ్చుకున్నట్లుంది.

"అమ్మా" అంటూ వొరిగిపోయాడు. కారు కాంపౌండ్ గేటుకు గుద్దుకుంది.

డబ్ డబ్ మంటూ గోడవారగావున్న మోటార్ సైకిల్ మబ్బుల్లోంచి దూసుకుపోయే స్పుట్నిక్ లా రివ్వున వెళ్ళిపోయింది. ఐదు నిముషాల్లో జనం తండోపతండాలుగా పోగయినారు.

మాధవరావుగారి భార్య జుట్టు పీక్కుంది. తల గోడకేసి బాదుకుంది.

వచ్చిన వాళ్ళల్లో ఎవరో పోలీసులకు ఫోన్ చేశారు. పది నిముషాల్లో పోలీసు పటాలం వచ్చింది.

పోలీస్ డాక్టర్ రివాల్వర్ గాయం చూడగానే, "రామ్మూర్తినిగూడా ఇదేరకం రివాల్వరుతో కాల్చారు. ఆదెబ్బ, ఇది ఒకటిగానే వున్నాయి" అన్నాడు.

ఇన్ స్పెక్టర్ లోనికి వెళ్ళి జరిగిందంతా తెలుసుకున్నాడు. ఆదిత్యన్ గారికి ఫోన్ చేసి అడిగాడు వారేమైనా మాధవరావుకు ఫోన్ చేశారా' అని. వారు తనకు తెలీదన్నారు.

అంటే హంతకుడే ఫోన్ చేసి, పోలీసుల్ని తన ట్రాక్ నుంచి తప్పించాడని తెలుసుకోనేందుకు పెద్ద ప్రయత్నం అవసరం లేకపోయింది.

రెండు హత్యలు పకడ్బందీగా జరిగాయి. ఇద్దరూ ధనవంతులే! ముందు చెప్పి మరీ హత్యచేశాడు హంతకుడు. విరోధులులేరన్నారు ఇద్దరూ. ఆస్తికోసం వారను లెవరన్నా చేశారేమోననుకోనేందుకు వీలులేదు. మరి ఈ హత్యల వెనుకనున్న అసలు అంతరార్థమేమిటో తెలుసుకోంటే తప్ప, హంతకుణ్ణి పట్టుకోవడం అసంభవం అన్న నిర్ణయానికొచ్చాడు ఇన్ స్పెక్టర్.

మామూలుగా తను జరుపవలసిన దర్యాప్తంతా జరిపాడు. స్టేట్ మెంట్లో రిపోర్టుచేశాడు. సంతకాలు తీసుకున్నాడు.

శవాన్ని ఫోటోలు తీయించి పోస్టుమార్టమ్ చేసేందుకు, అంబులెన్సులో మార్చురీకి తరలించాడు.

విజయవాడ నగరమంతా భయాందోళనలతో బిక్కచచ్చిపోయింది. డబ్బుగలవాళ్ళంతా ఇదేదో నక్సలైట్ల దురాగతమని ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని కూర్చున్నారు.

పోలీస్ డిపార్టుమెంటు పేపర్లలో ప్రకటన వేసింది. నీలం రంగు కవర్లలో హాత్య చేస్తామంటూ బెదిరింపు ఉత్తరాలెవరికొచ్చినా, వారు వెంటనే దగ్గరలోవున్న పోలీస్ స్టేషనుకు రిపోర్టు చెయ్యమని ఆ ప్రకటనద్వారా కోరారు.

ఆ రాత్రికంతా గుండెలపైన చెయ్యివేసుకుని పడుకున్నారు. తెల్లారి తొమ్మిదింటిగ్గాని ఉత్తరాలు రావని అందరికీ తెలుసు. అంతదాకా ఫరవాలేదనిపించింది వాళ్ళకు.

## 9

గంట పదకొండయింది.

ఆనంద్, పతీ, అంతకుముందే గదికొచ్చారు. జరిగిందంతా చెప్పాడు ఆనంద్ రేఖ విషయం. విని కంగారుపడ్డాడు పతి.

"రేఖేది?" అడిగాడు పతి.

"ఆ మంచం క్రింద చూడు" అన్నాడు ఆనంద్.

పతి లైటువేసి ఒంగి మంచం క్రింద చూశాడు. అక్కడెవ్వరూ కనుపించలేదు.

"ఇక్కడ లేదే?" తల పైకెత్తి అడిగాడు.

"లేదా? ఏమవుతుంది? నేను అక్కడికి తోసి తాళం వేసుకొచ్చాను" అన్నాడు ఆనంద్.

పతి మళ్ళీచూశాడు. కనుపించలేదు.

"లేదు!" అన్నాడు పతి.

ఆనంద్ గబగబ బాత్ రూం తలుపు తెరచాడు. అందులో వుందేమోనని. అక్కడా కనుపించలేదు. లెట్రిన్ తలుపు తీశాడు. అక్కడాలేదు. కానీ వెంటిలేటర్ కేసి చూశాడు. సులభంగా దూరిపోవచ్చు అందులోనుండి.

"పతీ! దాంట్లోంచి వెలుపలికి వెళ్ళిపోయినట్లుంది" అన్నాడు వెంటిలేటరు చూపిస్తూ.

"నీగది మూడో అంతస్తులో వుంది. వెనుక వేపుకు దూకా ల్సిందే! ఇంతెత్తునుండి దూకితే ప్రాణం పోతుంది" అన్నాడు పతి.

ఆడమనిషి అంత సాహసం చెయ్యగలదన్న నమ్మకం లేదు ఆనంద్ కు. వెనుక వేపు గార్డెన్ వుంది. అక్కడ పడి వుందేమోనన్న అనుమానం వేసింది. పతిని వెళ్ళి చూసి రమ్మ న్నాడు. పతి హడావుడిగా క్రిందకు వెళ్ళాడు. ఐదునిముషాల్లో తిరిగివచ్చాడు. అక్కడెవ్వరూ లేరని చెప్పాడు.

"కొంపదీసి రేఖ నన్ను బెదిరించినట్లు పోలీసుల దగ్గరకు వెళ్ళిందా?" అడిగాడు ఆనంద్.

తన వస్తువులేమన్నా పోయాయేమోనని చూసుకున్నాడు. మంచమ్మీదున్న పరుపు క్రింద దాచుకొన్న డబ్బుంది. కానీ ప్రక్కనున్న కవరులేదు. ఆ కవరు చాలాముఖ్యం తనకు. అది పోలీసుల చేతిలో పడిందంటే తనపని ఆఖరు. కంగారు పడ్డాడు.

"ఏమయింది?" అడిగాడు పతి.

"రేఖ నా కాగితాలు కాజేసింది. ఎక్కడున్నా ఆమెని ముందు పట్టుకోవాలి. మనం ఇక్కడుంటం క్షేమంగాదు. పద వెళ్దాం. నేనిక్కడి రూం ఖాళీచేస్తాను. నువ్వుగూడా అక్కడ ఖాళీచేసి వచ్చెయ్యి" అన్నాడు ఆనంద్.

"ఎక్కడ కలుసుకుందాం."

"గాంధీహిల్ క్రింద ట్రావెలర్స్ లాడ్జికిరా! రామకృష్ణ అన్న పేరుతో గది తీసుకుంటానక్కడ. గంటలోగా వచ్చెయ్యాలి. ఎక్కడున్నా రేఖను వెతికి పట్టుకోవాలి. ఆడవాళ్ళతో ఇలాంటి వ్యవహారాలు చాలా ప్రమాదం" అన్నాడు ఆనంద్.

"నువ్వేం కంగారుపడకు. కనుపిస్తే కట్టుదిట్టంలో పెట్టే పూచీ నాది" అన్నాడు పతి.

"నా రహస్యాలు దానికి తెలిశాక ఒకరు కట్టుదిట్టంలో పెట్టడంకాదు. నేనే దానినోరు శాశ్వతంగా మూయిస్తాను" అన్నాడు ఆనంద్ క్రోధంగా.

"అలాగేలే!" అన్నాడు పతి అక్కడ్నుంచి బయలుదేరుతూ.

వాళ్ళు చేతులు కట్టేసినా, నోటికి ప్లాస్టరేసినా, రేఖ గదిలోంచి ఎలా తప్పించుకుందో ఎంత ఆలోచించినా అర్థంగాలేదు. గది ఖాళీచేసి, డబ్బు చెల్లించేందుకు కౌంటరులోకొచ్చాడు ఆనంద్.

కౌంటర్లోవున్న వ్యక్తి "ఏం సార్! అప్పుడే ఖాళీ చేస్తున్నారా?" అడిగాడు.

"వచ్చిన పనయిపోయింది. వెళ్ళిపోతున్నాను" అన్నాడు.

"పాపం ఆ అమ్మాయిని గదిలో పెట్టి తాళంవేసి వెళ్ళిపోయారా?" అడిగాడతను. ఎవరా అమ్మాయని అందామనుకొని తమాయించుకుని, నవ్వు తెచ్చుకొన్నాడు పెదాలపైన.

"పాపం ఫోన్ చేసింది. ఇరవై ఇస్తామని చెప్పి పిల్చుకొచ్చారటగా. ఎముకలు విరిగాయంది. మీరు వచ్చేలోగా వెళ్ళిపోతానంది. అలా వెళ్ళనీకుంటే అల్లరిపెట్టి హోటల్

పరువు తీస్తానంది. డూప్లికేట్ తాళంతో తలుపులు తెరచి పంపించేశాను" అన్నాడు అతను.

"రాత్రికంతా వుంటానంది. మధ్యలోనే మనసు మార్చుకుని వెళ్ళిపోతుందని నాకేం తెలుసు" అన్నాడు ఆనంద్.

"చాలా బాగుంది సార్!"

"నువ్వో ట్రిప్పు చూసుకోకపోయావా?"

"అడిగాను. డబ్బిస్తానన్నాను. ఓపికలేదంది. రేపొస్తానంది" అన్నాడు భుజాలు ఎగురవేస్తూ ఆనందంతో.

"గుడ్!" అన్నాడు చిల్లర తీసుకొంటూ.

"మళ్ళీ ఈవూరొస్తే మా హోటల్లోనే దిగండిసార్!"

"ఎందుకు మంచి అమ్మాయిని తెచ్చి నీకు చూపించేందుకా?" అడిగాడు ఆనంద్.

ఆనంద్ వీధిలో కొచ్చాడు. జరిగింది అర్థమైంది. రేఖ కట్లు ఎలానో విప్పుకునుంటుంది. నోటి కంటించిన ప్లాస్టర్ పీకి పారేసి, గదిలోవున్న ఫోన్ ద్వారా కౌంటర్ క్లార్కుతో మాట్లాడి, అతనిద్వారా తలుపులు తెరపించుకొని వెళ్ళిపోయింది.

ఒకవేళ తిరిగి పతి రూంకు పోయుంటుందేమోనన్న అనుమానం కలిగింది. పతిముందు తను తొందరపడి మాట్లాడటం తప్పయిపోయిందనిపించింది.

ఆమెకు, పతి తన్నుగురించి చెప్పాక, ఆమె తన్నుండి దూరంగా పారిపోతుందేమోననుకున్నాడు. పతి డబ్బుకోసం తనతో చేతులు కలిపినా, తన్ను ప్రేమించివచ్చిన స్త్రీని, తెలిసీ, తెలిసీ, ఆపదలోకి తోస్తాడన్న నమ్మకం కలగలేదు.

తిన్నగా తను పతి వుండే హోటల్ కు వెళ్దామాని ఆలోచించాడు. అది అంత మంచిపనిగా తోచలేదు. అక్కడ

రేఖవుంటే ఆవేశంలో ఆమెను చంపవలసివస్తుందేమోనన్న భయం కలిగింది. ఇంకా ముగ్గుర్ని చంపాలి. ఆ తర్వాత పోలీసులకు పట్టుపడ్డా, ఉరి తీయబడ్డా చింతలేదు. అందాకా ఎలాగైనా తప్పూకుని తిరిగి తీగాలి.

రిక్షా ఎక్కి గాంధీహిల్ క్రిందకు పోనిమ్మన్నాడు.

# 10

డ్రీమ్‌లాండ్ హోటల్‌కొచ్చాడు పతి. తిన్నగా మెట్లెక్కి గది గుమ్మంవద్దకు చేరాడు. తలుపు తట్టాడు. తెరచుకుంది. ఎదురుగుండా రేఖ కనుపించింది.

"పన్నెండవుతూంది. ఇంతదాకా ఏంచేస్తున్నావ్?" అడిగింది రేఖ.

"కట్టుకొన్న పెళ్ళాంలా ఏమిటా సంజాయిషీ లడగటం. నువ్వొచ్చి ఎంతసేపయింది?" అన్నాడు పతి.

"రావడమేమిటి? నీ కోసం ఎదురుచూస్తూ ఇక్కడే వున్నాను."

"నువ్వెక్కడికి కెళ్ళింది, ఏంచేసింది, ఆనంద్ గదిలో ఏం దొంగిలించి తెచ్చింది అంతా నాకు తెలుసు. ఎందుకెళ్ళావ్ అక్కడకు" అడిగాడు కోపంగా.

"అక్కడికి వెళ్ళే వచ్చావన్నమాట!" అంది రేఖ.

"ఆఁ!"

తనెందుకు వెళ్ళిందీ ఏంజరిగిందీ వివరంగా చెప్పింది రేఖ.

"నిన్ను చంపాలనుకుంటున్నాడు ఆనంద్. అతని రహస్యాలు నీకు తెలిసినందుకు భయపడుతున్నాడు. ఒకవేళ ఇక్కడకు వస్తాడేమోనని భయంగావుంది" అన్నాడు పతి.

"వాడి రహస్యాలు నాకు తెలుసుండటం నీ ప్రాణాలకు మంచిది. నేను ప్రాణాలతో వున్నన్నిరోజులు నిన్ను అతనేం

చెయ్యడు. వాడిపనులు పూర్తయ్యాక నిన్నెటూ చంపాలనుకుంటున్నాడు. ఈలోగా మనం ఎటన్నా వెళ్ళిపోదాం! ఏమంటావ్!'' అడిగింది రేఖ.

''నేనేం హత్యలు చెయ్యలేదు. అతనికి సాయం చేశాను. అందులోగూడా ఏవిధమైన ప్రమాదం లేదు. ఇప్పటికి నాలుగు వేలిచ్చాడు. ఇంకో ఆరువేలు సంపాయించే మార్గంవుంది. ఈలోగా అతను పోలీసులకు చిక్కాడంటే, అతని దగ్గరున్న డబ్బు మొత్తం మనకే వస్తుంది. దాంతో సుఖంగా వుండవచ్చు. అందాకా నువ్వు ఎక్కడైనా వుండు. నేనొచ్చి కలుసుకుంటాను'' అన్నాడు పతి.

''వద్దు! అలా జరగదు. చావో, బ్రతుకో నీతోనే వుంటాను. నీకేవిధమైన అపాయం కలగకుండా చూస్తాను.''

''నాకేం అపాయంలేదు. నన్ను నేను రక్షించుకోగలను. నీ సంగతి తెలిస్తే ఊరుకోడు. అతని దగ్గర దొంగిలించి తెచ్చిన కవరు నా కిచ్చెయ్. అదిచ్చేసి నువ్వు ఎటో వెళ్ళిపోయావని చెప్తాను,'' అన్నాడు పతి, తను రూం ఖాళీ చేయాలంటూ.

''అంటే నన్ను నట్టేట్లో ముంచేసి పోతావన్నమాట!''

''అదికాదు రేఖా! ఆనంద్ పచ్చినెత్తురు తాగే హంతకుడు. అతనిముందు నువ్వీ పరిస్థితుల్లో కనుపించావంటే చంపుతాడేమోనని భయంగావుంది.''

''చచ్చినా ఫరవాలేదు! నేనూ నీతో వస్తాను. అలా లేదంటే నువ్వుగూడా నాతో ఇక్కడే వుండు!''

పతి ఆలోచించాడు. రేఖను వదిలేసి వెళ్ళిపోయేందుకు మనస్కరించలేదు. అలాగని ఆమెను అంటిపెట్టుకొని వుండడం లేనిపోని ప్రమాదాలకు దారితీస్తుందేమోనన్న భయంగానూ వుంది. ఆనంద్‌తో తెగతెంపులు చేసుకొని ఎటైనా వెళ్ళి

పోదామనిపించింది. ఇంకో ఆరువేలు సంపాదించుకునే అవకాశం జారవిడుచుకున్నట్లవుతుందని నిరాశ కలిగింది.

“ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?” అంది రేఖ.

“ఏం చెయ్యడమని?”

“నీ దగ్గర నాలుగు వేలుంది. ఆనంద్‌ను వదిలేసి వెళ్దాం. మరేదైనా వూరుపోయి మన బ్రతుకు మనం బ్రతుకుదాం” అంది రేఖ.

రెండు క్షణాలాలోచించాడు పతి. రేఖ చెప్పింది బాగుందనిపించింది. ఆశకు అంతులేదు. ఎక్కడో ఒకచోట మనిషి దానికి అంతంగుర్తుపెట్టాలి. అదిక్కడే పెట్టేసి వెళ్ళటం వివేకమనిపించింది.

“సూట్‌కేస్ సర్దు! వెళ్ళిపోదాం!!” అన్నాడు పతి.

రేఖకు ఆనందంగా వుంది. పతి తనసలహా విన్నందుకు గర్వంగావుంది. గబగబ బట్టలన్నీ సూట్‌కేస్‌లో దోపింది. పతి క్రిందకు దిగివెళ్ళాడు. రేఖకూడా అతనివెంటే దిగి వెళ్ళింది.

ఇద్దరూ వీధిలోకొచ్చారు. రిక్షా ఎక్కి క్రిష్ణాబారేజివద్దకు పోనివ్వమన్నారు. పతికి బారేజి కాలినడకనదాటి అక్కడ్నుంచి మరో రిక్షాలో మంగళగిరిదాకా వెళ్ళి, ఆ తర్వాత గుంటూరు చేరుకుందామనివుంది. గుంటూరులో రెండు రోజులుండి ఆ తర్వాత విశాఖపట్నం వెళ్ళి అక్కడేదన్నా హోటల్‌లో చిన్న ఉద్యోగం సంపాయించుకో వచ్చునన్న ధైర్యం కలిగింది.

బారేజిముందు దిగి డబ్బులిచ్చాడు. రిక్షా వెనక్కి వెళ్ళిపోయింది. రేఖ సూట్‌కేస్ పట్టుకొని ముందు నడవసాగింది.

వెనకవేపు చూశాడు పతి. ఎవ్వరూ కనుపించలేదు. మెర్క్యురీలైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. తమను దాటుకుని నాలుగైదు రిక్షాలు వెళ్ళిపోయాయి.

ఇరవై నిముషాలు పట్టింది బ్యారేజి దాటేందుకు. బ్యారేజి దాటాక అంతా చీకటి. జనసంచారంలేదు. నాలుగైదు రిక్షాలున్నాయి. వెళ్ళి మంగళగిరికి వస్తారాని అడిగాడు. ఎవ్వరూ వస్తామనలేదు. రేఖకు చెప్పాడు. ఆమెకు అయోమయంగా వుంది. అర్ధరాత్రి, చీకట్లో, అక్కడెలావుంటామని ఆలోచించసాగింది.

"ఇలా అడ్డంగా నడిచివెళ్తే 'క్రిష్ణాకనాలు' స్టేషను వస్తుంది. అక్కడికెళ్దాం. ఏదైనా రైలురావచ్చు. రాకున్నా అక్కడ మనం పడుకోవచ్చు" అన్నాడు పతి.

"అలాగే!" నంది రేఖ.

నడక మొదలెట్టారు.

కాలిబాట. ముళ్ళు, కంపలు, రాళ్ళు, నడవటం కష్టంగా వుంది రేఖకు. ఆరాత్రి ఏమీ ఆహారం తీసుకోలేదు. నీరసంగానూ వుంది. పతికూడా వెంట నడవసాగాడు.

వెనకెవరిదో అడుగుల చప్పుడయింది.తలత్రిప్పి చూశాడు. చీకట్లో నల్లటి సూట్ లోవున్న ఆకారం కనుపించింది. పతి నిలబడ్డాడు. రేఖ ముందుకు నడవసాగింది.

"పతీ! నన్ను తప్పించుకోవడం అసాధ్యం. నాది నాగుపాము పగ. చేతులెత్తు! లేకుంటే కాల్చి చంపుతాను" అరిచాడు ఆనంద్.

రేఖకూ్కడా ఆ మాటలు వినిపించాయి. వెనక్కి పరుగెత్తుకొచ్చి పతివెనుకగా నిలబడింది.

"రేఖా! నా గదిలో దొంగిలించిన కాగితాలు ఇచ్చెయ్!" అన్నాడు ఆనంద్.

"నా దగ్గరలేవు!" అంది రేఖ.

"ఏం చేశావ్?"

"పోలీసుల కిచ్చాను."

"ఎందుకిచ్చావ్?"

"నిన్ను పట్టించేందుకు."

ఆనంద్ పెద్దగా నవ్వాడు.

# 11

ట్రావలర్స్ బంగళా ఏలూరురోడ్‌లో వుంది. రంగయ్య సారాగ్లాసు పుచ్చుకుని, ఒక్కొక్క చుక్క త్రాగ సాగాడు. మత్తు మెల్లగా మెదడుకు ఎక్కసాగింది. వచ్చీ రాని బూతుపాట పల్లించసాగాడు.

ఆ బంగళాకు రంగయ్య కాపలాదారు. వచ్చే పోయే వాళ్ళకు అన్నిరకాల ఏర్పాట్లు చెయ్యడం అతనిపని. మందు తెచ్చివ్వడం, మంచిమంచి అమ్మాయిల్ని సప్లయి చెయ్యడం, అందుకు ప్రతిఫలంగా సంపాదించిన సొమ్ముతో సుష్టుగా త్రాగడం అతని పని.

అతని కెవ్వరూ లేరు. ఒకప్పుడు అంటే పదేళ్ళముందు కూతురు, కొడుకు వుండేవాళ్ళు. పెళ్ళాం ఎప్పుడో చచ్చి పోయింది. వాళ్ళిద్దరూ గుర్తుకు రాగానే కన్నీళ్ళు అప్రయత్నంగా వచ్చాయి.

కూతురు రంభలాగుండేది. మంచి యవ్వనంలో దోర మాగిన మామిడిపండులాగుండేది. పిల్లాడుకూడా రాజాలా గుండేవాడు. ఇద్దర్నీ రెండు కళ్ళుగా పెంచాడు. కానీ విధి వక్రించింది.

ఆ రాత్రి తన జీవితంలో మరచిపోని రోజు.

రాత్రి పదిగంటలప్పుడు పెద్ద కారొచ్చింది. అందు లోంచి ఇద్దరు ఇంజనీర్లు దిగారు. వాళ్ళు తనకి తెలుసు. వాళ్లు వచ్చిన అరగంటకు మరో చిన్నకారు వచ్చింది. అందులోంచి ముగ్గురు పెద్దమనుషులు దిగారు. రాగానే ఇంజనీర్లని గురించి అడిగారు. అంతకుముందేవచ్చారని వాళ్ళకు చెప్పాడు తను.

వాళ్ళు లోనికి వెళ్లారు.

ఇంజనీరు రామ్మూర్తి తన్ను పిలిచాడు. విస్కీసీసాలు సర్ది గ్లాసుల్లోపోసి అందరికీ ఇవ్వమన్నాడు. చేశాడు తను. అతను తనకు పై అధికారి. ఆయనంటే భయం రంగయ్యకు. వచ్చిన పెద్దమనుషులు నోట్లకట్టలు లెఖ్ఖపెట్టి యిచ్చారు. ఇంజనీర్లు వాట్ని అందుకుని కోటుజేబుల్లో దాచుకున్నారు.

బిరియానీ పాకెట్లు విప్పి తిన్నారు. మనుషులకు మత్తు బాగా ఎక్కింది. రామ్మూర్తి, రంగయ్యని పిలిచాడు. వెళ్ళి చేతులుకట్టుకొని నిలబడ్డాడు.

"ఇద్దరమ్మాయిల్ని పట్రా!" అన్నాడు వందరూపాయల నోటిస్తూ.

అరటిపళ్ళు, అగ్గిపెట్టెలా అంగట్లో కొని తెచ్చేలాంటివి ఆయనకు. నోటందుకుని, కాళ్ళీడ్చుకుంటూ ప్రక్కనే వున్న పైడిపేటకు వెళ్ళాడు. తనకు తెలిసిన కొంపలకు గిరాకీలున్నాయి. ఎవ్వరూ రామన్నారు. పేటంతా తిరిగి తిరిగి కాళ్లు నొప్పిపుట్టాయి.

చిన్నగా అడుగులు వేసుకుంటూ వెనక్కి తిరిగొచ్చాడు. రామ్మూర్తి వరండాలోనే వున్నాడు. చేతిలో బ్రాందీసీసా వుంది.

"ఏదిరా?" అడిగాడు.

"ఎవ్వరూ చిక్కలేదు బాబూ!" అన్నాడు.

"అయ్యా! బువ్వతిందువుగాని రా!" అంటూ తండ్రిని పిలవనొచ్చింది రంగయ్యకూతురు మాలక్ష్మి.

"నువ్వు పదవే! నేనొస్తున్నాను" అన్నాడు రంగయ్య.
"అదెవ్రరా!" అడిగాడు రామ్మూర్తి.
"నాబిడ్డబాబూ!" అన్నాడు రంగయ్య.

"బాగానేవుంది. దాన్ని పంపు చాలు!" అన్నాడు రామ్మూర్తి.
"దాన్నా! పెళ్ళి చేసేందుకు ఏర్పాట్లు చేస్తున్నాను బాబయ్యా! మేమటువంటివాళ్ళం కాము. అది రాదు" అన్నాడు.
"రాదూ!" అంటూ పెద్దగా అరచి చేతిలోవున్న బాటిల్‌తో రంగయ్య నెత్తిపైన మోదాడు. దెబ్బ బలంగా తగిలింది. 'అమ్మా!' అంటూ క్రిందపడిపోయాడు. తండ్రిని పట్టుకునేందుకు పరుగెత్తింది మాలక్ష్మి.

మాలక్ష్మిని రామ్మూర్తి పొదివి పట్టుకున్నాడు. విడిపించుకునేందుకు కాళ్ళతో తన్నింది. చేతులతో రక్కింది. తల ఎగరేసింది. కానీ రామ్మూర్తి పట్టువదలకుండా లోనికీడ్చుకెళ్ళాడు.
అక్కకోసం వచ్చిన రంగయ్యకొడుకు అంతా చూశాడు. వాడి నెత్తురు సలసల కాగింది. ముందుకు పరుగెత్తాడు. తలుపులు మూసుకున్నాయి. కిటికీదగ్గర కెళ్ళాడు. దాన్ని కూడా మూసేశారు. పైకెక్కి వెంటిలేటరులోంచి లోనికి చూశాడు.

లోపలున్న ఐదుగురూ మాలక్ష్మిమీద పడ్డారు. ఒకడు చీర లాగాడు, మరొకడు జాకెట్ చింపాడు. ఇంకొకడు

లంగా పీకాడు. మాలక్ష్మి ఏడ్చింది. బ్రతిమిలాడింది. వాళ్లు వినిపించుకోలేదు. మంచంపైన పడేశారు. నలుగురు కాళ్లు చేతులు పట్టుకొన్నారు ఘట్టిగా. రామ్మూర్తి ఆమె తొడలసందున కూర్చున్నాడు.

రంగయ్య కొడుకు ఆ ఘోరం చూడలేకపోయాడు.

"అయ్యో!" అంటూ మాలక్ష్మి పెట్టిన కేక రంగయ్య కొడుకులోని మనిషిని చంపేసింది. ప్రతీకారంకోసం మనస్సు తహతహలాడింది. ఆ రాత్రి మాలక్ష్మి ఉరితీసుకుంది.

పేదవాళ్ళు కావడంవల్ల తిండికిలేక ప్రాణంతీసుకున్నారన్నది లోకం. రంగయ్యకొడుకుమాత్రం ఇంట్లోంచి పారిపోయాడు. ఆ ఐదుగురు మనుషులు ఎవరో, ఎక్కడుంటున్నారో, ఏంచేస్తున్నారో, వివరాలు సేకరించాడు.

రంగయ్య కొడుకుపోయాక సగం చచ్చిపోయాడు. కొడుకు యింటికిరావడం మానేశాక పూర్తిగా చచ్చినశవమైనాడు. బ్రతకాలని లేకున్నా చావుకోసం ఎదురుచూస్తూ సారా త్రాగుతూ, కాలక్షేపం చెయ్యడం నేర్చుకున్నాడు. తన కొడుకు వస్తాడన్న ఆశ అతనికి ఎక్కడో వుంది.

'వాడేంచేస్తున్నాడో?' అనుకున్నాడు రంగయ్య.

వెలుపల కారాగింది. ఎవరైనా ఆఫీసరొచ్చాడేమోనని, లేచి నిలుచున్నాడు. కారు లోనికి రాలేదు. ఖద్దరుదుస్తుల్లో వున్న పొడవుపాటివ్యక్తి లోనికొచ్చి రంగయ్యముందు నిలబడ్డాడు.

"గది కావాలా బాబూ!" అడిగాడు రంగయ్య.

"వద్దు! రామ్మూర్తినీ, మాధవరావునూ, చంపింది నువ్వే కదూ!" అడిగాడు.

"కాదు! నేనెవ్వరినీ చంపలేదు. వాళ్ళే నా కూతుర్ని

చెరచి చంపేశారు" అన్నాడు రంగయ్య.

"నన్ను గుర్తుపట్టావా?" అడిగాడు అతను.

"లేదు! ఎవరో గుర్తు చిక్కలేదు బాబూ!" అన్నాడు అతను.

"నీకో కొడుకుండాలికదూ! వాడెక్కడ?" అడిగాడు అతను.

"ఏం చూడాలా? ఇక్కడున్నాను!" అన్నాడు ఆనంద్ వెనుకనుంచి వస్తూ.

ఠక్కున వెనక్కి తిరిగాడు ఆగంతకుడు.

"నువ్వేనా, నా స్నేహితుల్ని హత్యచేసింది!"

"అవును! నిన్నుకూడా హత్యచేసేది నేనే! నా అక్క ప్రాణాలు తీసినందుకు ఈ సంఘం, చట్టం మిమ్మల్ని శిక్షించ లేవు. అందుకని నేనే శిక్షించదలచుకున్నాను. అదీ చెప్పి. నా ఉత్తరం చేరిందా? నువ్వొక్కడివే అందరిలో తెలివయిన వాడివి కృష్ణారావు. నువ్వు చేసిన నేరం మర్చిపోనందుకు నాకు ఆనందంగావుంది. ఓమారు భగవంతుడిని తలుచుకో!" అన్నాడు రివాల్వరు గురిపెట్టి.

"నన్ను చంపొద్దు!" అన్నాడు కృష్ణారావు.

"ఆరోజు మా అక్కయ్యగూడా 'నన్ను చెరచొద్దు' అంటూ బ్రతిమలాడింది. విన్నారా?" అడిగాడు ఆనంద్.

"కామంలో పశువులైపోయాం! మా తప్పు క్షమించు."

"నేను క్రోధంతో రాక్షసుణ్ణయ్యాను" అంటూ రివాల్వరు నొక్కాడు. వరుసగా మూడుగుండ్లు కృష్ణారావు గుండెల్లో దూరాయి. మొదలు నరికిన చెట్టులా కూలి పోయాడు అక్కడే.

"బాబూ! నువ్వా!" రంగయ్య కొడుకుని కౌగిలించు

కున్నాడు.

"ఇన్నేళ్ళు ఎక్కడున్నావు బాబూ!"

"పగతీర్చుకునే ప్రయత్నంలో వున్నాను. దేశమంతా తిరిగాను. వచ్చాను. ముగ్గుర్ని చంపాను. మరో ఇద్దరున్నారు. వాళ్ళనుకూడా చంపాలి. అప్పుడుగాని నా పగ చల్లారదు నాన్నా!" అన్నాడు.

"వీళ్ళందర్నీ చంపితే మీ అక్క వస్తుందటా. నువ్వు కూడా నాకు దక్కకపోవడం తప్ప!" అన్నాడు రంగయ్య.

"నాన్నా! అక్కతోటే నేను చచ్చాననుకో. వెళ్తున్నాను. మళ్ళీ కలుస్తాం" అన్నాడు ఆనంద్ వెనక్కి తిరిగి వెళ్ళిపోతూ.

ఆనంద్‌కు పతినీ, రేఖనూ ఏంచెయ్యాలో తోచలేదు.

# 12

ఇద్దర్నీ చంపుతానని బెదరించాడు. ప్రాణాలపై తీపితో తనవెంట తిరిగి గదికి వచ్చేశారు. కానీ తనదగ్గర దొంగిలించిన కాగితాలు ఎంత వెతికినా కనుపించలేదు వాళ్ళదగ్గర.

ఇద్దర్నీ గదిలో పెట్టి తాళంవేసి వచ్చాడు. హోటల్ మానేజర్‌కు ఆపిల్ల తన మేనకోడలనీ, అతను ఆమెను లేవదీసుకువచ్చాడనీ, ఇద్దరూ విజయవాడలో చిక్కారనీ, యింటికి వాళ్ళ అమ్మనూ నాన్ననూ రమ్మని వైర్ చేశాననీ, వాళ్ళొచ్చిందాకా పారిపోకుండా వుండేందుకు తాళంవేసి వెళ్తున్నాననీ చెప్పాడు.

అతను తను చెప్పిన మాటలు నమ్మినట్లు కనుపించింది.

కృష్ణారావును చంపేందుకు బయలుదేరాడు. కానీ అతను తను వెళ్ళేసరికి ఇంట్లోంచి కార్లో బయలుదేరుతూండడం గమనించి, ఆటోలో తను వెంబడించాడు.

ఏలూరురోడ్ చివరంటా వచ్చాక అతనెక్కడి కెళ్తు

న్నదీ అర్థమైంది. ఆటోదిగి వెళ్ళాడు.

తండ్రి గుర్తొచ్చాడు. ఆయన దీనవదనం తలంపుకొచ్చి కళ్ళు ఆర్ద్రమయినాయి. అంతలోనే తన అక్క మాలక్ష్మి గుర్తొచ్చింది. ఆమెను ఆ రోజు వాళ్ళు పెట్టిన చిత్రవధ, చేసిన అవమానం, అది భరించలేక ఉరితీసుకొన్న ఉదంతం గుర్తొచ్చాయి. రక్తంపొంగి వేడెక్కింది.

ఇంకిద్దరు మిగిలారు. వాళ్ళను చంపేలోపల తను పట్టుబడగూడదు. అంతదాకా రేఖనూ, పతినీ, తన కస్టడీలో వుంచుకోవాలి. తాళంవేసి వాళ్ళను తను ఎన్నిదినాలో దాచలేననిపించింది.

పతిచేత హత్యచేయిస్తే!

ఆ ఆలోచన రాగానే, పతిని తన గుప్పిట్లో ఇరికించుకునేందుకు అంతకన్నా మంచిమార్గం లేదనిపించింది.

తన మాటవిని హత్యచేస్తాడా? రేఖను అతను సంప్రదిస్తే ఆమె అతన్ని ఆ పాడుపని చేసేందుకు ఒప్పుకోదు. పతిని తను పూర్తిగా అర్థంచేసుకున్నాడు. డబ్బుకోసం ఎంతనీచమైనా చేసే మనస్తత్వ మతనిది. ఒక్క హత్యకు ఐదువేలు ఇస్తానంటే ఎగిరిగంతేస్తాడు.

రామవర్మను చంపాలి. అతను తన నాలుగో విరోధి. అతని తర్వాత రాజశేఖరం వున్నాడు. రాజశేఖరాన్ని తనే చంపొచ్చు.

పోలీసులు తనకోసం వెతుకుతున్నారు. సాక్ష్యాలు సేకరిస్తున్నారు. కారును, మోటార్ సైకిల్ ను గుర్తుపట్టారు. ఇప్పుడెళ్ళివచ్చిన ఆటోనుకూడా గుర్తుపడతారు. ఆటోవాలా తన రూపురేఖలు వివరిస్తాడు. ఈ మూడు హత్యలతో తనెవరయిందీ కాస్త తెలివితేటలుపయోగిస్తే కనుక్కోగలుగుతారు

పోలీసులు.

అది తెలిసేలోపల తన విరోధు లిద్దర్నీ చంపాలి! మరు సటి దినం సాయంత్రంలోగా రెండు హత్యలు పూర్తి చెయ్యాలి!

ఆలోచిస్తూనే హోటల్ కు చేరుకున్నాడు.

మానేజర్ హాల్లోనే కూర్చునివున్నాడు. ఆనంద్ ను చూసి నవ్వాడు. ఆనంద్ గూడా నవ్వాడు.

"వైర్ చేశారా?" అడిగాడు.

"ఆఁ! తెల్లారేసరికి వస్తారనుకుంటాను."

"వాళ్ళు తలుపులుతట్టి, బాది నానాహంగామా చేశారు. ప్రక్కరూముల్లో వాళ్ళంతా విసుక్కోవడం మొదలెట్టారు. అందరికి సంజాయిషీ చెప్పుకొని, సర్దేసరికి నా తలప్రాణం తోకకొచ్చింది," అన్నాడు మానేజరు.

"మీకష్టం నాకు తెలుసు. తగినట్లుగా ప్రతిఫలం ముట్ట జెపుతాను" అన్నాడు ఆనంద్.

"ఆ మాత్రం అర్థంచేసుకొంటే చాలు! మీరు వెళ్ళండి. చాలా లేటయింది!" అన్నాడు మానేజరు.

ఆనంద్ మెల్లెక్కి పైకి వెళ్ళాడు. తాళం తీశాడు. పతీ, రేఖ లైటువేసుకొని కూర్చుని వున్నారు.

"మమ్మల్ని అనుమానించడం అనవసరం. నువ్వు చెప్పి నట్లు చేస్తామన్నాక ఇలా రూంలో పెట్టి తాళంవేసిపోవడం బాలేదు" అన్నాడు పతి.

"నా పనులు సవ్యంగా పూర్తిగావాలి! ఆ తర్వాత మీ ఇష్టమొచ్చినట్లు వెళ్ళండి. ఇవాళ నువ్వు నా వెంటవచ్చి సాయం చేసుంటే రెండువేలు వచ్చేవి. ఆ ఛాన్సు పోగొట్టు కున్నావ్!" అన్నాడు క్వార్టర్ బాటిల్ తీసి టేబుల్ పైన

పెడుతూ.

"అంటే ఇప్పుడింకో హత్య చేసొచ్చావా?" అడిగాడు పతి.

"ఆఁ!" అన్నాడు బాటిల్ మూతతీసి నోటి కందించు కుంటూ.

"నువ్వెందుకు చంపుతున్నావ్ మనుషుల్ని!" అడిగాడు పతి.

"మనుషుల్ని! ఎవరు? నేను చంపింది మనుషుల్ని కాదు. రాక్షసుల్ని. మదమెక్కి మత్తుతో, అక్క శీలాన్ని ప్రాణాన్ని అపహరించిన కిరాతకుల్ని నేను చంపింది" అన్నాడు ఆనంద్.

"ఇలా నువ్వే వాళ్ళను చంపేకంటే పోలీసులకు రిపోర్టు ఇస్తే పోయేదిగా" అంది రేఖ.

"వాళ్ళకు కావలసిన సాక్ష్యాలు ఎలా తేవడం! అంతా డబ్బున్న దొంగలు. దాంతో సులభంగా బైటపడతారు. అది నాకు ఇష్టంలేదు. అందుకే నేనే రంగంలోకి దిగాను" అన్నాడు ఆనంద్.

"ఇంకా ఎన్ని హత్యలు చేస్తావ్?"

"ఎన్నో లేవు! రెండేరెండు! నాకు సాయంచేస్తావా పతీ! నీకు మొత్తం పదివేలిస్తాను" అన్నాడు ఆనంద్.

పదివేలన్న మాట వినగానే పతికి మతిపోయింది. అంత డబ్బు ఒక్కసారిగా చూచిగూడా ఎరుగడతను. మొత్తం పద్నాలుగు వేలవుతాయి. వాటిని గుర్రాలపైన వేస్తే పద్నాలుగు లక్షలొస్తాయి. దాంతో హాయిగా త్రాగుతూ తిరగొచ్చు. కాలుపై కాలేసుకుని జల్సాగా జీవితం, రేఖతో గడపొచ్చు.

అలాంటి అవకాశం జారవిడుచుకోవడం అతని కిష్టంలేదు.

"అలాగే ఖచ్చితంగా సాయం చేస్తాను" అన్నాడు పతి.

"మోసం చేద్దామనుకుంటే మొదటికే మోసం జరుగు తుంది. ముగ్గుర్ని చంపిన నాకు, అవసరమైతే నిన్ను చంపడం పెద్ద పనిగాదు!" అన్నాడు ఆనంద్.

"ఆ విషయం నాకు తెలును," అన్నాడు పతి.

రేఖకు వొళ్ళు మండింది. మళ్ళీ పతి మామూలు ధోరణిలో పడిపోతూండడం ఆమెను బాధ పెట్టింది. అతన్నెలా రక్షించడమాని ఆలోచిస్తూ కూర్చుంది.

ఆనంద్ రెండు నీలం రంగు కవర్లు తీశాడు. వాటిలో రెండు త్తరాలు దోపి అంటించాడు. రెండింటిపైనా అడ్రసులు రాశాడు. రెండూ పతికిచ్చి "తెల్లారాక నువ్వు ఈ రెండింటిని వాళ్ళకందజెయ్యాలి. రెండూ పెద్ద బంగళాలే. బయట లెటర్ బాక్స్ వున్నాయి. వాట్ని వాటిల్లో పడేయ్! ఆ తర్వాత రామశర్మ ఎక్కడికెళ్ళేదీ, ఏం చేస్తుందేదీ గమనించి చూస్తూండు. నాకు రెండింటికల్లా ఫోన్ చెయ్యి. నేను గదిలో వుంటాను" అన్నాడు.

పతి కవర్లందుకొని జేబులో పెట్టుకున్నాడు.

సగం త్రాగిన బ్రాందీ సీసా పతివైపు తోశాడు ఆనంద్.

పతి దాన్ని అందుకుని అమాంతం ఒక్క గుక్కలో ముగించాడు దాన్ని.

# 13

ఎస్. పి. ఆదిత్యన్, క్రింది అధికార్లు సేకరించిన వివరాలన్నీ పరిశీలించాడు. అప్పటికి జరిగినవి మూడు హత్యలు. మూడూ ఒకేవ్యక్తి, ఒకే పద్ధతిలో, ఒకే రివాల్వరుతో, ఒకే

రకంగా చేశాడనేది నిర్వివాదాంశం.

దానిని తోడు హాతులు ముగ్గురూ వ్యాపారరీత్యానూ, వ్యక్తిగతంగానూ, స్నేహితులు.

మూడుహాత్యల తాలూకు వివరాలు ఆదిత్యన్ కొన్ని కొత్త విషయాల్ని ఆకళింపు చేసుకొనేందుకు అవకాశమిచ్చాయి.

హాతుడు కృష్ణారావు జేబులో నీలంరంగు కవరుంది. ఆ కవరు అందగానే బహుశా అతను తన్ను హాత్య చెయ్యదలచు కున్న దెవరో ఊహించి వుండాలి.

అతనికి కలిగిన అనుమానాన్ని నివృత్తి చేసుకునేందుకో, లేదా హాంతకుడెవరయిందీ తెలుసుకొనేందుకో బయలు దేరాడు. అతను తిన్నగా ట్రావెలర్స్ బంగళాకు వెళ్లాడు. అక్కడే హాత్యగావించబడ్డాడు.

సాక్ష్యాన్నిబట్టి ఒక యువకుడు ఆటోరిక్షాలో రైలు స్టేషను ప్రాంతంనుండి కృష్ణారావు ఇంటిదాకా వచ్చాడు. కృష్ణారావుగారు కార్లో బయలుదేరడం చూసి, ఆటోరిక్షా డ్రైవరును దాన్ని అనుసరించి వెళ్ళమన్నాడు.

ఆటోరిక్షాలోని వ్యక్తి, బంగళాకు కొద్ది దూరంలోనే దిగాడు. అతను వంద రూపాయల నోటిచ్చి చిల్లర తీసుకున్నాడు. ఆ నోటును డ్రైవరు పోలీసుల కిచ్చాడు.

దాని నెంబరునుబట్టి, అది తిరువనంతపురంలో నెలరోజుల క్రితం, రిటయిర్డు ఆర్మీ ఆఫీసరు ఇంట్లో జరిగిన దొంగతనం తాలూకు డబ్బులోనిదని తెలిసింది. సర్వీస్‌లోంచి రిటైరు అయ్యాక గవర్నమెంటు వాళ్ళిచ్చిన డబ్బు లక్షరూపాయల్లో యాభైవేలు బ్యాంకులో వేశాడు. ఇల్లు కొనుక్కొందామని దాచుకున్న డబ్బు యాభైవేలు, ఒక రివాల్వరు దొంగిలిం

చాడు. అతని ఇంట్లో పనిచేసే వ్యక్తి. అతను తెలుగువాడు. పేరు ముకుందం.

దేశంలో పోలీసులంతా ఆ ముకుందం కోసం గాలిస్తున్నారు.

దీన్నిబట్టి ఆ ముకుందం విజయవాడలో వున్నాడని ఆదిత్యన్‌కు అర్థమైంది. అక్కడ దొంగలించిన డబ్బు ఇక్కడ అతను ఖర్చుపెడుతున్నా డనిపించింది.

తిరువనంతపురం ఫోన్ చేసి, ముకుందం ఫోటో ఒకటి వెంటనే పంపమన్నాడు ఆదిత్యన్.

రేడియోద్వారా దొంగతనం చేసిన నోట్ల తాలూకు నెంబర్లు చెప్పి, అలాంటి నోట్లు మార్చేందుకు ప్రయత్నించిన వాళ్ళను, వెంటనే పోలీసులకు అప్పజెప్పమని అభ్యర్థన ప్రసారం చేయించారు.

తెల్లారేసరికి ముకుందం ఫోటో తీసుకుని పోలీసాఫీసరొకరు వచ్చారు తిరువనంతపురం నుంచి.

దాన్ని తీసుకొని జీపెక్కాడు ఆదిత్యన్. తిన్నగా ట్రావెలర్స్ బంగళాకు పోనిమన్నాడు.

జీపాగింది. లోనుండి రంగయ్య వచ్చాడు. పోలీస్ దుస్తుల్లో వున్న మనిషిని చూడగానే భయంతో బిక్కచచ్చిపోయాడు.

"రూం కావాలా బాబూ!" అడిగాడు వినయంగా.

"వద్దు. రాత్రి ఇక్కడ హత్య జరిగింది. అదే నీ కళ్ళముందే."

"అవును దొరా!"

"హంతకుణ్ణి చూశావా?"

"లేదుబాబూ."

"కృష్ణారావు ఎందుకొచ్చాడు?"
"తెలీదు బాబు."
"ఆయన్ను నీకు తెలుసా?"
"తెలీదండీ!"

"రంగయ్యా! అబద్ధాలు చెప్పి లాభం లేదు. నువ్వతనికి తెలుసు. అతన్ని నీకూ తెలిసుండాలి. అందుకే అతను నీ దగ్గరకొచ్చాడు. హంతకుడు నీకు తెలుసు. ఎవరతను చెప్పు. ఇప్పటికి మూడు హత్యలు జరిగాయి. ఇంకెన్ని జరుగుతాయో తెలీదు. పిచ్చిపట్టినట్లుగా అతను చేస్తున్న హత్యల్ని ఆపేందుకు మాకు సాయంజెయ్యి" అన్నాడు ఆదిత్యన్.

"నాకేం తెలీదు బాబూ! నన్నొదిలెయ్యండి!" అన్నాడు.

డి. ఎస్. పి. వచ్చి ఆదిత్యన్‌తో రహస్యంగా రెండు నిముషాలు మాట్లాడాడు.

"రంగయ్యా! నువ్వు చెప్పకున్నా మేము తెలుసుకున్నాం. నీకో కొడుకుండాలి. వాడేమయినాడు?" అడిగాడు ఆదిత్యన్.

"తెలీదు బాబూ! పదేళ్ళయింది పారిపోయి."

"వాడే ఈ హత్యలు చేస్తున్నాడు. నీ కూతురు ఉరి తీసుకుంది. ఆరోజు ఈ బంగళాలో ఐదుగురు వ్యక్తులు మకాం చేశారు. వాళ్ళను మేము విచారించాం అప్పట్లో. నీ కూతుర్ని వాళ్ళదగ్గరకు నువ్వు వెళ్ళమని బలవంతం చేస్తుంటే ఇష్టంలేక ఆమె ఆత్మహత్య చేసుకొందని వాళ్ళు సాక్ష్యం చెప్పారు" అన్నాడు ఆదిత్యన్.

"దొంగనాయాళ్లు! అలా చెప్పారా. వాళ్ళే నా బిడ్డను వేటాడారు. వాళ్ళను అప్పుడే చంపాల్సింది. ముసలోణ్ణి. సత్తువలేక మానుకున్నాను. నా కొడుకు కక్షగట్టి ఒక్కొ-

క్కుణ్ణి చంపుతున్నాడు. చంపనీ. మిగిలిన ఇద్దర్నీ చంపనీ, వాడేమయినా నాకు దిగులులేదు,'' అన్నాడు రంగయ్య.

ఆదిత్యన్ కు కళ్ళు ఆర్ద్రమయినాయి. ఈ పగపిచ్చిది గాదు. వెచ్చనిది. కానీ తను ఇలాంటి హత్యాకాండ జరుగ నివ్వగూడదు. ఆపాలి.

''ఎక్కడున్నాడు నీ కొడుకు.''

''తెలీదు.కృష్ణారావును వేటాడుతూ వచ్చాడు.చంపాడు. హత్యలు ఆపమని చెప్పాను. వాడు వినడు. వినలేదు. వెళ్ళి పోయాడు'' అన్నాడు రంగయ్య.

''ఇంక కొన్నిగంటల్లో మాకు చిక్కిపోతాడు'' అన్నాడు ఆదిత్యన్ జీపెక్కుతూ. రివ్వున దూసుకుపోయింది.

గదిలోకి అడుగు బెడుతుండగానే ఫోన్ మ్రోగింది.
రిసీవరు పైకెత్తాడు ఆదిత్యన్. ''యస్. పీ. హియర్'' అన్నాడు.
''నేను సార్ రామశర్మను మాట్లాడుతున్నాను'' అన్నాడు అవతలి వైపునుండి.

''రామశర్మా!'' అర్థంగాక అడిగాడు.

''హార్డువేర్ మర్చెంట్ ను సార్! నన్నుకూడా చంపుతా నని ఉత్తరం వచ్చిందిసార్! మీరే కాపాడాలి!'' అన్నాడు ఏడుస్తూ.

'నీలాంటివాణ్ణి కాపాడేందుకు కాదు నేనుంది?' అందా మనిపించింది ఆదిత్యన్ కు. కానీ యూనిఫాం చూసుకుని ''మీరేం భయపడకండి. దగ్గరున్న పోలీస్ స్టేషనుకు ఫోన్ చేసి చెప్పండి. తగిన బందోబస్తు చేస్తారు,'' అన్నాడు ఆది త్యన్ ఫోన్ పెట్టేస్తూ.

# 14

"మే ఐకమ్!" తలుపు దగ్గర నిలబడ్డ రేఖ అడిగింది. ఆదిత్యన్ తలఎత్తి చూశాడు. మాసిపోయిన బట్టలు, రేగిపోయిన తల, అసహ్యంగా కనుపించిందా అమ్మాయి.

"ఎవరు నువ్వు?"

"నా పేరు రేఖ. ప్రస్తుతం ఇక్కడ హత్యలు చేస్తున్న దుర్మార్గుణ్ణి మీకు పట్టిచ్చేందుకు వచ్చాను," అంది రేఖ.

"కూర్చో! చెప్పు!" అన్నాడు ఆదిత్యన్.

రేఖ తనకు తెలిసిందంతా ఏకరువు పెట్టింది. తన వూహ అన్నీ కరెక్టయినందుకు సంతోషపడ్డాడు.

"ఇప్పుడు పతి ఎక్కడున్నాడు" అడిగాడు.

"రామశర్మ ఇంటి ప్రాంతాల్లో తచ్చాడుతూంటాడు. అతన్ని పట్టుకొని నాలుగు తన్నండి. ఆ తర్వాత తిన్నగా హోటల్‌కు వెళ్ళండి ఆనంద్ అక్కడే వున్నాడు" అంది రేఖ.

ఆదిత్యన్ డ్రస్ మార్చుకుని రివాల్వరు జేబులో పెట్టుకున్నాడు. రేఖను వెంటబెట్టుకుని రామశర్మ ఇంటికి వెళ్ళాడు.

వీధి మొనలోని సిగరెట్ల బంకుదగ్గర బల్లపైన కూర్చుని పేపరు చదువుతున్న వ్యక్తిని చూపించి "అతనే పతి" అంది రేఖ.

ఆదిత్యన్ దిగివెళ్ళి అతని చెయ్యిపట్టుకున్నాడు. పతి విదలించుకొని పారిపోయేటందుకు ప్రయత్నించాడు. కానీ వీలుగాలేదు.

ఆదిత్యన్ పతి చేతులకు బేడీలు తగిలించి లాక్కొచ్చి జీపులో పారేశాడు.

"డర్టీబిచ్, నువ్వా ఈపని చేసింది!" ఉగ్రుడయ్యాడు పతి.

"నేనే చేశాను గాబట్టి బ్రతికిపోయావ్. లేకుంటే నువ్వూ చచ్చేవాడివి," అంది రేఖ.

"ఆనంద్ గురించి అంతా చెప్పావా?"

"ఆఁ! మొత్తం చెప్పాను ఈయనెవరనుకున్నావ్! జిల్లా పోలీస్ సూపరింటెండెంటుగారు" అంది రేఖ.

# 15

జీప్ ట్రావెలర్స్ లాడ్జి ముందాగింది.

ఆదిత్యన్ రేఖను వెంటబెట్టుకొని దిగాడు.

"ఆనంద్. ఆరో నెంబరు రూంలో వున్నాడు," అంది రేఖ.

"అదెక్కడ? మేడమీదనా?" అడిగాడు ఆదిత్యన్.

"అవును. జాగ్రత్తగా వుండాలి మీరు. అతని దగ్గర పిస్తోలుంది."

"ఫరవాలేదు! నా దగ్గరా రివాల్వరుంది" అన్నాడు ఆదిత్యన్.

ఆదిత్యన్ మానేజర్ను పిలిచి తనెవరయిందీ చెప్పి, 6 వ నెంబరు గదిలో వున్న వ్యక్తిని అరెస్టు చేసేందుకు తను వచ్చానని చెప్పాడు. మానేజర్కు చెమటలు పోశాయి.

మేడమీద గదుల్లో వున్న జనాన్నంతా క్రిందికి దిగి వచ్చెయ్యమని చెప్పాడు మానేజర్. ఒక్కో రూం వద్ద కెళ్ళి కిటికీ తలుపు దగ్గర కూర్చుని చూడసాగాడు ఆనంద్ రూముల్లో వున్న జనమంతా దిగిపోవడం కనుపించింది. ఆ వెళ్ళటంలోనూ హడావుడీ, తొట్రుపాటు కనుపించాయి.

ఇద్దరు ముగ్గుర్ని పిలిచాడు. ఎవ్వరూ దగ్గరకు రాలేదు.

తను బాత్రూంలో వుండగా వెలుపల బోల్ట్ పెట్టి, తను వేసిన తాళం పగులగొట్టి రేఖ వెళ్ళిపోయింది. అప్పుడే

తనకేదో ప్రమాదం జరగబోతూందని ఊహించాడు. అందు వల్లే తలుపులు బిడాయించుకుని కూర్చున్నాడు.

ఛస్తున్నందుకుగానీ, పోలీసులకు పట్టుబడుతున్నందుకు గానీ అతనికి దిగులులేదు. మిగిలిన ఇద్దర్నీ చంపలేకపోయా నన్న బాధ ఎక్కువైంది ఆనంద్ కు.

కిటికీ వారగా వస్తూ మానేజర్ "నిన్ను పట్టుకోనేందుకు యస్. పి. గారొచ్చారు. జాగ్రత్త!" అన్నాడు, అతనివద్ద ఉదయం అందుకున్న రెండువందరూపాయల నోట్లను గుర్తు తెచ్చుకొని.

తను చెయ్యగలిగిందేమీ కనుపించలేదు.

పోలీసులకు పట్టుబడి వాళ్ళచేత శిక్షింపబడటం అతనికి ఇష్టంలేదు. ధైర్యంగా ముగ్గుర్నీ చంపాడు. మరో ఇద్దర్నీ చంపాలనుకున్నాడు. వాళ్ళ చావు భగవంతుడు తన చేతిలో రాయలేదనుకున్నాడు.

యస్. పి. మెట్లెక్కి పైకి రావడం చూశాడు. అతని చేతి లోని రివాల్వరు మెరిసింది ఎండలో. తల దగ్గరున్న రివా ల్వరును చూసుకున్నాడు. తండ్రిని తలచుకున్నాడు. అక్క గుర్తుకొచ్చింది. ఆమె దగ్గరకే తను వెళ్ళాలనుకున్నాడు.

రివాల్వరు కణతకు గురిపెట్టుకున్నాడు. ధాంమ్మని ప్రేలింది. ఆనంద్ అమాతం కూలబడ్డాడు.

తలుపుల్ని తన్నుకొచ్చిన ఆదిత్యన్ కు పడున్న శవాన్ని చూసి ఆర్ద్రమయినాయి కళ్ళు.

—:ఐ పో యిం ది:—

# చివరిపేజీ వినోదం

## 15

ఒక దొంగ యింట్లో దూరాడు. డబ్బున్న బీరువాకోసం వెదుకుతున్నాడు.

అంతకు ముందే ఆ ఇంట్లో ఇంకో వ్యక్తి దేనికోసమో వెదుకుతున్నాడు. అతనుకూడా తనలాగే దొంగయి వుంటాడని భావించి. అతన్ని సమీపించి. "ఎంత దొరికిందేమిటి?" అన్నాడు రహస్యంగా.

"అబ్బే! ఇంకా దొరకందే? మా ఆవిడ ఎక్కడ దాచిందో ఏమిటో?" అన్నాడా ప్రబుద్ధుడు విసుక్కుంటూ.

• • •

"ఏమిరోయ్! ఈ చెప్పుల దుకాణం ఎప్పుడు తెరిచావ్ ఇంతకుముందు అమ్మాయిలవెంట అల్లరి చిల్లరిగా తిరిగేవాడివి. ఇంత సడన్‌గా మంచి వాడిగా మారి వ్యాపారం ఎప్పుడు ప్రారంభించావు? అమ్మాయిలమీద మోజు తగ్గిందా?"

"లేదు. వారి దయవల్లనే ఈ వ్యాపారం వృద్ధవుతోంది" అన్నాడతను తాపీగా.

• • •

"ఏమిటోయ్, ఇంటర్వ్యూ ఎలా జరిగింది? సెలక్టవుతావా?" అడిగాడు యీ మధ్యనే వుద్యోగం పోయిన రామంని. అతని మిత్రుడు.

"ఇంటర్వ్యూలో అన్నీ సరిగానే చెప్పాను. కాని సెలక్ట్ కాను?"

"అదేం?" ఆశ్చర్యంగా అడిగాడతను.

"నేను ఉద్యోగంలో వుండగా, నేను ఇంటర్వ్యూ చేసిన అతనే ఇప్పటి ఆఫీసర్. నా ఇంటర్వ్యూలో అతను సెలక్ట్ కాలేదు."

—పి. ప్రభాకరరావు, రామజిపల్లి.

## 16

ఓ పెద్ద ధనవంతుడి భార్య వివాహ వార్షికోత్సవం జరుపు కొంటోంది. విందు మధ్యలో ఆవిడగారి అంతరంగిక స్నేహితు రాలికో అనుమానం వచ్చింది.

స్నేహితురాలు:- మీ పెళ్ళయి ఎన్నేళ్ళన్నావు?

ధ.భా:- ఈ రోజుకు ముప్ఫై ఏళ్లు.

స్నేహితురాలు:- ఈ ముప్ఫై ఏళ్ళలో మీ ఆయనకు విడాకు లివ్వాలని ఎప్పుడూ అనిపించలేదా?

ధ.భా:- లేదు. ఆ ఆలోచన రాలేదు....ఎప్పుడు చచ్చిపోతా డని తప్ప?

• • •

ఆకాశంలో జెట్ విమానం జుయ్‌మంటూ దూసుకుపోతోంది. కాక్‌పిట్ తలుపులు తెరుచుకొని హఠాత్తుగా పైలట్ ప్రయాణీ కుల మధ్యకు వచ్చాడు.

"మీలో దేవుడు తప్ప మనిషిని ఆపదలో రక్షించేవాడు లేడు, అని నమ్మేవాళ్లెవరయినా వున్నారా?" అడిగాడు.

"ఆ! నేను వున్నాను. ఏం?" అన్నాడో పరబ్రహ్మం తన్మ యంతో.

"అయితే సరే! ఇంజన్లో పెట్రోలైపోయింది. పారాచూట్ ఒకటి తక్కువగా వుంది....మిగతా అందరూ తలా ఒక పేరా చూట్ తీసుకోండి!"

• • •

ఇద్దరు పెద్దమనుషులు తమకు తెలిసిన మరో పెద్దమనిషి గురించి చర్చించుకొంటున్నారు.

మొదటి పె. మ:- వాడంతటి పరమనీచుడు, దుర్మార్గుడు, కపటి, ద్రోహి, స్వార్థపరుడు, త్రాగుబోతు, వ్యభిచారి మరోడు లేడు. మీరేమంటారు?

రెండవ పె. మ:- మీరు మరీ ఘోరంగా చెపుతున్నారు.... అతన్ని మీరు సరిగా ఎరగరనుకొంటాను?

మొదటి పె. మ:- అక్కడే మీరు పొరబడ్డారు. నా ఆప్త మిత్రుల్లో వాడు మొదటివాడు!

• • •

ఒంటి నొప్పులతో బాధపడుతున్న ఓ రోగి డాక్టర్ దగ్గరికి వెళ్ళాడు. ఆయన పరీక్ష చెయ్యడం నచ్చిన రోగి, "మీకు రోగం గురించి బాగా తెలుసనుకొంటాను డాక్టరుగారూ!" అని మెచ్చుకొన్నాడు.

"తెలియకేమండి! పదిహేనేళ్ళనుండి ఈ రోగంతోనేగా నేను బాధపడుతుంటా!"

—కామెడీకింగ్, విజయవాడ.

# 17

"లేటెస్ట్‌గా ఓ కొత్త మోడల్‌కార్ వచ్చింది సార్. అది ఎలాటి గుట్టనైనా ఎక్కేస్తుంది" అన్నాడు సేల్స్‌మాన్.

"మీ కార్లన్నీ అంతే!" ఒప్పుకుంటూ అన్నాడు కష్టమర్. "క్రితంసారి మీ వద్ద తీసుకెళ్ళిన కారు ఓ చెట్టునే ఎక్కబోయింది!"

• • •

పెరేడ్‌కి ఓ పోలీస్ ఆలస్యంగా వచ్చాడు.

"ఏం?" అడిగాడు అధికారి. "ఇంత ఆలస్యం?"

"మా సార్జెంట్‌గార్ని ఓ గాడిద వెనక కాళ్ళతో మొహం మీద తన్నేసింది సార్!" అన్నాడా పోలీస్. "దాన్ని బాగుచేసి వస్తున్నాను."

"ఏం బాగుచేశావ్?"

"ఆ గాడిద వెనక కాళ్ళని సార్!"

• • •

ఓ లక్షాధికారి కొడుక్కి వేటంటే అమితఇష్టం. ఓ రోజున తన సెక్రెట్రీతో వేటకెళ్లి సాయంత్రానికి బాగా అలసిపోయి వచ్చాడు ఖాళీ చేతుల్తో.

అది చూచి ఆ లక్షాధికారి సెక్రెట్రీని అడిగాడు. "ఏం మా వాడు సరిగా గురిచూచి కొట్టలేదా? ఖాళీ చేతుల్తో వచ్చాడు."

"అయందేముంది సార్! ఆ పక్షులపైన దేవుడి దయ వుంది. ఈయన తూటాలకి అందలేదవి. అంతే!"

—మల్లాది సూర్యనారాయణ, ఏలూరు.

# 18

కామాక్షి:- ఏమండీ మీ ఇంటి ముందు 'అరువు అడగవద్దు' అని బోర్డు పెట్టారు. ఏమైనా అమ్ముతున్నారా?

మీనాక్షి:- అదేంలేదు. వంట వస్తువులు అరువు ఇమ్మని ప్రతిరోజు ఈ చుట్టుప్రక్కల ఇళ్ళలోని వాళ్ళందరూ వచ్చి నా ప్రాణాలు తీస్తున్నారు.

కామాక్షి:- ఓహో అందుకనా! బావుంది. మా ఇరుగు పొరుగు వాళ్లకూడ నన్ను ఇలాగే వేధించుకుంటున్నారు. నీ కెంతో పుణ్యం వుంటుంది కాని ఆ బోర్డు రెండు రోజులపాటు మాకు ఇస్తావా?

• • •

ఒకావిడ పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేసింది.

"హలో. ఇన్‌స్పెక్టర్! నెలరోజుల క్రితం మా ఆయన కనబడటం లేదని మీకు రిపోర్టు ఇచ్చాను. మీరు శ్రమపడ నవసరంలేదు. మా ఆయన ఇపుడే జైలునుండి తిరిగి వచ్చారు."

• • •

ఖైదీ:- (సెంట్రీతో) ప్రక్క సెల్‌లో వున్నతను దేశభక్తుడా? అస్తమానం, స్వరాజ్యం! స్వరాజ్యం!! అని కలవరిస్తున్నాడు.

సెంట్రీ:- కాదు. అతని ప్రియురాలి పేరు స్వరాజ్యమట!

—కె. చందర్‌రావ్, హైద్రాబాద్.

# 19

"నువ్వు రావుగారి చావు చూసావా?" సాక్షిని ప్రశ్నించాడు పి. పి.

"చూసానండి," సాక్షి చెప్పాడు.

"ఎక్కడ?" ఆత్రుతగా అడిగాడు పి. పి.

"సెకెండ్ హాండ్ బుక్ స్టాల్‌లో."

• • •

డిటెక్టివ్ అసిస్టెంట్ కోసం జరుపుతున్న ఇంటర్వ్యూలో—

"నీకు అపరాధ పరిశోధన అంటే ఇష్టమా?"

"అవునండి. మా వూళ్లో మొట్టమొదట 'అపరాధ పరిశోధన' ను కొనేది నేనే సార్!"

• • •

ఒకసారి చిన్నబజారుగుండా ఒక హంతకుడు పారిపోయాడు. అతని గుర్తులు తెలుసుకోడానికి ఇన్‌స్పెక్టర్ దర్యాప్తు ప్రారంభించాడు.

"దొంగ ఎలా వుంటాడు?" అడిగాడు ఎదురుగావున్న ముగ్గురిని.

"అతని వాచ్‌ది బ్లూ కలర్ డయల్ సీకో వాచి." వాచ్ రిపేరు షాపు అతను.

"అతనివి ఎంబాసిడర్ బూట్లు. బ్లాక్ కలర్." చెప్పాడు బూట్ పాలిషర్.

"అతని పాంట్ బెల్ బాటమ్‌ది. బెల్ దాదాపు 20 వుంది." చెప్పాడు టైలర్.

• • •

"నా గుండె నొప్పి పూర్తిగా తగ్గిపోయింది కదా?"

"ఆ తగ్గిపోయింది."

"ఎలాంటి భయంకర వార్త విన్నా ఆగదుగా డాక్టర్!"

"లేదు. ఆగదు."

"హమ్మయ్య! ఇక మీ బిల్లు వినిపించండి?"

• • •

పెళ్ళికూతురుని ఒక పాట పాడమన్నారు పెళ్ళిచూపులలో.

"నూకాలమ్మను నేను, నీ భరతం పడతాను ...." పాడ సాగింది పెళ్ళికూతురు.

పెళ్ళికొడుకు పరుగు పుచ్చుకున్నాడు.

—రమణశ్రీ, విజయవాడ.

## 20

"రాధాదేవీ! రాధాదేవీ!" దబదబ తలుపు బాదేశాడు హరి క్రిష్ణ.

తలుపు తెరిచి అడిగిందామె. "ఏమిటయ్యా?"

"మీ వారిని బీచ్‌లో ఎవరో పొడిచి చంపేశారు."

"అయితే మాత్రం! తలుపులు అంత గట్టిగా బాదాలయ్యా! నెమ్మదిగా పిలువలేవూ?" హూంకరించిందా మహాఇల్లాలు.

• • •

వార పత్రికలో వరుడు కావలెను ప్రకటన చూసి, ఆ రోజే పెళ్ళి అయిన రామరాజు ఆసక్తిగా చదువుకున్నాడు.

"పద్దెనిమిదేళ్ళ యువతికి వరుడు కావాలి. పిచ్చి, మూగ, ఫిట్స్, చెముడు వున్న ఈ యువతికి లక్షరూపాయల ఆస్థి వుంది. ఇష్టమున్న యువకుడు క్రింది చిరునామాకు వ్రాయ వచ్చు."

చిరునామా చూసి నవ్వుకున్నాడు రామరాజు. భార్యను పిలిచి ఆ ప్రకటన చూపించాడు.

ఆమె నవ్వి, పేపర్‌మీద పెన్సిల్‌తో ఏదో వ్రాసి తెచ్చి భర్తచేతికి ఇచ్చింది.

"క్షమించండి. ఆ యువతిని నేనే." అని వుందా కాగి తంలో.

• • •

మేజిస్ట్రేట్:- దొంగతనం నేరం అని తెలియదా?

దొంగ:- తెల్సు లేవయ్యా! సోది అడక్క, శిక్ష ఎంతో చెప్పు!!

• • •

"మిస్టర్! నువ్వు శత్రు గూఢచారివి. నాకు అర్థమై పోయింది. మర్యాదగా చేతులు ఎత్తిపెట్టి, కళ్లు మూసుకో."

"ఇంతకూ మీరెవరు?"

"ప్రఖ్యాత ప్రైవేట్ డిటెక్టివ్‌ని. నా పేరు జాంగో."

"జాంగోగారూ, నేను శత్రుగూఢచారిని కాదు."

"మరైతే ఉదయంనుంచీ వేషాలు మారుస్తూ, టాక్సీలు మారుతున్నా వెందుకూ?"

"నేను, మా టైపిస్ట్ రోసీతో పిక్చర్‌కు వెళ్ళానని తెల్సు కొని, మా ఆవిడ నాకోసం వెతుకుతూంది."

• • •

"హల్లో రాజారావుని మాట్లాడుతున్నాను. మీరెవరు?"

"నా పేరు సీత."

"సీత-గీత-బబిత-సరిత-అనిత-సునీత-నా తలరాత! ఇంతకు మీకెవరు కావాలి తల్లీ?"

"వాళ్ళెవరూ అక్కరలేదండి. మీ ఆఖరు అబ్బాయిని పిలవండి, చాలు."

—శశిభూషణ్.

# 21

"అబ్బబ్బ! నీతో వేగలేకుండా వున్నానే. నీ పోరు పడలేక ఏ సన్యాసుల్లోనైనా కలిసిపోదామనిపిస్తోంది. ఒక్క పెళ్ళాం వుంటేనే ఇన్ని ఇక్కట్లు అనుభవించాల్సి వస్తోంది. ఇక పదహారువేలమంది గోపికలతో ఆ కృష్ణపరమాత్మ ఎలా నెగ్గుకురాగలిగాడో?"

భార్యామణి విస్తుపోయింది.

"మరీ చిత్రంగా మాట్లాడకండి. ఆ కృష్ణుడు అనుభవించిన పాట్ల ముందు మీవీ ఒక లెక్కేనా?"

"అంటే?"

"నేనేం అలకపాన్పు ఎక్కి మీచేత బ్రతిమాలించుకున్నానా? మిమ్మల్ని తన్నానా? పారిజాతపు చెట్టు తెమ్మన్నానా? అలా సినిమాకి వెళ్ళివస్తాను, కాస్త పిల్లల్ని ఆడిస్తూ వంట చేయమన్నాను. అంతేగా!"

◆ ◆ ◆

"హిందూ దేవాలయాలన్నీ ధ్వంసం చేసిన ఔరంగజేబు దక్షిణాదిన వున్న కొన్నిటి జోలికిమాత్రం పోలేదు. ఎందుకో తెలుసా?"

"ఎందుకు?"

"తిరుపతి కొండపైకి కొంతదూరం తన భటులతోసహా వెళ్ళిన ఔరంగజేబు గాండ్రుమంటూ పులిరూపంలో వచ్చేసిన వేంకటేశ్వరస్వామి ధాటికి ఆగలేక, పలాయనం చిత్తగించాడు. ఆ పలాయన వేగంలో మరే దేవాలయాల గురించి ఆలోచించే అవకాశం లేకపోయింది ఆయనకి."

♦ ♦ ♦

ఇద్దరు పెద్దమనుషులు వేదాంతం గురించీ, దేవుళ్ళ గురించీ మాట్లాడుకుంటున్నారు.

"ఒక చిక్కుప్రశ్న నన్నెప్పుడూ వేధిస్తూ వుంటుంది. భారతదేశంలో ఎక్కడయినా చూడండి. దేవుళ్లు, దేవతలు చాలచోట్ల కొండలపైనే వెలిశారు. దక్షిణాదిన విజయవాడ, అన్నవరం, తిరుపతి, యాదగిరి గుట్ట, సింహాచలం, పళని, ఉత్తరాదిన భద్రీనాథ్, కేదర్‌నాథ్. ఇలా కొండలపైనే దేవుళ్ళవతరించడానికి కారణ మేమై వుంటుంది?" ఒక వేదాంతి తన అనుమానాన్ని వెలిబుచ్చాడు.

రెండో వేదాంతి సమాధానం చెప్పాడు.

"మొట్టమొదట జనబాహుళ్యంలోనే అవతరించి వుంటారు. కాని రానురాను ప్రజల బాధలు, అజ్ఞానం చూడలేక, వినలేక కాస్త విశ్రాంతికోసం కొండలపైకి వెళ్ళి, తర్వాత అక్కడే సెటిల్ అయిపోయి వుంటారు."

—కావూరి భాస్కరరావు, సికింద్రాబాద్.

# 22

రంగారావు, కొడుకు అల్లరి భరించలేక చెడామడా కొట్టేశాడు.

చివరికి నిస్పృహగా కుర్చీలో కూలబడుతూ, "నే చేసుకున్నపాప ఫలితంగా పుట్టావురా, నువ్వు!" అన్నాడు కోపంగా.

"మరి నన్నంటావేం" అన్నాడు కొడుకు చిరాగ్గా.

• • •

డిటెక్టివ్ ఆరోగ్యం వళ్లో చేరాడు వంశాంకురం.

వం:-నాన్నా, నీకు దొంగలంటే భయమా?

ఆ:-లేదు, బాబూ!

వం:-హంతకులంటే భయమా?

ఆ:-లేదు. వాళ్ళేనన్ను చూసి భయపడతారు.

వం:-పులంటే భయమేనా?

ఆ:-అదేం చెయ్యదు బాబూ!

వం:-మరి సింహం అంటే...?

ఆ:-లేదు, దాన్నినా తుపాకితో కాల్చేస్తాను.

వం:-మరి, నీవు దేనికి భయపడతావు?

ఆ:-మీ అమ్మకు!

• • •

ముగ్గుర్ని హత్య చేసిన నేరానికి మరణశిక్ష విధించారు ముద్దాయికి.

జడ్జి:-నీ చివరి కోరిక ఏమిటి?

ముద్దాయి సందేహించాడు.

''చెప్పు'', ప్రోత్సహించాడు జడ్జి.

ముద్దాయి:- నేను హత్య చేయాల్సిన వారిలో మరోకడు ఉండిపోయాడు. వాడినికూడా చంపే అవకాశం యివ్వండి.

—యం. వి. సుబ్బలక్ష్మి, చిక్కడపల్లి

## 23

కొన్నాళ్ళు సినిమాహాలు గేట్‌మాన్‌గా పనిచేసిన వ్యక్తి బస్సుకండక్టరయ్యాడు.

ఒకనాడు అతను బస్సు డోర్‌వద్ద నిలబడ్డాడు. ఇంతలో

ముందే టికెట్ కొనుక్కొని, కాఫీ త్రాగి రావడానికి వెళ్ళిన ఒక వ్యక్తి బస్సు ఎక్కుతున్నాడు.

వెంటనే కండక్టరు అతనిని వుద్దేశించి, "మీ టికెట్ ఏది," అని అడిగాడు.

ఆ వ్యక్తి జేబులో నుండి టికెట్ తీసి ఇచ్చాడు.

వెంటనే కండక్టరు టికెట్‌ను రెండు ముక్కలుచేసి, ఒక ముక్క ఆ వ్యక్తి చేతిలో పెట్టాడు.

• • •

పరంథామయ్య:-రఘురామయ్యగారూ! విన్నా మీ ఇంటి పక్కాయన మీ గురించి చాలా చెప్పాడండీ!

రఘురామయ్య:-మా ఇంటి ప్రక్కాయనా? అతను అన్నీ అబద్ధాలే చెపుతాడండీ. అతని నోటి వెంట ఒక్క నిజంరాదు. ఇంతకీ నా గురించి ఏమి చెప్పాడండి.

పరం:-మీరు చాలా మంచివారనీ, అబద్ధాలు ఆడరనీ....

• • •

ఒక యువతి తండ్రి సగర్వంగా ఇలా చెప్పుకున్నాడు—

"మా అమ్మాయిని చేసుకుంటే 'ల'కారం కట్నం ఇస్తాను."

వెంటనే పెళ్ళి చూపులకు వచ్చిన యువకుడు లేచాడు వెళ్ళటానికి.

యువతి తండ్రి:-ఏం బాబూ! 'ల' కారం కట్నం అనగానే లేచిపోతున్నావు?

యువకుడు:-ఏమీలేదూ! మీరు ఇచ్చేకట్నం 'ల' కారం అయితే, మీ అమ్మాయి 'వి' కారము అని వేరే చెప్పక్కర లేదు. వస్తాను!

• • •

టీచర్:-ఒరేయి గోపీ! సత్యహరిశ్చంద్రుడి కథవలన మనకు తెలిపిన నీతి ఏమి?

గోపి:-అబద్ధం ఆడనివాడు అష్టకష్టాలుపడి, అడవులపాలై భార్యా బిడ్డలను అమ్ముకొని, శ్మశానంలో కాటికాపరిగా జీవిస్తాడు. అందుకని, ఎప్పుడూ అబద్ధం ఆడుతుండవలెనని నీతి సార్.

—పెంటకోట సోమినాయుడు, యలమంచిలి.

## 24

ఓ కుర్రాడు పరుగెడ్తున్నాడు. వెనకలావుగా వస్తాదులావుండి, బుర్ర మీసాలతో, దుబ్బు జుట్టుతో ఒకడు పరిగెడ్తున్నాడు. ఎలాగైతేనేం పట్టుకున్నాడు అబ్బాయిని. వాడు ఏడుపు లంకించుకున్నాడు.

"ఉష్ గట్టిగా ఏడ్చావంటే చంపుతా-ఈ చాక్లెట్లు తీసుకోరా

అంటున్నాడు ఆ వస్తాదు. ఇదంతా చూస్తున్న పోలీసు "ఏయ్ ఎవరు నువ్వు? పిల్లవాడ్ని మాయచేసి ఎక్కడికి రమ్మంటున్నావ్ పద స్టేషనుకి-" అన్నాడు.

అప్పటికే నలుగురు ప్రోగయ్యారు. "పట్టుక తన్నండి." అంటున్నారు. వీరుడిలా కన్పించేవాడు కాస్తా భీరువై పోయాడు.

"అయ్ బాబోయ్! నేను పిల్లల్నెత్తుకుపోయేవాడ్నికాదు నాయనోయ్-వాడు నా కొడుకేనర్రోయ్-బడికెళ్లకుంటేను-" అంటున్నాడింకేదో—

అంతే! ఎక్కడి వాళ్ళక్కడ జారుకున్నారు.

• • •

ఒక పార్కులో భార్యభర్తలు కూచోన్నారు. ఒంటరిగా పార్కుకెళ్ళే భర్తంటే అనుమానం ఆ గయ్యాళి ఇల్లాలికి. తానూ వచ్చింది. ఎవరి ట్రాన్సిస్టర్‌లోనో పాట వస్తూంది, అందాల రాముడు చిత్రంలోని "రాముడే మన్నాడోయ్.... నీ ప్రక్కనున్న రక్కసిని చూడ మన్నాడోయ్...."

"అబ్బ! ఎంత మంచిపాట!" అంటూ భార్యవైపు చూశాడు భర్త. భార్య అతడిని ఉరిమి చూపింది.

• • •

లక్ష్మీదేవినీ, శేషతల్పాన్నీ, తననూ తడిమి తడిమి చూసుకుంటున్నాడు విష్ణుమూర్తి. "ఏమిటండీ—అలా తడిమి చూస్తున్నారు. ఎందుకు?" అడిగింది దేవి.

"ఆ.... క్రింద భూలోకంలో- నా భక్తుడెలా గావుకేకలు పెట్తున్నాడో విను—"

"ఉన్నావా? అసలున్నావా? ఉంటే...." భక్తతుకారం పాడుతున్నాడు.

"అందుకే...అనుమానం వచ్చి...."

—యం. విద్యుల్లత, విశాఖ.

